


## స్త్రీలు: వార్తాపత్రికానిర్వహణము

"వార్తాపత్రికానిర్వహణము పడుచువారివృత్తి. ఒకవ్యక్తినుండి అంతకంటె హెచ్చుగా పనినిగొనువృత్తి మఱియొకటిలేదు. కాని ఒకని వ్యక్తిత్వము, శక్తి, కార్యదీక్ష ప్రదర్శించుటకు గాని, దేశమునందలి కర్మయోగులపరిచయము కల్గించుకొనుటకుగాని, ప్రపంచనాటకమును పరిశీలించుటకు అనువైనస్థలమున నుండుటకుగాని ఈ వృత్తివలె వీలును కలిగించువృత్తియు మఱియొకటిలేదు. వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగా గొనదలచిన స్త్రీకి—ఆరోగ్యము, విద్య, వార్తలుకూడబట్టునేర్పు, తాను పత్రికానిర్వహణమున పేరుగాంచవలయునను కాంక్ష అనునవి ముఖ్యలక్షణములుగా నుండవలయును. ఇవి ఒక్కచో మేళవింపునొంది యుండుట అరుదే కాని అవిఅన్నియు కూడియుండినగాని స్త్రీ తాను వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగాగొని జయముగాంచజాలదు. వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగా గొని పెక్కురు స్త్రీలు తమ ఆరోగ్యమును చెఱుచుకొనుట మనము తఱచు చూచుచున్నాము. ఆవృత్తియందు దినమునకు హెచ్చుకాలము పనిచేయవలసియుండును. ఒక్కొక్కప్పుడు విశ్రాంతినైన తీసికొనక ఒక్కబిగిని ఏడెనిమిదిగంటలు పనిచేయుచునే ఉండవలసివచ్చును. ఈవృత్తియందు జయముపొందదలచినస్త్రీ ఇట్టికష్టములను ఇష్టముతోడనే సహింపవలయును. చలి, ఎండ, వాన, మంచు అను వీనిని పాటింపక ఆమె పని చేయవలసివచ్చును. వార్తలుగొనిరా సంచారమునకు ఏగుచో ఒక్కొక్క తరుణమున తిండి, నిద్ర, శుభ్రవస్త్రములు లేకయే ఆమె పనిచేయవలసియుండును. ఆమె చలింపనిదీక్ష, పనికి వెఱవనిబింకము, చెదరనిఓర్పు కలిగియుండవలెను. కావుననే పలువురుస్త్రీలు వార్తాపత్రికానిర్వహణము ప్రత్యేకము పురుషులవృత్తిగా పరిగణించుచున్నారు. స్త్రీపురుషుల ఇరువురిలో పురుషుడే ఈ వృత్తికి బాగుగా తగియున్నాడనుట నిశ్చయమే. ప్రయాణములందు పురుషునకుగల సౌకర్యములు స్త్రీలకు ఉండజాలవు. పురుషునకు పోరానిచోట్లు లేవు.

ఆతనియెడ అపాయశంక అంత విస్తృతముగాదు. అయినను మనదేశమున స్త్రీలు వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగా గొని చూపుచున్న కార్యదీక్ష నిరుత్సాహమును పుట్టించునదిగా లేదని ధైర్యముతో చెప్పగలను. వార్తాపత్రికానిర్వహణవృత్తిలో జయముగాంచుటకు ముఖ్యసాధనములలో నొకటియగువిద్య మనదేశస్త్రీలకు బాగుగ గలదు. ఇందుకు తోడు వారు నిరంతరపు సత్ఫలనాభిలాషిణులుగ నుందురేని వారి కీవృత్తియందు జయము కలుగుననుట నిశ్చయము. ఇక వార్తలు కూడబట్టుప్రజ్ఞ విషయము. ఈ ప్రజ్ఞ యొకకళ. అనేకకళలవలె ఇదియు దైవదత్తముగా రావలసినదే. పుట్టుకచే కలిగినదానికి సాధనచే మెఱుగులు పెట్టనగును. క్రొత్తవిషయములు తెలిసికొందమను ఆతురతగలవారే వార్తలు కూడబట్టుటలో ప్రజ్ఞావంతులు. ఆరోగ్యవర్ధనము, రచనావైదుష్యము వీనికితోడు నూతన విషయాన్వేషణ కాంక్షయు వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగా గొనదలచిన స్త్రీల కుండవలయును. తిలకించుట, కూలంకషముగ పరిశోధించుట, శీఘ్రముగ గ్రహించుట, సులభముగ సుందరరచనమున ప్రదర్శించుట—ఇవి వార్తలు కూడబట్టువారికి వలయును. తాను వార్తాపత్రికానిర్వహణమున జయము గాంచవలయునను కాంక్షగల స్త్రీ వివిధదేశముల చరిత్రలు, మహాపురుషుల జీవితములు, అర్థశాస్త్రము, సాంఘికశాస్త్రము, రాజ్యాంగతత్త్వము, మనస్తత్త్వశాస్త్రము, సారస్వతము మొదలగువానిని బాగుగ చదువవలయును. వార్తాపత్రికానిర్వహణవృత్తిలో విద్యార్థులకు తరిబీతునిచ్చు విద్యాలయములయందు అధమము మూడుసంవత్సరములైన విద్యాభిక్షగొనవలయును. అయితే అంతమాత్రమున ఈ మూడు సంవత్సరములును వారు పత్రికలతో ఎట్టి సంబంధమును లేకుండవలయునని నాతలంపుగాదు. ఈ మూడుసంవత్సరములను వారు పత్రికలకు ధారాళముగ వ్రాయుచు తమ రచనమును సాపు దేర్చుకొనవచ్చును. సెలవుదినములలో వారివారి తావులకుపోయినప్పుడు ఆయా తావులయందలి విశేషములను ఉచితరీతిని పత్రికలకు వ్రాయుచుండవచ్చును. న్యూయార్కు-హెరాల్డు ట్రిబ్యూనుకు అనుబంధముగ ప్రచురింపబడు ఆదివారపుపత్రికకు సంపాదకురాలై, అమెరికాదేశమున పత్రికాసంపాదకవృత్తియందు హెచ్చుజీతము తెచ్చుకొనుచున్న స్త్రీరత్నము విలియమ్‌బ్రౌన్ మెలోనీసతిని; రాజ్యాంగవిషయకరచనములయందే తమజీవితములను వెచ్చించుచున్న ఆనీఫోర్డుకన్య, ఫ్రాంసిస్ పార్కిన్‌సన్ కేయస్ సతిగార్లను; ఫిలాడెల్ఫియా పబ్లిక్ లెడ్జరు అను పత్రికకు 'ఇరోతికో బజారు వెచ్చముచేయుట' అనుశీర్షిక క్రింద వ్యాపారవిషయములు అత్యద్భుతముగ వివరించుచు ఆపత్రికయొక్క ప్రచారబాహుళ్యమునకు ప్రధానకారకురాలైన మేరీ గ్రేస్ రామీని; చికాగోట్రిబ్యూను పత్రికకు 'సౌందర్యపోషణ' అను శీర్షిక క్రింద అపూర్వవిషయములు క్రోడీకరించుచు ఆ పత్రికకు ప్రతిష్ఠసంపాదించుచున్న యాంటాయినెట్టు డోనెల్లీని; న్యూయార్కు ఈవినింగు టెలిగ్రామ్‌కు సంపాదకీయములు వ్రాయుచు వీనుమిగులుచున్న జేన్‌డిక్సన్‌ను; న్యూయార్కు-హెరాల్డు ట్రిబ్యూనుకు విదేశవిలేఖరినిగా పని

చేయుచు ప్రఖ్యాతిగాంచుచున్న డరోతీథాంప్సన్ (కవియగు సింక్లరులూయిస్ భార్య)ను మనము సందుంచుకొని మనదేశస్త్రీలు వార్తాపత్రికానిర్వహణవృత్తియందు ఉత్సాహముతో చొరబడి దేశసేవగావింపవలయునని హెచ్చరించుచున్నాను. వార్తాపత్రికాకార్యాలయమున పనిచేయుటచే మనకు మానవహృదయమును తెలిసికొనునేర్పు, ప్రజాసంఘముయొక్క ఆదర్శములను ఆకళించుప్రజ్ఞ, కలిగినఊహలకు అక్షరరూపము ఇచ్చు సదవకాశము ఉండును. వృత్తిగా పత్రికానిర్వహణము ఉల్లాసము గూర్చునది. ఒక్కొక్కప్పుడు అది ఆర్థికముగాగూడ లాభించుచుండును. ఇంతకును ఈవృత్తిచే ఆర్భాటమెఱుగని దేశసేవచేయుటకు లెక్కింపరానన్ని వీళ్ళు కలవు. కావున అమెరికనుస్త్రీలు ఈవృత్తివిషయమై విశేషశ్రద్ధ వహింపగోరెదను" అని ఈనడుమ కేథరైన్ ఓగ్లెస్‌బీకన్య అమెరికను స్త్రీలసభలో ఉపన్యసించినది. విద్యావంతమై నాగరికతాశిఖరమధిష్ఠించిన అమెరికాదేశముననే పెక్కురు స్త్రీలు వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగాగొనుటకు చొరబాటుండగా స్త్రీవిద్య కూడనా కూడదాఅను వాదపుపొలిమేరను దాటకుండిన మనభారతదేశమున వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగాగొన్నస్త్రీలు వ్రేళ్ళపై లెక్కింపగలిగినంతమందిమాత్రమే యుండుట ఆశ్చర్యముకాదు. శ్రీప్రెస్సు సంపాదకులు సదానందుగారిభార్య, స్త్రీధర్మను నిర్వహించుచున్న శ్రీమతీ ముత్తులక్ష్మిరెడ్డి, ఇండియన్ లేడీస్ మేగజిన్‌ను నడుపుచున్న సత్యనాథను సతి, ఇండియన్ సోషల్‌రిఫార్మరు పత్రికాసంపాదకులగు నటరాజన్‌గారికుమారై మున్నగు వారు ఏకొలదిమందియో భారతస్త్రీలు వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగాగొని యున్నారు. వంగదేశమున, కేరళదేశమున ఆయాదేశభాషలయందు కొందరుస్త్రీలు పత్రికలు నిర్వహించుచుండుట వినవచ్చుచున్నది. కాని మనఆంధ్రదేశము అనేకవిషయములందువలెనే ఈవిషయమునందును మిక్కిలి శోచనీయస్థితియందున్నది. వార్తాపత్రికానిర్వహణమును వృత్తిగాగొన్నస్త్రీ తెలుగుదేశమున ఒకరైనగూడ లేదనుటకు విచారించుచున్నాము. తుదకు మనదేశమున స్త్రీలపత్రికలుకూడ పురుషులచేతనే నిర్వహింపబడుచువచ్చుచున్నవి. ప్రస్తుతము 'హిందూసుందరి' స్త్రీచే సంపాదితము. కాని కార్యాలయమున వ్రాతకోతలు పురుషులేచేయుచుందురని విందుము. ఈఐదుసంవత్సరములుగ మేమీపత్రికానిర్వహణమున ఉత్సాహవతులగు స్త్రీలను తరిబీదుచేయుటకు ప్రయత్నించుచునేయున్నాము. కాని విద్యావతులగు స్త్రీలు ఏలకో ముందునకు రాకున్నారు. ఆంధ్రస్త్రీలు విద్యావిషయమున భారతదేశమునందలి అన్యజాతిస్త్రీలకు తీసిపోరు. వ్యాసరచనావ్యాసంగము వారియందు పరుగులువాఱుచున్నవిషయము 'గృహలక్ష్మి' ప్రతిసంచికయు ప్రదర్శించుచునేయున్నది. కాని మహాగ్యమున మనస్త్రీలు తమవిద్యకు ఉచితోపయోగ్యవృత్తిని కల్పింపకున్నారనుకొందుము. ఇదియే నిజమగునేని ఆమహాగ్యము మాధ్యమునకు పర్యాయమనుటకు మే మెంతమాత్రమును సంకోచింపము. ఇకనైన ఆంధ్రస్త్రీ లీవృత్తివిషయమున శ్రద్ధవహింపవలయునని హెచ్చరింతుము. 'గృహలక్ష్మి' వారికి వలయుసౌకర్యములను గలిగింప సర్వవేళల సంసిద్ధమైయున్నది.

# మీరాబాయి

వఝ్ఝల కాళిదాసుగారు

[మీరాబాయి యుదాత్త ప్రేమోద్రేక ముకల యున్నతమూర్తి. ఆమె భక్తిగీతములనెన్నియో పాడినది. అణుస్వరూపమైన యనంతప్రేమమూర్తికి, అనంతస్వరూపమైన యణువులో నాదే కలయిక. లోకమామెను తృణీకరించినది. జననీజనకు లామెకువిసమిడిరి. తటిల్లతవలె మెరసిన యామె కాంతిమాత్రము స్థాయీభావము చెందినది.]

రాణి

ఈశిలలోన జీవమువహించిన దేవుఁడొకండుకల్గు నం
చాశలుపూనెదేల తనయా! జడబుద్ధి త్వదీయహాసరే
ఖాశరదిందుచంద్రికలు కాన్కలు వెట్టెదవేల? భక్తినం
దేశము లంపుచుండు సరణిన్ దిలకించెదవేల? చెప్పుమా!
ప్రాణములేని యీప్రతిమఁబట్టి సజీవము దైవమంచు, ని
ద్రాణములైన యీకనులు తమ్ముల చెల్వము నీనునంచు, పా
షాణమెయైన యీమెయి ప్రసన్నత కాకరమంచు దీనిపైఁ
బ్రాణముఁబెట్టుదేల? తనయా! త్యజియింపుము వెఱ్ఱిచేష్టలన్.

మీరాబాయి

మల్లికాఫుల్లపుష్పసంపదలలోన
నెవని నిట్టూర్పుగాలి శయించియుండు?
గాంగధావ తరంగసంఘములలోన
నెవనిమురళి పాటలను మ్రోయించుచుండు?
అతఁడుకన్పించు భావనేత్రాంచలముల
హృదయముల విప్పిచూచుచో నెల్లరకును.
జడమెయైనట్టి యీతెల్లచలువరాయి
లోనఁ గృష్ణునిహాసవల్లులు పెనఁగొను;
మూఁగవోయిన యీచిరుమోవిమీఁదఁ
గృష్ణమురళీనినాదవాహిని తడఁబడు.

రాజు

రాలిపోవుచుక్కల నంబరమ్ము మరచు
విధమునన్ నీవు నీశిలావిగ్రహమ్ము
మరచిపొమ్ము; పూవుల గాలి చెరచునట్లు
భగ్నమొనరింపు మీశిలాప్రతిమనింక.
సకలసామ్రాజ్యపాలకమకుటరత్న
భూషితమహాకిరీటమో, స్ఫురితగాఢ
తామసీవినీలోరగోదగ్రభయద
ఘోరవిషమొ, ఇందేదియో కోరుకొమ్ము.
ఈవిషానలకీలల నీవిలాస
తరళతారుణ్యమెల్ల దగ్ధముగుగాక
దానఁ బరిశుద్ధగాలీనమానచంద్ర
బింబము కళంకరహితమై వెలుఁగుగాక!

మీరాబాయి

ఈవిషపాత్రలోపల నదే-యిదె; నాచిరునవ్వు వేల్పు రూ
పే-విసమెల్లఁ గాంతిమయమే! పువురేకులకాంతులే! మెహో
జీవసుధాప్రవాహములె చేతులనెత్తి హసించుచున్ ననున్
ద్రావుమటంచుఁబల్కు- మధురమ్మగు నీరవగీతికావళిన్.

# విశ్వము : వీణ

శ్రీమతి రాజేశ్వరిగారు

"రాజ్యం! వీణపాటలోపడి గృహలక్ష్మికి వ్రాయడమే మానేసేవు చాలారోజులాయ"నంది మాఅక్కయ్య.

తెల్లవారుజాము నాలుగుగంటలు కావచ్చినది. వీణ సాధకమునకు లేచి కూర్చున్నాను. మాఅక్కయ్య మాటలకు నవ్వువచ్చినది. "గృహలక్ష్మికి కథ వ్రాద్దామంటే అందలి కథాసంప్రదాయం అత్తాకోడళ్ల విరుద్ధనాగరకత, అందుచే "ఆయన"కు కలిగే ఆరాటం, చివరకు కోడలిగెలుపు, అత్తగారి అయిష్టమగు రాజీ—ఈమొదలగు విషయముల లోనే గుంజుకుంచము లాడుతూంది. స్త్రీల కట్టికథలచే గలిగే ఉద్బోధ స్వల్పం."

నామాటలు వింటూనే మాఅక్కయ్యకు విషయం దురవగాహం అయిపోయిందికాబోలు! లేచి పెరట్లోకి వెళ్లిపోయింది ప్రాతఃకృత్యములేవో చూచుకుందికి.

మంచుదట్టంగా వర్షిస్తూంది. వెన్నెల. నిద్రిస్తూన్న వీణ తంత్రిలాగు చలిగాలిలో విశ్వమంతా ముడుచుకుపోయింది. భావగర్భితమైన నాదంవలె దూరంగా కోటలోనినగారా మెల్లగాప్రారంభమైంది. "భవనుత నాహృదయమున రమింపు"మనేకృతి మంద్రంలో ఎత్తుకునేసరికి, విశ్వకల్యాణమూర్తికి హృదయం సమర్పిస్తూన్న ఆహ్వానం తంత్రులనుండి మారు మ్రోగింది!

హృదయప్రవృత్తిని ఊగులాడించే స్వభావముగల యీ సంగీతసాహిత్యము లేనాడుపుట్టినవో? మామూలుమాటలే; అవికూర్పులలోగల వివిధరీతులచే వివిధరసము లుద్భవించును. అవి ఉచ్చరించుటలో ధ్వనిభేదములచే ప్రకృతియే వివిధరీతుల చిగిర్చును. ఆదికవీశ్వరుని "మానిషాద"అను శ్లోకముతో సృష్టియంతయు క్రౌంచమిధునవియోగమునకు కన్నీరు రాల్చినదేమో! ఆదికవయిత్రి, ప్రేమమయియగు తల్లి, ముద్దుబిడ్డను కట్టుబట్ట వియ్యాలగాకట్టి జోలపాడి నపుడు, అర్థమేమని జగమెవ్వరును ప్రశ్నింపని ఆయమృత వాక్కులకు, బిడ్డయేకాదు, తన్మయియగు తల్లికూడ నిద్రింప వలసినదేకదా!

ఇట్టి సశరీరస్వర్గసౌఖ్యము ను ప్రసాదించుప్రభావ మెందుండి వచ్చినది? జడాత్మకముగ నుద్భవించిన ప్రకృతికి జీవమిచ్చినది ధ్వని. కన్నులతో చూచిన పేలవమైతోచు పరిసరమున కలంకృతి కూర్చినది నాదము. జడస్వరూపమునను న్న అహల్య శ్రీరామచంద్రుని యడుగులచడి కల్లంత దవ్వున నుండియే హార్షోత్కంఠతచే కంపించియుండును. నిశ్శబ్దమగు తరుణమున నొకయెండుటాకుపాటుచే పరిసరమందొక జీవత్కళ గోచరించును. సంస్కృతమున మాటకు "శబ్ద" మనుటలో నెంతపరమార్థమున్నది!

మానవహృదయమునకు బాహ్యానుభవముల నుగ్రహించే శక్తినిబట్టియే అది సాహిత్యవతియగు సరస్వతి వీణను కేల ధరించియుండును. వీణ మనహృదయమునకు ముకురము వంటిది. శ్రుతితంత్రులమీటునపుడు ఆజల్లుమనునాదములో మంటినుండి మింటివరకు విశ్వమంతను కలయగప్పు నొక చేతనము స్ఫురించును. అప్పటిమనహృదయము, కాలఘోషమొనర్చు సముద్రతటమున కూర్చుని చేటమొదలు కాటివరకుగల జీవయాత్రనొక్కపరి ఆనందముతో సింహావలోకనమొనర్చునట్లుండును. ఆశ్రుతిస్వరములో యేమెట్టుపై మెట్టినను అద్వితీయానందానుభవమే—అనగా ఆజీవితసింహావలోకనమున ఏపురావిషయము హృదయమున కెదురొత్తినను ఆనందజనకమే, యాత్ర కడముట్టిన వెనుక, మునుపటిదారిలోని యిక్కట్టుల జ్ఞప్తికూడ సుఖమిచ్చినట్లు.

లేదు. ఈనాటి కది పూర్తిగ అంతరింపనున్నది. పదురెండేండ్ల బాలామణి కరాంగుళస్పర్శచే పులకింపవలసినవీణ భాగవతాదుల పాడుంకాయపోట్లవినోదమునకు గురియైనది. బాపురుమను హార్మోనియము బాలికల భాగ్యదేవతయైనది. వీణకు మగవ్రేలిమీటు అపథ్యము. కనుకనే చతురుడైనను చతురాననుడు ప్రియురాలి స్వాధీనమొనర్చెను. ఎర్రని గులాబినోటిలో వ్రేలుంచి యుగ్గుపట్టగల గృహలక్ష్మి వీణపై వ్రేలువేయుదగునుకాని, కరకుపనులకు చురుకైన పురుషుని కరముకాదు. ఇల్లాలి వీణానిక్వణనమున గృహాదైవతములు చేతనములై ఆశీస్సులు వర్షింపగల సౌభాగ్యము భారతావనియందు పునరుద్భవింపజేయుట సోదరీమణుల కర్తవ్యము.

# ప్రణయాదర్శము

డా॥ టుకూరు సత్యనారాయణ రావు బహద్దరు గారు

కొమరుం బ్రాయపునిక్కకొండెవలపుల్ గోరాడ శుద్ధాంతవా
సము ధన్యమ్ముగఁజేసుకొంటివి; నిరాశాతప్తశుష్కాశ్రువుల్
కలియన్ గన్నులమూతవెట్టువిధి నీకై సిద్ధమైయుండె, దు
ర్గమభూముల్ గమియించునంట పతి, ఔరా! యెంత రాగుండెవో!
ఒకనాఁ డేమి? చతుర్దశాబ్దముల కుద్యోగించె సేవావ్రతం
బకలంకమ్ముగు భ్రాతృపాదముల; మేలౌ, లక్ష్మణా! నీప్రతి
ష్ఠకుఁగా నెంతటిసాధ్వి నీదుసతి వెంటన్ వచ్చుచో సేవసల్
వికలంబౌనని కోర్కెలాచుకొనుచున్ వీడ్కొల్పె నిర్ముక్తమై
బేలతనాన బల్కినది భీతివహింపను పోయిరండటం
చాలలితాంగి, భూషణములన్నియు నూడ్చి కషాయచేలముల్
దాలిచి వచ్చి నాథునిపదస్థలి నిల్చిన కూలిపోయె ను
ద్వేలముగాఁగ నూరుపులు; తీవ్రవిషాదభయాకులాంగియై.
ఆరామానుజు డంత ప్రాణసతి బాహామండలింజేర్చి, తా
గారామొప్పఁగ వేణి నించుక పరిష్కారమ్ము గావించుచున్
తేరన్ బల్కె ప్రియోక్తులన్ జనకధాత్రీనాథసత్పుత్రివై
ఈరీతిన్ వగపూనగా తగవటే? ఏణీవిలోలేక్షణా!
చూడు కపోలపాళిసొగసున్ చిరుగుంటల లేతహాసపుం
బోడిమిదక్కె, నూర్పులు గుబుల్కొని వక్షము కాంతిమాసె, మా
రాడకు పోయివచ్చెద నిరంతర మత్తలసేవ నీకగున్
పాడి త్రిలోకపూజ్యరఘువర్యపదాంబుజసేవ నాకగున్.
ప్రాజ్ఞులకుగూడ నందరాని బ్రహ్మ
తేజమది యాకృతినిగొంట తీరదయ్యె
రామభద్రున కీగతి, బ్రతికియుండి
జన్మధన్యమ్ముగా సేవసలుపవలదె?
ఈయదృష్టము నాకు గల్పింపు మబల!
తనచివురుంగరమ్ముల నెదన్ గదియించి యెదో యపూర్వభా
వనహృదయమ్ము చీల్చుకొని భవ్యపథమ్మున రేకులెత్తినన్
వనిత! చతుర్దశాబ్దములు భారపుదీనపుబ్రహ్మచర్యమున్
గొనిరె, సతీమహాత్మ్యములకున్ సరిపోలునె సర్వధర్మముల్!
ఎపుడో విశ్వగర్భాన ద్రవించిపోయి, ఆ పవిత్రప్రణయగాథ అంకితమయి
చిత్రరీతులచివురించి చేవదేరె, ఆర్యరమణీమనోవీథులందు నేడు.

# పేదవాని పలుకులు

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్ గారు బి. ఏ.

౧

లేమికన్నను కష్టమే లేదటంచు
మనుజులెల్లరు దలతురు మహిని నేడు;
లేమికన్నను సౌఖ్యమే లేదు జగతి
లేమిగలవాడె కష్టములేనివాడు.

౨

పాపభీతి లేక పరులను వంచించి
కోట్లకొలది ధనముకూడబెట్టి
అనుభవింపలేక యంతరించుటకన్న
లేమిగలిగియుంట లెస్సగాదె?

౩

పూరికొంపలోన పూటబత్తెములోడ
గంటినిండ నిద్ర గల్గియుందు;
ఇనుపపెట్టెలోన ఇన్నూరువేలతో
నిదురలేని రేయి నేనెరుంగ.

౪

పరులజాడ నాకు పరులకు నాజాడ
తెలియకుండ భువిని తిరుగుచుందు;
పొట్టగడుపుకొనుచు నెట్టులో గడుపుదు
కాలమెల్ల నిట్లు గనులుమూసి.

౫

లేమిగల్గిన కష్టము లేలగలుగు—
కలిమిగల్గినయంతనే గలదెసుఖము?
నిరత మీభువిజనులకు గొరతలేదు—
నారుపోసినదేవుడే నీరుపోయు.

౬

పరులయున్నతిగాంచి నే బరితపింప;
కలియొ గంజియొ త్రాగుచు గడుపుకొందు—
నన్ను నేగాంచి వింతగా నవ్వుకొందు—
ధన్యుడెవ డింక నాకన్న ధరణియందు?

# సన్న్యాసము

**శ్రీమతి బి. జ్ఞానాంబ గారు**

౧

మహారాణీ—పుత్రా!........

తరుణరాజకుమారుడు—అమ్మా! నాకు వివాహ మక్కఱలేదు.

మహారాణి—(బాష్పరుద్ధకంఠములో) "నా యీదిన్నికోర్కెను నెరవేర్పుము.

* * *

శ్రావణసజలసంధ్య. మగధమహారాజకుమారుఁడు లోహితాశ్వదుర్గమండలి ఉన్నతవాతాయనాభిముఖుఁడై నిలిచియుండెను. పంకకళంకితజలప్రపూర్ణయగు స్వర్ణభద్ర ఉత్తుంగతరంగములతోఁ గ్రీడించుచుండెను. మేఘాచ్ఛన్నధూమ్రలాకాశము మీఁదను—జలమగ్నధరిత్రీమధ్యమునను—క్షితిజములపైనను ప్రకాశించుచున్న సంధ్యారుణప్రభ విశ్వవిమోహినియైన ప్రకృతిదేవి ధరించిన సిందూరరేఖను స్ఫురింపఁ జేయుచుండెను. శ్రావణసజలశృంగారసంధ్య. మగధేశ్వరి సాశ్రునయనములతో రాజకుమారుని గంభీరముఖమండలమును తిలకించుచుండెను. స్వర్గమండలి పవిత్రప్రకాశధార భూతలముపైఁ బ్రవహించినట్లు వాతాయనమార్గమునుండి స్వర్ణనిభ సంధ్యాప్రభ వారిరువురిపైఁ బ్రసరించుచుండెను.

మహారాణి—ప్రియపుత్రా! నాయీవృద్ధనేత్రములకిది అంతిమవాంఛ.

రాజకుమారుడు—అమ్మా! సరేగాని యీస్వర్ణభద్రానది తన స్వాప్నికసంపద కెంత పొంగి పోవుచున్నదో చూడుము. నిన్నమొన్నటివరకు దీని నిశ్శబ్దోత్సంగమునందు అనంతవాలుకారాశిసమేతుఁడై ప్రభంజనుఁడు ప్రళయతాండవమును గావించుచుండెను.

మగధేశ్వరి చేలాంచలముతోఁ గన్నీటి నాపుకొనుచు నిష్క్రమించెను.

స్వర్ణభద్రానది విశాలహృదయమండలి సంకల్పవికల్పసంఘూర్ణనముభంగి తరంగమాలికలు రెగిరి పడుచుండెను.

౨

నవయౌవనమదోన్మత్త—పాంచాల రాజకుమారి రాజకుమారునితో నిట్లనెను—ఆర్యా! మీరు కడు నీరసముగ నున్నారు.

రాజకుమారుఁడు 'ధమ్మపదము'ను పఠించుచుండెను. తథాగతుని మహిమామండితప్రశాంతతపోమగ్నమూర్తి అతని సుకుమారహృదయశతపత్రముపై విరాజమాన మగుచుండెను. రాజకుమారుఁ డొకయనిర్వచనీయసుఖానుభూతిలో మైమఱచుచుండెను. చైత్రసమీరుఁడు వనకుసుమసౌరభములఁ గొనితెచ్చి ఆయేకాంతగృహమున విడుచుచుండెను.

దుర్గకుడ్యముపై సుఖోపవిష్టమైయున్న కపోతమిథునము చంచువులతో నొండొంటిని చుంబించుకొనుచుండెను. గానగర్వితపరభృతబృందముతోడను—మధుపానమత్తమధుపసమూహముతోడను వనములన్నియు నిండియుండెను. ప్రకృతి తనసౌందర్యమునకు తానే ఆశ్చర్యముగ్ధయైనది.

రాజకుమారి అన్యమనస్కుఁడైన రాజకుమారుని యొడిలోనున్న గ్రంథమునెత్తి దూరముగాఁ బారవైచెను.

రాజకుమారుఁ డొకదీర్ఘనిశ్వాసమును విడిచి కిటికీవైపు దృష్టినిగిడించెను. కాని అతనినేత్రములకు హృదయముతో సంబంధము లేకుండెను. అభిమానినియగు రాజకుమారి శరవిద్ధకురంగివలె తూలిపోయెను. భువనమోహనలావణ్యమున కిట్టి తిరస్కారమా—ఉఫ్!

చకితస్వరముతో కోయిలకూసెను. కించిదుష్ణశీతలసమ్మిళితసమీరసంస్పర్శనముచే రాజకుమారుని నేత్రాంచలములు బరువెక్కినవి. రాజకుమారి కఠినస్వరముతో నిట్లనెను.

"రాజకుమారా! మీరు వివాహమాడరా?"

రాజకుమారుఁ డామెవంక వీక్షింపకయే దృఢ

వ్యంజకస్వరముతో నిట్లనెను.

"లేదు. సన్యాసమును స్వీకరించెదను."

"ఎందుకు?"

రాజకుమారుఁడు ప్రత్యుత్తర మొసంగలేదు. వసంతవాతాహతిచే రాజకుమారి మేలిముసుఁగు తొలఁగిపోయెను. ఆమె వక్రాలకములు చిరుతరఁగలవలె గాలిలో నెగురఁ జొచ్చెను.

ఇంత ఉపేక్షయా? నారీహృదయమింతటి యుపేక్షణీయమా? రాజకుమారి వెడలిపోయెను. ఆమె గంభీరచరణపాతధ్వనులచే వాయుమండలము క్షుబ్ధమయ్యెను.

వసంతానిలుఁడు రాజకుమారుని చెంపపై యొక మృదుచపేటమును ప్రసాదించి 'మూర్ఖా!' అనెను.

రాజకుమారుఁడు చకితుఁడై హృదయముపై చేయి యిడుకొని తనలోమరల 'మూర్ఖా!'అనుకొనెను.

ఆమ్రనికుంజమునుండి కోయిల 'కుహూ'నినాద మొనరించెను.

3

రాజకుమారి తనమేనత్తయైన మగధేశ్వరి నిట్లడిగెను.

"మాతాజీ! నాప్రతిమను నిర్మించుట కొక మణుగు బంగారు కావలసియున్నది."

రాజకుమారి యభీష్టము తత్క్షణమే నెరవేర్పఁబడెను. చతురస్వర్ణకారుల సమ్మెటప్రేటులచే రోహితాశ్వదుర్గము ప్రతిధ్వనించి పోవుచుండెను. రాజకుమారి స్వర్ణకారుల కిట్లాజ్ఞాపించెను.

"మీరు నిర్మించుమన్న ప్రతిమ సరిగా నన్నుఁ బోలియుండవలెను. లేనియెడల మీ హస్తములు తునకలై పోఁగలవు."

ప్రతిమ తయారయ్యెను. స్వర్ణకారుల కళావిభవ మందు సువ్యక్తమగుచుండెను. ప్రేక్షకులా ప్రతిమ నవలోకించి ఆశ్చర్యవిహ్వలులైరి.

సన్మానవిధి మేలెంచెను. గజాశ్వములు—వస్త్రభూషణములు—కాంచనరత్నములు స్వర్ణకారదళము నకు సమర్పింపఁబడెను.

స్వర్ణప్రతిమ రాజకుమారి యేకాంతగృహమునఁ బ్రవేశపెట్టఁబడెను. రాజకుమారి తనవస్త్రభూషణములచే దానినలంకరింపఁజేసి అద్దమునెదుట నిలిపెను. తాను దానిపార్శ్వమున నిలిచెను. ఒక క్షణమైన పిమ్మట రాజకుమారి యున్మాదినిఁబోలె ప్రతిమను దూరముగా నెట్టివైచి యిట్లనెను.

"గయ్యాళీ! దూరముగానుండుము. నాతో స్పర్థ నీకేల?"

రాజకుమారియొక్క యీయపూర్వసాఫల్యమునకు నిదర్శనముగా స్వర్ణకారులు మరల బహూకరింపఁబడిరి. స్వర్ణప్రతిమ భావిభిక్షుకుఁడగు రాజకుమారుని శయనగృహమందు ప్రవేశపెట్టఁబడెను.

౪

శయనమందిరమందలి రత్నఖచితశయ్యపై నాసీనుఁడై రాజకుమారుఁడు విచారదృష్టితో స్వర్ణప్రతిమను వీక్షించుచుండెను. తివాసీపైనొకమూల 'ధమ్మపద', 'త్రిపిటక' గ్రంథములును—సప్తస్వరగర్భిత యగు రాజకుమారి వీణెయు తిరస్కృతావస్థలో పడియుండెను. బుద్ధవిగ్రహము మెడలో వాడిపోయిన పుష్పహార మొకటి వ్రేలాడుచుండెను.

ఫాల్గుణ మధ్యనిశ. రజనీగంధభారవహుఁడగు మలయానిలుఁ డాశయనగృహమందు మెల్లమెల్లగాఁ బ్రవేశించెను. స్వర్ణప్రతిమా సౌందర్యము నపహరింపఁ గోరి కాబోలు శశికిరణములు గవాక్షములనుండి తొంగిచూచుచుండెను.

సుఖస్వప్నమువోలె రాజకుమారిమందిరమునఁ బ్రవేశించెను. ఆమెపాదశబ్దప్రహారముచే రాజకుమారుని యేకాగ్రతాతంతుజాలము ఛిన్నభిన్నమై పోయెను. రాజకుమారి కపటమందహాసముతో నిట్లు ప్రశ్నించెను.

"సాధకప్రవరా! సన్యాసము నెప్పుడు స్వీకరింప నిశ్చయించితిరి?"

రాజకుమారుఁడు ప్రతిమపైనున్న దృష్టిని మరలించుకొని యొకవేడినిట్టూర్పుఁబుచ్చి యిట్లువచించెను.

"నాకెప్పుడు సన్న్యాసముపై వాంఛలేదు. వివాహ మాడెదను."

"ఎవరి కట్టి సౌభాగ్యప్రదానముఁ గావింతురు.?"

రాజకుమారుఁడు మారుమాటాడక స్వర్ణప్రతిమ వైపు వ్రేలుఁజూపించెను.

*　　*　　*

రాజకుమారియొక్క అగరుధూపను వాసిత కుంచితాలకములతో నాడుకొనమరగి మలయానిలుఁ డామందిరమందలి దీపశిఖను వ్యాకులమొందించెను. పాప మాయభాగ్యశాలిని రెండుమూడుపర్యాయములు తలపంకించి అంధకారగర్భములో నదృశ్యయయ్యెను కుండలీకృతధూమరాశి గృహోపరిభాగమునకు సాగిపోయెను.

ఫాల్గుణపౌర్ణమీజ్యోత్స్నాస్నాతరజనీనిరావృతవేళయందు రాజకుమారుఁ డపరాధిమాడ్కి వినమితమస్తకుఁడై కూర్చొనియుండెను. అతనియెదుట మహామహిమామయియగు దేవీమూర్తివోలె విజయినియైన పాంచాలరాజకుమారి నిలిచియుండెను.

—అనువాదము.

# మాఘము

హరి రాధాకృష్ణమూర్తిగారు

యౌవనమీని యాసతములై పవమానకిశోరుఁడింత సం
భావనసేసిన న్గలకఁబారి కృశించిన శాలియష్టులం
బోవగనూడ్చి రమ్యమయిపోల్చు వినూతనయోషధీరమన్
భూవనితందలిర్చు పరిపూర్ణవిలాసిని నీకు సేమహా.

జలజలమంచు మ్రాకులను జారెడి సంజమెరుంగుటాకులన్
బలపలనద్రులంబోదలు వన్యమృగీమృగశాబకంబులన్
బిలబిలమంచు నొక్కగతిఁ బేరటమొప్పఁజరించు పత్రులన్
జలనములేనిభూతములఁ జాలనముందలపింతు మాఘమా!

పదిదివసంబు లొక్కమొగిఁ బట్టినబాణము ద్రిప్పకుండ దా
నుదితదివాకరుండో పరులోపని చిచ్చరకంటివాడో నా
బదరఁజరించి వేల్పులు సెబాసననై రులఁ జెండినట్టి మా
ముదుసలికౌరవుండు బ్రియముం బచరించుచు నున్నవాఁడటే.

అలుకలురావు కాని యుదయంబున వన్నెకునెక్కునాశలుం
దలఁపునఁబోవు విస్మయముతారదు ముందుకువెన్క కెంతయున్
గలియఁగఁబ్రాకుగాని యలికంబునఁ గార్యము గానబట్ట దీ
యలసత కేమి హేతువో? ప్రియా, సరిప్రొద్దుల నీవు జేర్చినన్.

మకరములు కుంభములు నీకు మానసముల
నిచ్చుచెలికత్తియల! వానికెల్ల నొడయు
డగుట కని నీదు హృదయంబు నరయ సలిల
సన్నిభంబు పాషాణంబు లున్నఁగాని.

# అమర జీవనము

**ముడుంబ నరసింహాచార్యులు గారు**

౧

ఇంద్రనాథబాబు లేఖిని యందు మోహినీశక్తి కలదు. పర్వతముల పైనుండి మధుర జలప్రవాహములు పరవళ్లు త్రొక్కునట్లు అతడు వ్రాయుటకు కూర్చున్నమాత్రముననే సాహిత్యసుధాధారలు వర్షించిపోవును. అతనివయస్సు ఎంతో లేదు. అధికము పాతికయేండ్లుండునేమో. అతనికవిత్వమును—కల్పనాశక్తియుఁ జూడ నొడలు పరవశమై పోవును. అతనికి అతిసామాన్యవిషయమునగూడ తీయము పోయగల శక్తికలదు. అతనివ్యాసముల చదివినవారు మంత్రముగ్ధులవలె నైపోదురు. ఎంతమనోహరము! ఎంతసుందరమునైన యుపమానములు!! ఎట్టి యద్భుతమైన శబ్దజాలము!!! పాఠకులను ఒకానొకదివ్యలోకమున విహరించుచుంటి మనిపించును. నిరంతర మాగకుండ యిట్లే చదువుచుండవలె ననిపించును. అతనికవిత్వమున మనోరంజకత్వము—సౌందర్యము—మోహినీశక్తి—యన్నియు కలవు. అన్నిటినిమించి సరళత్వము కలదు. పెద్దపెద్దకఠినసమాసములతో నతఁడు పాఠకుల విసిగింపఁడు. ఇది యతని కంతమాత్రము నచ్చదు. తాను చెప్పదలచుకొన్నది సాధారణమైన సరళశబ్దములతోనే చెప్పుచుండును. ఇదే యతని గొప్పసుగుణము. ఒకసంవత్సరముక్రిందట నతనిపేరైన నెవ్వరు నెఱుంగరు. నేడు సాహిత్యరంగమున మూలమూలలకూడ అతనిపేరు మారుమ్రోగి పోవుచున్నది. 'భావసుషమ' 'సోమసాగరము'ల ప్రతులు ఒకటి రెండైనలేని చిన్న పల్లెటూరుకూడ లేదు.

కాని యింద్రనాథుని ఆర్థికస్థితిమాత్రము చాలశోచనీయముగనుండెను. ఇంత తలక్రిందు లగుచున్నను జీవనము నిశ్చింతగా జరిగిపోవుటకు తగిన ఆధారమతనికిలేదు. అత డెప్పుడుచూచినను విచారముతోనే యుండును. శోచనీయమగు దేశస్థితికి అతడు వగచుచుండును. దేశమునకెల్ల గొప్పవ్యాసకర్త—సర్వప్రియుడగు కవిరాజు—పైసపైస బిచ్చమెత్తుకొను ముష్టివాడుగ నుండునని యెవ్వరనుకొందురు? గ్రంథప్రకాశకుఁడు ధనరాసుల సంపాదించుచుండ, నతఁడాకలిచే మలమల మాడిపోవుచుండెను. ప్రపంచకమునందలి యీవిపరీతవ్యవహారము చూచి యతని హృదయము పరితపించిపోవుచుండెను. అప్పుడప్పుడు అతనికి క్రోధముకూడ కలుగుచుండెను. కోపావేశముచే సగముసగము వ్రాసిన వ్యాసములను ముక్కలుముక్కలుగ చింపివేయుచుండెను. లేఖిని విరచి పారవేయుచుండెను. ఇకముందు వ్రాతపై రక్తినేయుత్తనను చుండును.

౨

ప్రాతఃకాలము. ఇంద్రనాథు డెండలో కూర్చుండి యేదో మాసపత్రిక పత్రముల నిటునటు తిరుగవేయుచు తనలో తాను నవ్వుకొనుచుండెను. అతనిభార్య మనోరమ—'ఎందుకు అంతయానందము? అందులో నేమున్నది?' అనియడిగెను.

ఇంద్రనాథుడు మనోరమపై ప్రేమభరితవీక్షణముల బరపి, "భావసుషమపై విమర్శనము. బాగుగా ప్రశంసించిరి" అనెను.

మనోరమహృదయము మొదట గర్వముచేనుప్పొంగి పోయెను. కాని అంతలోనే క్షోభముతో 'ప్రశంస చేయుచుందురు. మనస్సులో మాత్రము అందేమియు లేదని వారియుద్దేశ్యము.' అనెను.

ఇంద్రనాథుడు—అరే!

మనోరమ—అబద్ధముకాదు. ఇచ్చటిప్రజలు వట్టి మూర్ఖులు. మీగొప్పదనము నేమి తెలుసుకొనగలరు? దున్నపోతులవద్ద వీణావాద్యము.

ఇంద్ర—నిజమే. నాకవిత్వమునందలి గుణదోషముల గుర్తెరుంగువారు చాల అరుదుగనే కలరు. అట్టిశక్తి యీపట్టణమొత్తమున నొక్కవ్యక్తికే కలదు.

మనోరమ—ఎవరికి?

ఇంద్ర—నీకసూయ కలుగదు కదా? ఆవ్యక్తి ఒకస్త్రీ. కాని అట్టియోగ్యత స్త్రీలలో కాదుకదా పురుషులయందైన నేనెక్కడను చూడలేదు.



### శ్రీమతి ఇ. బాన్జోరుకన్య

ఈమె రాజపుటానాకు చెందినది. టెన్నిసు ఆట యందు చతుర. ఆ క్రీడయందలి కౌశల్యముచే ఈమె పొందిన విజయచిహ్నములు (Trophies) ఇచట ప్రదర్శింపబడినవి. వెస్టరన్ ఇండియాలాన్ టెన్నిసు టోర్నమెంటులో ఈమె ఈవత్సరము లేడీస్ సింగుల్సునందును, డబుల్సునందును ఛాంపియను షిప్పును పొందినది.

*Courtesy of "The Indian Ladies Magazine."*



యువరాణి

శాంతిదేవి గైక్వార్

కఠియవార్ సంస్థానమునకు చెందిన అమ్రేలీ గ్రామమున ఈమె స్త్రీల ప్రత్యేక గ్రంథాలయమునకు ప్రారంభోత్సవమును జరిపినది. ఆ ప్రాంతమున స్త్రీల ప్రత్యేక గ్రంథాలయము స్థాపింపబడుటకిదియే ప్రథమము. ఈ చేతచే బరోడా రాజకుటుంబమున పురుషులేగాక స్త్రీలును గ్రంథాలయోద్యమమును అభిమానించుచున్నారని ఈమె ప్రదర్శించినది.



బీగము మయాజ్డాడా ఖావర్

సుల్తాన్ నాజిరుద్దీన్ బి.ఏ; బి.టి.

ఈమె తూర్పుగోదావరిజిల్లా గరల్ గైడు కమీషనరుగ నియమింపబడినది. కలకత్తా విశ్వవిద్యాలయమున ఆనర్సులో మొదటితరగతిలో రాజధానిమొత్తముమీద రెండవయామెగా ఉత్తీర్ణురాలైనది. స్త్రీజనాభివృద్ధియందు ఈమె కెంతయు శ్రద్ధగలదు.

Courtesy of "Indian Ladies Magazine"

మనోరమకు కొంచెము సందేహముకలిగెను. 'ఎవరు?' అని మెల్లిగా ప్రశ్నించెను.

ఇంద్ర—శ్రీమతి మనోరమాదేవి. బహుశః నీవు కూడ పేరు వినియేయుందువు?

మనోరమ నవ్వుచు ముఖముత్రిప్పివేసుకొని 'మీరు పరిహాస మాడుచున్నారు" అనెను.

ఇంద్ర—కాదు. మనోరమా! వాస్తవముగా నా అభిప్రాయ మంతే.

మనో—సరి! ఇటువంటి నటనలు మీవద్దనే నేర్చుకొనవలెను.

ఇంద్ర—నీవు ధైర్యము చెప్పకపోయిన నేనిట్టి యున్నతస్థితికి వచ్చియేయుండను.

మనోరమ—గొప్ప పండితురాలనుకదా మరి?

ఇంద్ర—అసంగతి నాహృదయము నడుగుము. స్వర్ణము తనమూల్యమును తానే మెఱుంగును?

మనో—మీరుమాత్రము మనుష్యుల నుబ్బించుట బాగుగ నెఱుంగుదురు.

ఇంద్ర—విమర్శనమును వినెదవా?

మనోరమ—చదువుడు.

ఇంద్రనాథుడు చదువసాగెను.

'భావసుమము' మా సమక్షమున నున్నది. మేము దానిని చదివితిమి. చాలదినములవరకు భావోద్వేగము మనస్సును వీడలేదు. మే మేదో నూతనలోకమున విహరించుచున్నట్లనిపించినది. ఇందు సౌందర్యమున్నది. సాధారణత యున్నది. స్వాభావికత యున్నది. కల్పన యున్నది. మాధుర్యమున్నది. సారళ్యమున్నది. ఇంకేమి చెప్పము? ఇందు సమస్తము నున్నది .....'

హఠాత్తుగా యెవరో క్రిందనుండి 'ఇంద్రనాథ బాబూ'! అనియరచిరి. ఇంద్రనాథుడు-మనోరమ-యిద్దరును చకితులైరి. అతిమధురమగు సంగీతమధ్యమున కర్కశస్వరములో నెవరైన నేడ్వసాగిన రోగి హృదయ మెట్లుండును? అసమయమున నతనిహృదయ మెంతకలవరము చెందునో యారోగికే తెలియును. క్రోధముచే నగ్నిహోత్రుడైపోయి వాని బ్రతుకులవరకు తెచ్చుటకు తయారగును.

ఇంద్రనాథబాబు పత్రికను మంచముపై బడవైచి క్రిందకు దిగివచ్చెను. విచారసూచకమగు మలినముఖముతో తిరిగివచ్చెను. అతనికండ్లలో నీళ్లు గిర్రునతిరుగుచుండెను. 'వచ్చినవారెవర'ని మనోరమ యడిగెను. ఇంద్రనాథుడు 'యింటియజమాని'యని చెప్పగా మనోరమ ముఖమువాడిపోయెను. విచారముతో 'ఏమనుచున్నాడు? మనస్థితికి తోడు యితడొకడు దాపురించినాడు. నాలుగుదినములైన ఓపిక పట్టలేడుకాబోలు!' అనెను.

ఇంద్ర—"ఈసారి కేసు పెట్టవలసియే వచ్చునను చున్నాడు."

మనో—ఎంత అద్దె? మూడుమాసములదా? మన వద్ద ధనములేనప్పుడు లెక్కలు చూచుకొనుట కసహ్యముకలుగును. అంతేకాక భయముగకూడ నుండును.

ఇంద్రనాథుడు మనోరమమాట వినియు విననట్లూరకొనెను.

ఇంద్ర—ఏదైన యుద్యోగము చేయవలెనని బుద్ధి పుట్టుచున్నది. ఇంక నేనీ దినదినావమానములను సహింపజాలను. అందరును ప్రశంసించువారేకాని సహాయమొనర్చువారొకరైన కన్పింపరు. ఎవరికైన ప్రశంసామాత్రమున నెన్నడైనను కడుపునిండినదా?

మనోరమ భర్తవైపు చూచెను.

'—ప్రయత్నముల చేసిచూడుడు. కాని యీవ్రాత పిచ్చిమాత్రము మిమ్ము సామాన్యముగ విడిచిపెట్టునట్లులేదు. ఇదికూడ ఒకవిధమైన దుర్వ్యసనమే.

ఇంద్ర—ఏమయిననుసరే! వదలివేసెదను. నీవు నన్నింకను పూర్తిగ అర్థముచేసుకొనలేదు.

మనో—బాగుగా నెఱుంగుదును. ఆఫీసులో కూర్చుండి పనిచేయగలరా?

ఇంద్ర—ధనములభించుచున్నపు డేలచేయను?

మనో—అధికారుల పోటుమాటలసహింపగలరా?

ఇంద్ర—ఆఁ. ఇంటియజమానితోడి కలహముల కన్న నెక్కువా?

మనో—లోకులేమనుకొందురు? 'అరే! సాహిత్య రంగమున సుప్రసిద్ధుడైన యాకవిపుంగవుడేనా యీయన? ఎవడో గొప్పవాడైయుండు ననుకొన్నాము—సామాన్యపు గుమాస్తాయేనా?' అని పలుగురు పరిహసించిన నేమి చేతురు?

ఇంద్ర—నన్ను కాదనియూరకుందును. ఎవరినోయ నుచున్నారని భావించుకొందును. మరి యింకేమి చేయుదును? గ్రంథప్రకాశకులు నా కష్టఫలితమును పూర్తిగ అనుభవింప నిశ్చయించుకొని యున్నారు. ఇంతకన్న నెక్కువ యెవ్వరు నివ్వమన్నచో వచ్చి నట్లు మాపరతులకే యిచ్చుకొనునని వారుద్దేశించు చున్నారు. వారు ధనవంతులు. ధనమూల్యము నే యెరుంగుదురు కాని కళామూల్యము నెరుంగరు. ఇట్టి స్వార్థపరులు నాకేమివ్వగలరు? యూరపునందే యైనచో స్వర్ణమందిరమును నిర్మించియుందును. ఈ దేశమున నాదురదృష్టమున కేడ్చుటతప్ప యింకేమున్నది?

మనోరమ—మీరెప్పుడు నిట్లు నిరుత్సాహపడ వలదు. కాలక్రమమున నంతయు చక్కబడును.

ఇంద్ర—అయితే నేడే వెళ్లెదను. రంగీలాలును కలుసుకొందును. కార్యసాఫల్యమగునని నాహృదయము చెప్పుచున్నది. మనిషి చాలమంచివాడు.

మనో—కొంచెము ప్రశంసించవలెను. గొప్పవారు ఒకటిరెండుమాటలకే ఉప్పొంగిపోదురు.

ఇంద్ర—నా కీవిధమున నేర్పవలసిన యావశ్యకత యేమియు లేదు.

మనో—ఈకార్యము నెఱవేరిన నదృష్టవంతుల మన్నమాటే.

ఇంద్ర—ఆయనది గొప్ప అధికారమే. తలచు కొన్నచో నేడే ఉద్యోగమిప్పింపగలడు. నావస్త్రములు చాలమాసినవి. లేచి క్రొత్తబట్టలిమ్ము.

మనోరమ లేచి పెట్టె తెఱచెను. బట్టల నొక్కొక్కటే విప్పి చూడసాగెను. కాని ఒక్కటియు చాకింటిమడత కాదు. మనోరమహృదయమున పెద్ద యాఘాతమయ్యెను. హృదయావేదనచే నామె వదనము వాడిపోయెను. తనమధురసంభాషణలచే గృహమంతయు కలస్వనితమొనర్చెడు ప్రసన్నవదనయు ప్రఫుల్లహృదయయు నగు యీమనోరమయేనా యీమె? నేడెట్టి యుదాసీనురాలైపోయెను? ఎంత యధీరరాలైపోయెను? శకుంతము లొకప్పుడు పుష్పభరితవృక్షములశాఖాగ్రముల కూర్చుండి కలరవంబుల నొనర్చుచుండును. మరొకప్పుడు సంకుచితపత్రములతో తమకులాయములలో నొదిగి కూర్చుండియుండును.

ఇంద్రనాథుడొక్క నిట్టూర్పువిడిచి 'మనోరమా నేనింక సహింపజాలను' అనెను.

అత్యద్భుతప్రతిభాసంపన్నుడగు ఆ సుప్రసిద్ధ కవిపుంగవుడేనా యీతడు? దేశమున మారుమూలల కూడ అతనికవిత్వ మత్యంతాదరగౌరవములతో పఠింపబడుచున్నది. అతనిలేఖిని రచించిన రచనలు రాతి హృదయములగూడ కరగించుచున్నవి. అతనికవితా రచనల నందుకొన ప్రజలు పరితపించిపోవుచున్నారు. అతని నామశ్రవణమాత్రమున నందరు అవనతశిరస్కులగుచున్నారు. అతనిగ్రంథములు దుర్మార్గులకు ధర్మోపదేశములకన్న నెక్కువగ పనిచేయుచున్నవి. అట్టివాడు నేడు ఏబదిరూప్యముల యుద్యోగమునో చేయుటకు బయలుదేరినాడు. కావ్యకల్పనాకళారాజ్యముల నేలురాజు భిక్షాటనమునకు బయలుదేరినాడు.

మనోరమ తనభర్తయొక్క విపరీతస్థితినిచూచి నిట్టూర్పుతో నేలపై చతికిలబడెను. ఆమె మనస్సున నొక్కటేసందేహము. ఈయున్నతమస్తకము యొవరి యెదుటమాత్ర మెట్లు అవనతమగును?

3

ఒకగంట తరువాత ఇంద్రనాథుడు 'పేఆఫీస్ సూపరింటెండెంటు ఆగురంగీలాలు ఆఫీస్‌లోనుండెను. రంగీలాలు ఏదో పుస్తకమును చదువుకొనుచుండెను. అత డతికష్టముపైలేచి ఇంద్రనాథునితో కరస్పందన మొనర్చి 'క్షమించి నాకొక్క అయిదునిమిషములు అనుజ్ఞయిండ'ని చెప్పుచు యెదుటనున్న కుర్చీచూపి,

సంజ్ఞ చేసెను. మరల నతడు తనపుస్తకములో లీనమై పోయెను. ఇట్టివ్యవహారము యింద్రనాధున కతిలజ్జాకరముగ కన్పట్టెను. అతడు తనకత్యంతావమానము జరిగినట్లుగ భావించుకొనెను. క్రోధముచే ముఖము కెందగడ్డవలె నైపోయెను. ఇతడెంత యనాగరికుడా యని యాశ్చర్యముకలిగెను. ఇతనికి తన కాలమూల్యమేకాని యితరులకాలముపై దృష్టియే లేదు. ఇప్పుడే నాకిట్టి గతిపట్టెన నిక యుద్యోగానంతరమున ద్వారమున ప్రతీక్షించవలసిన గతిపట్టునేమో?”

ఇంద్రనాధుడు చివాలున లేచిపోవలెననుకొనుచుండెను. తత్క్షణము గృహయజమానుని యగ్నిమూర్తి ప్రత్యక్షముగ జ్ఞాపకమువచ్చెను. తిరిగి యానేత్రములనే చూడనా? తిరిగి యామాటలే విననా? గతిలేక యతడు నిశ్శబ్దముగ కూర్చుండెను. గాలికెగురు కాగితముపై యినుపముక్కవైచినట్లు ఆత్మను ప్రకృతి అణచిపెట్టెను. ఇనుముముందు కాగితపుముక్క లేమి చేయకలవు? ఇట్లు ప్రతీక్షించుచున్నంతకాలము యింద్రనాధుడు ఆత్మయంత్రణము ననుభవించుచుండెను. రంగీలాలు చదువుటముగించెను. గదిలో గాలిలేనట్లుగ యింద్రనాధు డుక్కిరిబిక్కిరయిపోయెను. రంగీలా లింకను తానుచదివిన గ్రంథములోనే తన్మయుడై యుండెను. కొంతసేపటివరకు అతను యోగావస్థలో నిమీలితనేత్రుడై యుండిపోయెను. తరువాత తనలో తాను గొణగసాగెను. ‘అహాహా! ఏమిచెప్పను!’ ఎంత ఉన్నతభావములు!! ఎట్టి పవిత్రోద్దేశ్యములు!!!”

అతడు మాట్లాడుచున్న దేమాయని యింద్రనాధుడు కండ్లు వగలతీసుకొని చూడసాగెను. రంగీలాలు మేజాపై వంగిపడుకొని “సెలవియ్యండి స్వామీ! ఏమాజ్ఞ?” యనెను.

ఇంతలో గదితలుపుతోసుకొని చేతిలో టోపితో పెద్దదొర లోపలికివచ్చెను. రంగీలాలులేచి నిలువబడెను.

“గుడ్ మార్నింగ్”

“గుడ్ మార్నింగ్, ఈపుస్తక మెట్లున్నది?”

“చాలబాగున్నది.”

దొర పుస్తకము నొకచేతితో తీసుకొని రెండవచేతితో దానిపుటలు తిరుగవైచుచు “అయితే నీకు బాగుగా నచ్చినదన్నమాట” అనెను.

రంగీ—మంచిదా కాదా అన్నప్రశ్న కాదు యిచ్చట. ఇట్టిపుస్తకమును నేటివరకు నేనెక్కడను చూడలేదు.

దొర—అంతమంచిదా?

రంగీ—చదివిన పిమ్మటగాని దీనిమజా తెలియదు.

దొర—ఇంగ్లీషున యేపుస్తకముతో సరిపోవును?

రంగీ—ఏమో నాకు తెలియదు. కాని పుస్తకమత్యద్భుతమైనది.

దొర—ఇదియేదైన ‘డ్రామా’యా?

రంగీ—కాదండి-పొయిట్రీ.

దొర—హిందీలో ‘పొయిట్రీ’యేమిటి? ‘రబ్బిష్’.

హఠాత్తుగ యింద్రనాధునిదృష్టి పుస్తకము కవరుపైపడెను. అతడచ్చట చకితుడైపోయెను. అది ‘భావనుమన.’ అతని మనోమయూరము నృత్యము చేయసాగెను. హృదయము గులాబివలె వికసించెను. అతడిప్పుడీ ప్రపంచకమున లేనేలేడు. ఇంకొక దివ్యలోకమున విహరించుచుండెను. ఇప్పుడతని కీతుచ్ఛమైన—నికృష్టమైన—ప్రాపంచికమోహినీమాయ—భాగ్యమునందుగల భయముపోయెను. ‘ధనమేమిటి? వచ్చుచుండును. పోవుచుండును. ఇదియెగురుచు తిరుగుచుండు పక్షి. దీనిని పంజరమువలన నిర్బంధించియుంచుట దుస్సాధ్యము. నావద్ద ధనము లేకపోయినను నేను ధనవంతుడనే.’

ఈమనుష్యుని హృదయమున నాయెడ నెంతటి గౌరవమున్నది? ఎట్టి భక్తిభావమున్నది? భక్తుడుతన ఉపాస్యదైవముకై పుష్పాల చుచునట్లు యితడు పుస్తకమునెట్లు చూచుచున్నాడు? చదువుచుండగా నేత్రములెట్లు వెలిగిపోయినవి? వస్తేపెటిలో దూచి యేమనుకొనును? ఆశ్చర్యపోడా? స్తంభించిపోవడా? నేను భిక్షుకుడనై తనయెదుట చేయిచాతునని యీతడు కలలోనైన తలచియుండునా? నేను అతనియెదుట తలయెత్తుకొని యెట్లునిలువగలను? సిగ్గుచే భూమిలో

క్రుంగిపోదును. నాకు ఉద్యోగము దొరుకును. కాని ఆత్మగౌరవసంపద నష్టమైపోవును. ఈధనము ప్రియమైనది. దీనికై ప్రతివాడును తనసర్వస్వము ధారపోయుటకైన వెనుదీయడు. కొద్ది రజతనాణెముల కాశించి యీ యమూల్యధనమును పోగొట్టుకొందునా? ఎప్పటికీ నట్లు చేయను. అది చాలపొరపాటు. ఇట్టి పొరపాటును నేనెన్నటికిని జరుగనీయను."

ఇట్లు తలచి యింద్రనాథుడు మెల్లగా లేచెను. తలుపు తెఱచుకొని బయటకుపోయెను. ఈ యసార ప్రపంచకమున లక్ష్యముకాని యాధ్యాత్మిక కాంతి యిప్పుడతని ముఖము నావరించియుండెను. అతని నేత్రములలో ఆత్మగౌరవజ్యోతి ప్రకాశించుచుండెను. హృదయమున దివ్యానందసాగరము ఉప్పొంగి పోవుచుండెను. మొదట ప్రకృతి ఆత్మను అణచి పెట్టెను. ఇపుడు ప్రకృతినే ఆత్మ జయించెను. దేనిని పొందగోరి మహాయోగులు అరణ్యములలో పరిభ్రమించుచుందురో అట్టి ఋషీశ్వరసంపత్తి-సంతోషము-త్యాగము-సంయమము-వైరాగ్యము-ఇంద్రనాథుని యనుభవమునకు వచ్చెను. కుబేరసంపత్తి సంప్రాప్తమైనవానివలె ప్రసన్నముఖముతో అతడింటికి జేరుకొనెను. మనోరమ "కార్యసాఫల్యమైనట్లున్నదే" యనుచు యెదురువచ్చెను.

ఇంద్ర—తలచినదానికన్న యెక్కువయైనది.

మనో—ఇంతకాలమునకు మన మొఱవిన్నందులకు పరమాత్మున కనేక ధన్యవాదములు. జీతమేమి నిర్ణయమైనది?

ఇంద్ర—ఇప్పుడు నన్నేమియు నడుగకద్దు. నా మనస్సేమియు బాగులేదు.

మనో—బాగుగనే యున్నది! నాకుకూడ చెప్ప దలచుకొనలేదా యేమి?

ఇంద్రనాథు డామెకు సమస్తవృత్తాంతము వినిపించి అంతమున నిట్లుచెప్పెను.

'మనోరమా! నాకు ఉద్యోగము దొరుకలేదు. కాని ఆత్మజ్ఞానము లభించినది. నాజ్ఞాననేత్రము వికసించినది. ఇంతవరకు నన్ను నేనుమరచి వర్తించియుంటిని. నేడు నాహృదయపుటమునుండి తెఱతొలగిపోయినది. కవియొక్క పదవి యెంతగొప్పదో యెంత యున్నతమైనదో నాకు తెలిసినది. అది హృదయసింహాసనములపై రాజ్యము చేయును. నిద్రించుచున్న జాతిని జాగ్రదవస్థకు తెచ్చును. జీవచ్ఛవమైన దేశమున నవజీవనసంచారమును కలుగజేయును. ప్రపంచకము తనకొఱకు జీవించుచున్నది. తనకొఱకే మరణించుచున్నది. కాని కవిజీవితము పరోపకారార్థము. అది నశించినయుత్సాహమును పునరుజ్జీవింపజేయును. ఏడ్చుచున్న కండ్లనీరు తుడుచును. నిరాశావాదుల సమ్ముఖమున ఆశాదివ్యజ్యోతిని ప్రకాశింపజేయును. ప్రపంచకమున మానవులు పుట్టుచున్నారు. గిట్టుచున్నారు. కాని యిట్టి జాతినిర్మాతలు శాశ్వతముగ జీవించుచున్నారు. వారి కెన్నటికిని మృత్యువులేదు. నేను ఉద్యోగమును గ్రహింపలేదు. ఈ అమరజీవనమును స్వీకరించితిని. మనోరమా! నాకరగ్రహణ మొనర్చుము. ఈనూతనపథమున—కర్తవ్యనిర్వాహణమున—చేయూతనొసంగుము. నిశ్చయముగ నీకు కష్టముగనే యుండును. సందేహములేదు. కాని ఇందుకు ఫలితముగ మనకు ప్రాప్తించు ఆత్మానందము నిజమైన సౌఖ్యము. దానిమూల్యము నెవరెఱుంగుదురు?

మనోరమ భక్తిభావముతో పతివైపు తిలకించెను. ఆమె ప్రేమోద్వేగమున రెండుచేతులను చాచివైచెను.

—అనువాదము.

## నిరాసము

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

తెలుపగారాని యానందజలధి మునిగి
పొందుగా గ్రుచ్చి చామంతిపూలమాల
కాంక్షతోనుత భవదీయగళము జేర్పం
దిరుగునంతలో ముఖమటు ద్రిప్పినావు.
సర్వము సమానముగద! విశాలహృదికి
దేవి! కోపకారణమేమొ? తెలియరాదు.

# సర్వేశ్వరునకు ప్రియతమమగు కానుక

శ్రీమతి తాయి సత్యవతమ్మగారు

సర్వేశ్వరుని దూతలలో ఒక దూత ఒకనాడు చిన్నతప్పొకటి చేసింది. అందుకు భగవానుడు ఆగ్రహించి దానిని భూలోకమునకు తోలివేయమని ఆజ్ఞాపించినాడు. కాని అది పరమేశ్వరునిపాదములమీద వ్రాలి తనతప్పు మన్నించమని దీనంగావేడుకొన్నది. పరమదయాళుడైన ఈశ్వరుడు కరుణించి నీవు భూలోకమునుండి నాకేదిదైన ప్రియమైన వస్తువును కానుకగా కొనివచ్చినచో నిన్ను స్వర్గములోనికి తిరిగి రానిచ్చెదనని పలికినాడు. దానిమీదట మిగత దూతలందరు భగవంతుని అజ్ఞప్రకారము దానిని బయటికి త్రోసివైచి స్వర్గద్వారము బంధించివేసినారు.

"అలో లక్షణా"యనుచు ఆదూత భూలోకములోనికివచ్చి జగద్రక్షకునకు ప్రీతికరమగు వస్తువేదాయని కొండొకతడవు దీర్ఘంగా ఆలోచనచేసి భూమియంతయు నలుదిక్కుల కలియజూచింది. ఆఫ్రికాలో కింబర్లీగనులు కనుపించినవి. ఆగనులలో దేదీప్యమానముగా వెలుగుచున్న వజ్రములను చూచింది. వాటిలో మిక్కిలి ప్రకాశమైన రవ్వనొకదానిని చేతగైకొని "కన్నులు మిరుమిట్లుగొలుపు తేజస్సుతో వెలుగుచున్న యీమణినిగాంచి పరమేశ్వరుడు సంతసింపడా"యనుకొని దానితో మింటికెగసి స్వర్గద్వారము తట్టినది. పరమేశ్వరుడు లోనుండియే "యెవరువారు?" అన్నాడు. "దేవా! నేను తమదూతను. తమకు ప్రియకరమగు కాన్క ఇదిగో అందుకొని నన్ను తమమ్రోల చేర్చుకొనుడని" పలికినది. భగవంతుడు లోనుండియే నవ్వుచు "ఓబాలా! నీకానుక ఎద్దియో నేనెరుంగుదును. భూలోకమునందలి ధనాదులెల్ల నాచే సృష్టింపబడినవికావా? నాచే సృజింపబడిన దానితోనే నన్ను తృప్తి పరుపనెంచితివా? ఇదేటివెర్రినీకు?" అన్నాడు. దూతచేయునది లేక విచారముతో ఆరత్నమును అక్కడనే జారవిడచి భూలోకమునకు తిరిగివచ్చి భగవంతునకు ఇష్టమగు వస్తువుకొరకు దేశదేశములు తిరుగుట ప్రారంభించినది.

అట్లు తిరుగుచు హిందూదేశములో ఒక చిన్న రసపుత్రసంస్థానంలోకి వెళ్ళింది. ఆసమయములో ఆసంస్థానం చాలా అల్లకల్లోలంగాఉన్నది. పరరాజులు దేశముపై దండెత్తి వచ్చారు. రసపుత్రులందరు స్వదేశమందలి ప్రేమచే స్వాతంత్ర్యముకొరకై ప్రాణములపై నాశవీడి శత్రువుల నెదుర్కొన్నారు. ఘోరంగా యుద్ధంజరిగింది. అనేకులు రణమందు మడిసినారు. కాని శత్రుసేనలబలము హెచ్చుగానుండుటచే రసపుత్రులు ధైర్యముచెడి "బ్రతికుంటే బలుసాకు ఏరుకొని తినవచ్చు"నని రణరంగమునుండి పారిపోవసాగినారు. అప్పుడు వారినాయకుడు పారిపోవుచున్న సేనలనుద్దేశించి "ఓవీరులారా! భయపడకుడు. భయపడకుడు. రండు. పారిపోకుడు. తుచ్ఛప్రాణములకొరకై స్వాతంత్రమును పోగొట్టుకొనకుడు.

మాతృభూమియొక్క ఋణముతీర్చుకొనుడు. బానిసలై యుండుటకంటె రణరంగమున వీరశయ్య నలంకరించుటమేలు. ఆకువారివలె పిరికిపందలై పారిపోకుడు" అని గంభీరముగా హెచ్చరించినాడు. అంత పారిపోవుచున్న రసపుత్రులెల్ల వీరావేశముకలిగి వెనుకకుమరలి ఒక్కమారుగా శత్రుసేనల నెదుర్కొన్నారు. భీకరమైన సంగ్రామము జరిగింది. రెండుపక్షముల లో అనేకవీరులు మరణించినారు. రసపుత్రులుమాత్రం ధైర్యమువీడక ప్రాణములపై నాశవీడి తమనాయకునిచుట్టుచేరి పోరుసలిపినారు. రసపుత్రసేనాధిపతికి ఛాతీపై బలమైన గాయమొకటి తగిలినది కాని అతడు దానిని లెక్కచేయక ఎడమచేతితో గాయమును రక్తమురాకుండ అదిమిపట్టి కుడిచేతితోనే పోరుసాగించినాడు. అతని ధైర్యసాహసములను గాంచి మరింత వీరావేశముచెంది రసపుత్రవీరులు శత్రువులను దునుమాడజొచ్చినారు. ఇంతలో వారినాయకుని గుఱ్ఱమునకు బలమైనదెబ్బతగిలి మరణించినది. వెంటనే అతడు నేలపై కురికి యుద్ధంచేయసాగినాడు. కాని వెనుకనుండి బలమైనగాయమొకటి తగిలి నేలకూలినాడు. పోవుచున్న యూతనిజీవములను చేతగైకొని మనదూత ఇట్లనుకొన్నది. "ఆహా? ఈవీరుని ధైర్యసాహసములు, దేశభక్తి, స్వార్థత్యాగము ఎంతయు కొనియాడతగినవి. ఈతని జీవాత్మతో భగవంతుడు తృప్తిజెందక మానడు" ఇట్లనుకొనుచు రివ్వన అంతరిక్షమునకెగిరి స్వర్గద్వారము తట్టినది. లోపలినుండియే జగద్రక్షకుడు "దూతా! నీవు కొనివచ్చిన కానుక విలువకలదియే గాని ప్రియతమమైనదికాదు. నాకు మిక్కిలి ప్రీతికరమగు వస్తువును తెచ్చువరకు స్వర్గద్వారము తెరువబడద"ని వక్కాణించినాడు. విచారగ్రస్తయై దూత వెనుకకు మరలి మరియొక వస్తువునిమిత్తమై తిరుగజొచ్చినది.

దేశదేశములుతిరిగి తుదకొకపట్టణము ప్రవేశించినది. ఆనగరమున ఆసమయమందు ప్లేగురోగము విశేషముగా ప్రబలియున్నది. దినమునకు అనేకులు రోగముతగిలి మరణించుచుండిరి. రోగము వ్యాపింపకుండుటకై ఎవరికైనను వ్యాధిసోకినంతనే బండిపైన వైచుకొని పూరిబయటకు తీసుకొనిపోయి ప్రత్యేకముగా అట్టివారికై నిర్మింపబడిన పాకలలో పారవైచి వచ్చుచుండిరి. ఇట్లుండగా ఒకదిన మొకయువకునికి వ్యాధితగిలినది. వెంటనే నిర్దయులై వానిబంధువులు వానిని పూరివెలుపలనున్న పాకలలో పడవైచివచ్చిరి; కాని యూతనిని ప్రేమించుచున్న యువతిమాత్ర మాతనిని విడువజాలక బంధువు లెంత వలదనుచున్నను వినక అతని వెనువెంటనేవెళ్ళి పరిచర్యచేయదొడగినది. మూడుదినము లాతడు తీవ్రమగు జ్వరముతో బాధపడినాడు. ఆమూడుదినములు నిద్రాహారములులేక ఆబాల ఒక్కక్షణమైనను తనమనోనాధునివిడువక పరిచర్యలుచేసినది. కాని భగవంతుడు అనుగ్రహించలేదు. మూడవదినమున ఆతనికి వ్యాధి ఎక్కువైనది. ఆదినమే బాలికకుకూడా వ్యాధి సోకినది. కాని ఆమె జ్వరముతో ఓపిక లేకున్నను మనోహరుని సేవమాత్రం మానలేదు. సాయంత్రమగుసరికి యువకునికి మరణసూచనలు కాన్పించినవి.అదికాంచి మగువ యొక్కమ్మడి

పెద్దపెట్టునఏడ్చి మనస్సు కుదుటపర్చుకొని ఆతని ఆత్మశాంతికొరకై భగవంతుని ప్రార్థించి విచారముతో యువకునిపై పడిపోయినది. మరుక్షణముననే ఇరువురిప్రాణములు ఒక్కమారుగా దేహములు వీడినవి. పోవుచున్న ఆయువిద్ప్రాణములను ప్రక్కనేయుండి చూచుచున్న మనదూత చేతగైకొని "ఆహా! ఇట్టి పవిత్రప్రేమతో నిండియున్న జీవాత్మకన్న భూతలమున వేరు విలువగలపదార్థము ఎద్దియుండగలదు? ఇట్టి ప్రేమైకమూర్తిని కాంచుటచే నేనెంతయు ధన్యురాలను. ఈమెఆత్మ సర్వేశ్వరునకు తగినకానుక" యని భావించి రివ్వున ఆకాశమునకెగసి ఎప్పటివలె స్వర్గద్వారముతట్టినది. లోనుండియే సర్వేశ్వరుడు "అమ్మాయీ! నీకొని వచ్చినదానికే నెంతయు సంతసింతును. కాని ప్రేమకన్నను సర్వవిధముల ఉత్కృష్టమగునది మరొకటి భూమియందుకలదు. అది గొనివచ్చువరకు నీకు స్వర్గమందు తావు లేదు. పొమ్ము" అని పలికినాడు

తనయాశ నిరాశయైనందుకు మిక్కిలి చింతించుచు ఏమియుతోచక దూత యొక భీకరమగు కారడవిని ప్రవేశించి ఒక వటవృక్షముపై కూర్చుని ఈవిధముగా తలపోసికొనినది. "పరమదయాళుడైన భగవానుడేల నాపై నింతకఠినత పూనినాడు. ఎరుగకచేసిన చిన్నతప్పిదమునకై నాకింత పరీక్షఏల? ఏవిధముగా నేను సర్వేశ్వరునకు ప్రీతికరమగు కానుక సంపాదింపగలను? స్వార్థత్యాగముకన్నను నిష్కల్మషమైన ప్రేమకన్నను ఈభూలోకమునందు పవిత్రమగునదేదికలదు? నాకిక స్వర్గమునందు తావులేదుకాబోలు!" అని ఇట్లు నిరాశచే చింతించుచు ఒక్కపరి నలువైపుల పరకాయించిచూచింది. అనతిదూరములో నొకవైపు కొన్ని మునికుటీరములును మరొకప్రక్క నొక భిల్లకుగ్రామమును కానుపించినవి.

ఆతాపసకుటీరములలో నొకదానినుండి షోడశవర్షప్రాయుడగు నొక మునిబాలుడు బయటికేతెంచి దూతయున్న చెట్టువద్దకువచ్చి నేల కొంతమేర చేతులతో శుభ్రపరచి సాష్టాంగపడి భగవంతునిప్రార్థనలో తన్మయుడై పోయినాడు. అదే సమయమునకు భిల్లకుటీరములలో నుండి భిల్లు డొకడు బయటికేతెంచినాడు. ఆతనిమేను కారునలుపు. కండ్లు చింతనిప్పులు. గంభీరమైనముఖము. బలిష్టమగు దేహము. భయంకరమైన స్వరూపముగల యాతనిని చూచి నచో ఎట్టిమానవునకైనను ఒడలు జలదరింపకమానదు. దయయన ఎట్టిదోయెరుగని యా పశుప్రాయుడు భగవంతుని స్మరణయందు లీనమైయున్న తాపసబాలుని చూచినాడు. చేతనున్న గండ్రగొడ్డలి ఆడించుచు భయంకరమగు అట్టహాసముచేయుచు ఆవృక్షము చెంతకువచ్చి ఆబాలుని తెగటార్చుటకై గొడ్డలి ఎత్తినాడు. మరుక్షణమున ఆబాలుని శిరస్సు శరీరమునుండి వేరై క్రిందపడవలసినదే కాని ఈలోన భిల్లునకు ఆబాలకుని నిశ్చలమగు ముఖముపై దివ్యమగు తేజమొకటి కాన్పించినది. వెంటనే యాతనిమనస్సు వికలమైపోయినది. గుండెలలో ఏదోచెయ్యిపెట్టి కలచివైచినట్లయినది. అదే సమయమున మునిబాలకుని నోటినుండి "సర్వేశ్వరా! నాపాపములు క్షమించి నన్ను నీదరిజేర్చుకొనుము" అనుమాటలు

అప్రయత్నముగా వెలువడినవి. ఆపలుకులు భిల్లుని హృదయముపై శూలములవలె గ్రుచ్చుకొన్నవి. ఇంతవరకు పాపపుణ్యవివక్షత తెలియని యాపశుప్రాయునకు తానిదివరకు చేసినది అంతయు పాపమే యను జ్ఞానముకలిగినది. తోడనే ఎత్తినగొడ్డలిని దూరముగా విసవైచి పశ్చాత్తాపముతో కూడినహృదయముతో, అశ్రుపూరితనయనములతో మునిబాలకునిమ్రోల సాష్టాంగపడి ఇహలోకముమఱచి "సర్వేశ్వరా! నాపాపములను క్షమించి నన్ను నీదరిచేర్చుకొనుము" అని ఏడ్చినాడు. అతని పాపములనెల్ల కడిగివైచుటకో యన వేడికన్నీటి బిందువొకటి అతని దక్షిణనేత్రమునుండి క్రిందకుజారినది. జారుచున్న ఆబిందువుకొరకై మనదూత చేయి చాచినది. ఆయశ్రుకణము దూతహస్తమందుపడిన తక్షణమే అందుండి దివ్యతేజమొకటి వెలువడి మింటికెగసి స్వర్గద్వారముపై పడినది. తోడనే స్వర్గద్వారము దానంతటదే తెరచుకొన్నది. మిక్కిలిసంతోషముతో దూతను ఆహ్వానించుటకై భగవంతుడు తనపీఠముదిగి ద్వారముచెంత కేతెంచినాడు.

## ప్రాచీన దుర్గము

త. సుబ్రహ్మణ్యము గారు

ఏయనంతవి స్తీర్ణ భూమీధరములఁ
బరిహసించిన గోడలవరుసలో యివి!
ఏమహోన్నత శౌర్యలక్ష్మీసుతులకు
నాచరించినవో స్వాగతాంజలులను!
ఉరుదురంతశాత్రవహృదయోష్ణశోణి
తములఁ ద్రావినజీవము, తలధరింప
రానితలఁపుల కెనయయి పూనినది ప్ర
శాంత సైకతములను విశ్రాంతినిపుడు!

పరమభీకరఖడ్గసంభరితసౌధ
శిఖరమల్లదె నేఁడు శుష్కించియుంట
మృదులగుల్మాంతర స్థితశిథిలకంట
కముల నిముడుచున్నది పూర్వకరుణ కతన!
బహుపురాతనభావప్రపంచగతుల
నేలకో స్మరియించుట? నిష్ప్రయోజ
నాశ్రుకణములేమొ! క్షణక్షణమ్మునేల
మీటఁగను రాల్చుచున్నది మృత్కణముల!

## లక్ష్మి

టి. జియ్యరుదాసు గారు

ఒకనింజేరి యనల్పసౌఖ్యముల భావోద్రేకమున్ గూర్ప తా
నిక జేయంగల దీజగంబునను లేనేలేదటంచున్ వియ
న్నికషానందమహాబ్ధి దేలునెడలన్ నీవెట్టులో లక్ష్మి! వే
రొకనింజేరుదు, తల్ప చిత్రమగు నోహో! నీదుచాంచల్యమున్.

# శాపశక్తి

జంధ్యాల జానకిరామశర్మగారు

౧

శ్రీమాన్ జ్ఞానశూన్యశర్మాచార్యులుగా రొకదినమున తనపట్టశిష్యుఁడగు తమసాకారునితో నిట్లనెను "నాయనా! మా విషయ మంతయు నీకు బాగుగఁ దెలియును గదా! మేము శాస్త్రవిదులము, జ్ఞానులము, అగుటచే నిప్పుడీకలియుగములోనైనను క్రోధముగలిగెనేని ప్రపంచమునంతయు నొక్కపెట్టున భస్మము చేయగలశక్తి మాకున్నది. తెలిసితివా?"



జ్ఞానశూన్యుఁడను పేరఁబరఁగుదన గురునియొక్క యిట్టి జ్ఞానపూర్ణభాషణము వినినంతనే తమసాకారుఁ డాశ్చర్యమగ్నమానసుఁడై యిట్లనియె: "గురువుగారూ! నేఁడెట్టి సంతోషవార్త వింటిని! తమకుఁ గల యీసామర్థ్యము నుపయోగించుట కిదియె యదను. శారదాక్రేరారు లనువారిరువురు బయలుదేరి ధర్మహీనులై సంఘసంస్కర్తల మను పేరు పెట్టికొని హిందూమతాచారములను మంటఁగలుపుచున్నారు. ఆ రాక్షసులను తమ క్రోధాగ్ని జ్వాలలచే దహించివేయుదురేని లోకమంతయుఁ దమ కెంతయుఁ గృతజ్ఞతఁ జూపఁగలదు."

జ్ఞానశూన్యుని యదార్థనామము జ్ఞానశంకరశర్మాచార్యులు. శిష్యుని పేరు ప్రకాశచంద్రుఁడు. కాని తమతమ గుణానుగుణ్యముగ జ్ఞానశూన్యుఁడనియుఁ, దమసాకారుఁడనియుఁ బేరులొంది యట్టులే పిలువఁబడుచుండిరి.

శిష్యునినోటినుండి శారదాక్రేరారుల పేరులు విని యాచార్యుఁ డదరిపడి, "నిజమే! సమయమునకు జ్ఞాపకము చేసితివి. నాశక్తిసామర్థ్యము లిత్తఱిఁ బ్రపంచమునకెల్ల వెల్లండిచెద. ఇదిగో! విను. 'జ్ఞానశంకర శర్మాచార్యులుగారు నేఁటిసాయంకాలమున నాలుగంటలకు శారదాక్రేరారులను ధర్మద్రోహుల నిరువురను గంగాతటమున భస్మీభూతులఁ జేయుదురు. కాన సనాతనధర్మరక్షకులెల్లరు విచ్చేయఁ బ్రార్థితు"లను నొక ప్రకటన నచ్చొత్తించి యూరిలోఁ బంచిపెట్టు'మని యాజ్ఞాపించెను.

అంతులేనియానందముచే నుప్పొంగి తమసాకారుఁడిట్లనియె, "గురుదేవా! వారిని గంగాతీరమున భస్మముచేయ నెంచితిరా! అట్లగుచో వారికి మోక్షప్రాప్తి గలుగునుగదా! అట్లుకాదు. వారిని మ్యునిసిపల్ పెంట దిబ్బలు, మురికినీటిగుంటలు, నిమ్నజాతులవారుండు నపవిత్రస్థలములలో భస్మము చేయుదురుగాక యని నా ప్రార్థన."

అనంగీకారసూచకముగా నొక్కింతయోజనచేసి మెల్ల నేమనుకొనెనో గాని యాచార్యుఁడిట్లనెను. "సత్యమే! నాయూహప్రకారము వారికి నిష్కారణముగా మోక్షము లభించుననుట నిక్కము. నీయూహ మిక్కిలి చక్కగానున్నది. ఇట్టివాఁడవుగనుకనే నిన్ను పట్టశిష్యునిగా గ్రహించితిని."

తనహాస్యవచనమును యథార్థ మనుకొని సంతసించిన గురువునుజూచి నవ్వుకొనుచు శిష్యుడచ్చటినుండి పోఁబోవుచుండెను. ఇంతలో నాచార్యుఁడాతనిఁ బిలిచి చెవిలో మెల్లగానిట్లనెను. "పత్రికలను మిగులఁ దెలివితోఁ బంచిపెట్టవలెను సుమా! ఖద్దరువస్త్రములు ధరించినవారికిని, తలలో మాలజుట్టు (Croping) పెట్టుకొనియుండువారికి మాత్రము పత్రికలీయకుము. తెలిసినదా? ఏలయన—"

"ఆచార్యవర్యా! తావకపాదపద్మసంసేవనాలబ్ధధీవిశేషమున నాకంతయుఁ దెలియును." అనిపలికి శిష్యుఁ డచటినుండి వెడలిపోయెను.

2

సాయంసమయమున సభ యేర్పాటుచేయఁబడెను. ఒక మట్టికదిబ్బపై నొకగొంగళియు, దానిపై నొకకంబళియు వేయఁబడెను. తర్కాచార్యులు, వ్యాకరణాచార్యులు, పురాణాచార్యులు, జ్యోతిషాచార్యులు,దర్శనాచార్యులు, ధర్మాచార్యు లాదిగాఁగల పండితంమన్యులందఱు దానిమీఁద నాసీనులైరి. మూలగా నొకబల్లపై కారబ్రాకేరాదుల ఫలాహారము ఉపస్థితసభాసదులకుఁ జక్కగా నగుపడులాగున సమర్పఁబడియుండెను. తర్కాచార్యుఁడధ్యక్షపీఠము నలంకరించియుండెను. చుట్టుప్రక్కలనుండు నిమ్నజాతుల వారా సభాకార్యక్రమము నవలోకించుటకై నిలిచియుండిరి. "మహాత్మా గాంధీగా రస్పృశ్యతాపిశాచమును రూపుమాపుటకై యంటరానివారనఁబడువారిని తమసోదరులవలె ప్రేమించుచున్నట్లే, వీరును నంటరానితనము నందలి భేదభావమును నిర్మూలింపఁ గంకణముగట్టుకొనిరా యేమి?" యని సభికులు తొలుతఁదలఁచిరి, కాని వెంటనే తమ యభిప్రాయమును మార్చుకొనవలసినవారైరి.

కాలక్రమమున నింకను గొందఱు వచ్చిచేరిరి. అందులో స్వదేశీవస్త్రములు ధరించిన యువకుఁడొకఁడుండెను. వానిని జూచినంతనే యాచార్యులుగారు శిష్యునిచెవిలో "నేననుకొనినంతఁ జేయనే చేసితివి! ఖద్దరుబట్టలు ధరించినవారి నాహ్వానింపవలదని చెప్పితినా లేదా? ఇప్పుడేమైనదో చూచితివా? అట్టి ధర్మహీనుఁడగు రాక్షసుఁడొకఁడు రానేవచ్చెను! ఇప్పుడేమి చేయుదువు?" మనెను.

"అయ్యా! తమరు కంగారుపడకండి. ఇతఁడు మనవంటివాఁడుకాఁడు. వానిని మనమేమియు ననఁబనిలేదు. ఈస్థలమాహాత్మ్యమే వాని నిచటనుండి తఱిమివేయఁగలదు. అతఁడు త్వరలోనే పారిపోఁగలఁడు."

"ఒకవేళ వీఁడిచటినుండి పారిపోకున్నచో నపుడేమి చేయుదువు?"

"తమ రుపదేశించిన వేదములేదా? బిగ్గరగా వేదశ్లోకముల నుచ్చరించి వీనిమాట లొరులకు వినఁబడకుండఁ జేసెదను."

"ఓరీ! తెలివితక్కువపెద్దమ్మా! శూద్రులవద్ద వేదముపఠించెదవా? నీ తెలివి తగులఁబడినట్లేయున్నది. అయ్యయ్యో! మ్లేచ్ఛులుగూడ వచ్చియున్నారే! వీరికిని విజ్ఞాపనపత్రికలనిచ్చితివా? నెంత్తమునకిది యంతయు ననర్థమునకేసుమా"

"స్వామీ! యిట్టివారికిఁ బత్రికలనీయ నేనంత బుద్ధిహీనుఁడనా? వారే నాచేతిలోని కాగితములు లాగికొనిరి."

3

సభాకార్యక్రమ మారంభింపఁబడెను. దేశికుని యాజ్ఞానుసారము శిష్యుఁ డిట్లుపన్యసించెను.

"...తపస్సంపన్నులకాకరమై తపోభూమియని పేర్గాంచిన పవిత్రభారతదేశమునందుఁ గలియుగమున నీనాఁటికిఁ బాపాత్మ లనేకులు జన్మించి సంస్కర్తలమని విఱ్ఱవీగుచు మతవిషయములందుఁ బ్రవేశించి ధర్మ

విధ్వంసకులై, ప్రపంచమున ధర్మమనుమాటగూడ నాశనముగావలయునని (ధర్మమన నెట్టిది యని సభలో ప్రశ్న) ధర్మమన నేమియో వేదశాస్త్రపురాణములయందే చెప్పఁబడియున్నది. అది యాంగ్లగ్రంథముల యందు లభింపదు. వానిలోని శ్లోకములను చతుర్థులవద్ద పఠింపఁగూడదు. అయినను ఒక్క విషయము మాత్రము చెప్పెదను. మన పూర్వీకు లేమార్గము నవలంబించుచుండిరో, యామార్గముల మన మనుసరించుటే ధర్మమనఁబడును."

ఒకఁడు:—"మన పెద్దలంద ఱొకేమార్గ మవలంబించిరా? వారిలో మతభేదములు లేవా?"

"వారిలో మతభేదములున్నవని నీవెట్లు చెప్పఁగలవు?"

"శాస్త్రములయందే వలయునన్ని మతభేదములున్నవి."

ప్రశ్నోత్తరములు తుదకు జగడముగా పరిణమించునేమోయని భయపడి యధ్యక్షుఁ డిట్లు పలికెను.

"వినుఁడు, వినుఁడు. మీ తాతముత్తాతలకాలమున నొకజాతివాఁ డింకొకజాతిపనులాచరించియుం డెనా? ఏజాతివాఁ డాజాత్యుచితకార్యము లాచరింపవలయునను విషయము మెల్ల రంగీకరించుచున్నారు. పురాకృతపుణ్యపాపముల ననుసరించి జననములు గల్గునని మీరంద ఱొప్పుకొనుచున్నారా లేదా? ("అవశ్యము" అని కొందఱు, "ఎన్నటికిఁగాదు" అని మఱికొందఱు.)

"అయ్యా! మీ భాషణము చాలింపుఁడు. పుణ్యపాపములననుసరించి జన్మలు లభించుటలేదు. జాతిభేదములు మానవనిర్మితములేగాని భగవన్నిర్మితములు గావు" అని ఖద్దరువస్త్రధారియగు యువకుఁడు బిగ్గరగాఁ బలికెను.

"బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులలో నధికసంఖ్యాకులు మాభావముతో నేకీభవించియేయున్నారు. వారందఱికిని జీవయాత్ర జరుగుచు నేయున్నది."

"ఈ రోజులలోఁ బూటగడుపవలయు నన్న మోసమువలనఁ బ్రయోజనము లేదు. అధర్మజాలము పటాపంచలగుదినములు వచ్చియున్నవి. సుశిక్షితప్రజ లేజాతివారైనను—కనీసము యువకసముదాయమైనను—మీయుద్దేశ్యములతో నేకీభూతులు గాఁజాలరు."

ఇప్పుడు జ్ఞానశూన్యులుగా రెంతయు నావేశపూరితులైరి. చేతులునలుపుకొనుచు లేచినిలిచి యుద్రేకముతో నిట్లనిరి. "సంఘసంస్కర్తలిప్పుడు మన మతాచారములపైకి దారుణముగా దాడివెడలియున్నారు. దానికి మనము చేయవలసిన ప్రతిక్రియయే మన ధర్మయుద్ధ మవలంబింపవలెను. బాలబాలికల కందఱికిని వివాహములు చేసివేయవలెను. చతుర్యుగములయందును హిందూధర్మముయొక్క ముఖ్యోద్దేశ్యము వివాహమే. కాన నైదేండ్లప్రాయముగల బాలిక కారేండ్ల బాలునొకని వెదకుఁడు. లభింపనిచో నాలుగేండ్లవానిని జూడుఁడు. అట్టివాఁడును దొరకఁడేని వివాహములాపి మిన్నకుండక యేఁబదిసంవత్సరముల వానికైననిచ్చి పెండ్లిచేసి వేయుఁడు. ఏఁబదిసంవత్సరములవాఁడు ముసలివాఁడనుకొందురేమో! ఎన్నటికిఁగాదు. ఇంతయేల? నన్నుఁ జూడుఁడు. నాకిప్పు డేఁబదిరెండేడుల వయస్సు. నే నేమైన వృద్ధుఁడనుగాఁ గనఁబడుచున్నానా? ఈశ్వరుఁ డనుగ్రహించెనా? అఱువదేడులవానికైనను సంతానప్రాప్తిగలుగును."

"స్వామీ! సంతానమునిచ్చువాఁడు భగవంతుఁడా? అటుచోఁ గొందఱు సంతానహీనులగుదురే! వారు భగవానునకేమి యపకృతి యొనర్చిరి? భగవంతుఁడు వ్యభిచారులకును, పాపాత్ములకును సంతతి నీయ నేల? అఱువదేడుల ప్రాయమున సంతాన మెందఱికిఁ గల్గెను? ఒకవేళ కలిగినను నెవరికి గల్గెనో కొంచెము చెప్పఁగలరా?"

"గురువుగారూ! ఇతఁడు నాస్తికుఁడట్లున్నాఁడు. వీనిమాటలు వినుటయే ఘోరపాపము. 'హరి హరాదులనింద లాలకించుటలెల్ల, కోటిగోవధములకున్ సమంబు.'"అని తమ సాకారుఁడనిరెను.

"నేను నాస్తికుఁడనా? ఈశ్వరేచ్ఛ లేకయే మాట్లాడుచున్నానా? అట్లగునో నాశక్తియతీతమైనదే! ఏదియెట్లున్నను, నీవైజ్ఞానికయుగములో నీశ్వరుఁడు, ధర్మమను పేరులలోఁ జిక్కించి లోకులను వెఱ్ఱివారిఁ జేయఁజూచు యోజనలను విడిచిపెట్టుఁడు. ఆదెన్నఁడును నెఱవేఱఁజాలదు. ఈకాలములో మోసఁపుఁబనులు సాగిరావు. ఇది ముమ్మాటికి సత్యము. కావున నిప్పటికైనను మతాచారాంధకారమునుండి సత్యజ్ఞానప్రకాశములోనికివచ్చి యీదురాగ్రహము నీహతవాదమును మానివేయుఁడు. మన భారతీయులనుఁజూచి ప్రపంచమంతయు నిప్పటికే నవ్వుచున్నది."

అంత జ్ఞానశూన్యులు గారు గంభీరస్వరమున నిట్లనిరి. "ప్రపంచమంతయు జ్ఞానహీనమైపోయినది. అందఱికి విజ్ఞానమంత సులభలభ్యమగునది గాదు. జ్ఞానమున కందఱధికారులు గారు. ప్రపంచమున హిందూ ధర్మముల నంగీకరించువారదృష్టవశమున నిప్పటి కెక్కుడుగనేయున్నారు."

"ఇది కేవలము సత్యదూరము. ప్రపంచమునఁ గ్రైస్తవమతానుసారు లన్నిమతములవారికన్న నెక్కువగనున్నారు. క్రైస్తవులు రామకృష్ణాదిదేవతల నెంతగ నిందించుచున్నారో తెలియునా? హిందువుల నెట్లు గేలిచేయుచున్నారో యెఱుఁగుదురా? అట్టివారికి వాగ్బంధము చేయుటేమోయటుంచి—"

తమ:—"అయ్యా! ఇది సభయని తెలియునుగదా! వాదప్రతివాదముల కిచట చోటులేదు. మధ్య మధ్య మీరిట్లూరక మాట్లాడుచుండెదరేల? ఎల్లరును శర్మాచార్య దేశికుని యుపదేశముల శిరసావహింతురు గాక! ధర్మయుద్ధము చేయ బద్ధకంకణులగుదురుగాక! ప్రభుత్వమువారు మనలఁ గారాగృహముల నిర్బంధింతురా? మంచిదే! అప్పుడు మనయీయుద్యమమహీజ మెట్లువృద్ధియై ఫలవంతమగునో తెలిసికొనగలరు.

"తమ రెంద ఱేదినమునఁ బ్రభుత్వమువారిచే నిర్బంధింపఁబడి సంతోషపూర్వకముగా శ్రీకృష్ణజన్మస్థాన మలంకరింతురో, ఆదినము మిగులఁ బవిత్రమైనదై హిందూదేశచరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖింపఁబడఁగలదు. మరణమునకైన వెనుకదీయని స్థైర్యగుణము తనుబోంట్ల కుండియుండినచో మనదేశమిట్లు పరాధీనముకాకయేయుండును. మఱియొక విషయము చెప్పమఱచితిని. కారాగారములయందు జాతిభేదములకుఁ దావుండదే! అక్కడ బ్రాహ్మణుఁడు చండాలుఁడు కలిసి పనిచేయుచుండవలెను. కలిసి నిద్రించుచుండవలెను. కడకు మజ్జనభోజనాదులుగూడ కలిసియే చేయవలయునే! ఉన్నదా తమకట్టి త్యాగశక్తి? ఉన్నచో నింతటినుండియే కార్యారంభమునకుఁ గడంగుఁడు. ఇంతవరకు లేకయుండిన నేఁటినుండియే యీపనుల నభ్యసింపుఁడు. నేఁ డిచటఁ జేరియుండు బ్రాహ్మణులును, నస్పృశ్యులును నొండొరులు ప్రేమాశ్లేషముల నాచరించి రెల్లరముఁ గారాగృహములకేఁగ సంసిద్ధులమై యున్నామని ప్రపంచమునకుఁ జాటుఁడు. లేదేని శారదాక్రేరారులెట్లు భయపడఁగలరు?"

అని యాఖద్దరువస్త్రధారియగు యువకుఁడు వచించుచుండునపుడే సనాతనధర్మపరాయణులగు ద్విజులు మండిపడుచుండిరి. వారినోరులు తుపాకిరూపుఁదాల్చి మాటలనియెడుగుండ్లను ప్రయోగించుచుండెను. క్షణకాలములో నచటి కలకలమంతయు శాంతించెను. అంత జ్ఞానశూన్యులు గారు "శారదాక్రేరారులవలన మన మినుమంతయు భీతిఁజెందనవసరములేదు. నేనిప్పుడే వారిని నీరుఁజేసివేయుచున్నా"నని వాక్రుచ్చి బల్లపై నున్న ఛాయాపటములకు నిప్పంటింపఁబోయిరి.

వెంటనే యాయువకుఁడాతని బెదరించుచు, "జాగ్రత్త! పటములకు నిప్పంటించకుఁడు. ఒరులపటములఁ



దగులఁబెట్టుట చట్టసమ్మతమగు గొప్ప నేరమగును. మీరిప్పుడే నిర్బంధింపఁబడుదురు. మీయుద్యమమంతయుఁ బాడగును. నిజముగాఁ గారాగారమునకేఁగఁ గోరుచో నీపని చేయుఁడనెను."

ఈవాక్యములు వినినంతనే యాచార్యుని శరీరమంతయు చెమటపట్టెను. కాలుసేతులు వడవడ వడకసాగెను. కాలుసేతులేగాక హృదయమును గొట్టుకొనుచుండెను. సంచలనము తొలుత నెచటఁబుట్టెనో మేము చెప్పఁజాలము. ఈవిషయమును నిర్ణయింప వైద్యులే సమర్థులు!

జ్ఞానశూన్యుఁ డిటునటుపరికించి 'ప్రకాశం' అని పిలిచెను. వారు తమ సాకారుని ప్రకాశమని పిలిచిరే గాని వాఁడు మాత్ర మంధకారావృతుఁడై యుండెను. నిజముగా ప్రకాశమని పిలువఁబడఁ దగినవాఁడా యెదుట నిలిచియుండు నవయువకుఁడే!

ఆయువకుఁడచటినుండి మెల్లగా నాచార్యునియొద్దకువచ్చి యాతనిచేయిపట్టుకొని, "తమసాకారుని విషయము బోనిండు, నామాట వినుఁడు, తమరు వృథాక్రోధమును త్యజింపుఁడు. 'సంఘేశక్తిః కలౌయుగే' యనునార్యోక్తినిఁ దమరంగీకరింపరా? నిజమునకు నాల్గుయుగములయందును సంఘీభావముచేతనే మహత్కార్యము లాచరింపఁబడినవి. సాంఘికశక్తినివదలి వేఱొకబలమువలనఁ గార్యములొనరింపఁదలఁచుటయే యాత్మప్రతారణమనఁబడును. మన మీసమయమున సమస్తప్రాపంచికేతిహాసమువలననే యథార్థమగు ధర్మశక్తులలోని రహస్యముల నెఱుఁగఁజాలుచున్నాము. లెండు. నడుముకట్టుకొనుఁడు. ఆత్మసోదరులవలె నస్పృశ్యులతోఁ గలసిమెలసి యుందము. నావెంట రం'డనియెను.

పాపము! ఆచార్యులుగారాతని చేతినూఁతగా గొనియుండిరి. యువకుఁడాతని చండాలుర మధ్యకు చరచర నీడ్చికొనిపోయెను. యువకులందఱు దీనులను హరిజనులను గాఁగిటఁ జేర్చిరి. సనాతనవాదులెల్లరు పంచములతోఁగూడి యుండిరి. జ్ఞానశంకరుఁడును నేత్రముల నశ్రుకణములురాల నొకహరిజనసోదరుని గాఁగిలించియుండుటఁజూచి యువకులొక్కుమ్మడి "జై' జ్ఞానశంకరునకు జై" యని దిక్కులుపిక్కటిల్లఁ గేకలిడిరి. శారదాశాసనమునకు వ్యతిరేకముగ సభ ప్రారంభించిన జ్ఞానశంకరుఁ డస్పృశ్యతానిర్మూలనముతో ముగించెను!

—అనువాదము.

# ఆదిశంకరుఁడు: అంత్యజుఁడు

శ్రీ శేషాద్రి రమణకవులు

చం. ఇలవయి నాత్మవస్తు వొకటే, యనవద్య మసంగమున్ సము
జ్జ్వలమును సత్యబోధసుఖసాధ్య మఖండ మటంచు దాని ని
చ్చలు నెలుఁగెత్తి యయ్యుపనిషత్తులు చాటుచుటెంగి భేదపుం
దలఁపు గలట్టినిన్నుఁ గనినన్ గడువింతయగున్ యతీశ్వరా!

ఉ. కొండలు కేలదండములుఁ గూర్చి కమండలువుల్ ధరించి పై
పొందుగఁ గావివల్వలనుఁ బూన్చి రవంతయు జ్ఞానవాసనా
సంసము లేక, వాగ్విలసనంబున గేస్తుల మోసగించి లోఁ
గొందురు, వారిలోపల నొకొండవు నీవని నాకుఁ దోఁచెడిన్.

చం. చదివితివీవు శాస్త్రములు సన్యసనంబొనరించి కీర్తి సం
పద గడియించి తీవు చనుమా కడుదూర మటంచు సారె న
స్గదిమెద వేల? యన్నమయకాయము లన్నియు నెందు నొక్కటే
గద; యిట సంటు దేహమునకా మఱియాత్మకొ నిశ్చయింపుమా.

ఉ. మాలఁ డితండు విప్రకులమండనుఁ డీతఁ డటన్న భేదముల్
పోలునె ప్రత్యగాత్మకడఁ బూజ్యుఁడ వీవిటు భేదభావనా
చాలతఁ జూపఁగానగునె? సౌరనదిన్ సురభాండమందు ను
ద్వేలగతిం దలిర్చు రవిబింబములం దొకభేదముండునే.

చం. అనిశము సర్వదేహములయందు నొకండయి సర్వవస్తురా
జిని దనరారు నిర్వికృతిచేఁ దగుపూరుషు జ్ఞానదృష్టిచేఁ
గనుఁగొనలేక; యే శుచిని కాయుఁడ విప్రుఁడ మాలవీవు పొ
మ్మని కనులెఱ్ఱజేయుదు వనర్థకకోపము నీకుఁ జెల్లునే?

చం. తలఁపుల కంద దింద్రియవితానముచేతను గోచరింప దే
వలన, ననంత మాద్యమయి భాసిలు నిర్మల మాత్మరూపమున్
దెలియవు; మోహభారమునఁ దెంపరివై గజరాజకర్ణచం
చలమగు మేను నమ్ముకొని సారె కహంకృతిఁ జూపఁ జెల్లునే?

చం. నిరుపమమోక్షసంగ్రహణనిష్ఠ గడించిననీకుఁ గూడ దు
స్తరమగు లోకసంగ్రహణసాధకతుచ్ఛమనీష గల్గు ట
బ్బురమగు, నైంద్రజాలికవిభూషణుఁ డాపరమాత్ముఁ డెంతనే
ర్పరినయినన్ స్వమాయకు నవశ్యము వశ్యునిఁ జేయు నెంతయున్.

చం. అని యిటు లంత్యజుండు వినయాభరణుండు వచించినంత పా
వనతరసత్యసంగుఁడు కృపారససంప్లుతచిత్తపంకజుం

డనఘుఁడు శంకరుండు మది నచ్చెరువంది ప్రసన్న వాక్సుధా
ధుని నుఱలందు జొబ్బిల నతుండయి వాకొనె నివ్విధంబునన్.

కం. మానవరత్నమ! ఆత్మ
జ్ఞానవిదగ్రసర! యుష్మ దభిహితవాక్యల్
సూనృతము లంత్యజుఁడ వీ
వైనను నిను భేదబుద్ధి నరయ మనమునన్.

ఉ. అంద ఱెఱింగియుంద్రు నిగమాంతము లిందొకకొంద ఱింద్రియా
స్పందవిజృంభణం బడఁచి భావనసేయుచునుంద్రు; డెందమున్
గొందఱు ప్రత్యగాత్మయెడఁ గూర్చి సుఖంతురు గాని మానసం
బందు విభేదభావ మొకరైనను వీడ రిదేమిచిత్రమో!

చం. మనసును జిక్కఁబట్టి పరమంబగు నాత్మపదార్థ మీజగం
బునఁగల సర్వవస్తువులఁ బొల్చు నెఱింగినధన్యుఁ డేకులం
బున జనియింప నేమగును; పుల్కసుఁడైనను విప్రుఁడైనఁ ద
జ్జనుఁ డిల నాకు వంద్యుఁ డను, నిజం బిది, నాదృఢబుద్ధి; సోదరా!

చం. హరిముఖమందు నేచితి నిరంతరమున్ దగు నద్ది కీటకాం
తరములలోపలన్ ఖగకదంబకమందును, నాదుమానసాం
తరమున నుండు; దృశ్యసముదాయము సత్యమటంచు నెంచు నే
నరుఁ డతఁడంత్యజాతుఁడయినన్ గురువర్యుఁడు నాకు నన్నిఁటన్.

చం. ఎటనెట సర్వవైభవ మవేక్షణసేయుచునుండఁగాఁ బరి
స్ఫుటమగు నాత్మశక్తి యదిబోధమగున్, విషయప్రసక్తి నొ
క్కటఁ దొలఁగంగఁద్రోయునెడఁ గన్పడు జ్ఞానము నేనటంచు ని
ష్కుటిలుఁ డెవండు లోఁదలఁచున్ గురుఁ డాతఁడు నాకు నన్నిఁటన్.

—అనువాదము.

## శారద

గున్నేపల్లి మృత్యుంజయకవిగారు

నీయుంజకెంజాయ నిడుదరేకలఁగదా
కలహంస లవరంజికళలుగనుట
నీచిన్నిచేర్చుక్కనెలవెలుంగులఁగదా
క్షుత్పిపాసలులేక సురలుమనుట
నీచేతి ముద్దువీణియపాటలనుగదా
బ్రహ్మమోమున శ్రుతుల్ బయలువడుట
నీనింపుఁగందోయినెనరుఁజూపులఁగదా
కవులు శాశ్వతకీర్తి కర్తలగుట
నీవినిర్మలతేజంబు నెగడియుండు
టనుగదా ప్రణవాక్షరం బనువమాన
మంత్రరాజమ్ములకు నెల్ల మకుటమగుచుఁ
బరిఢవిల్లుట శారదాంబా! మదంబ!

# గద్యపుష్పములు

కొమరవోలు నాగభూషణరావుగారు

## ౧
## బాటసారి

పోయిన పాడుగునా మిట్టకెక్కలసిన యీబాట వంకరటింకరలుగానే ఉంటుందా? గుచ్చుకొంటూన్న సూదుల్లాంటి యీరాళ్లకు అంతమెప్పటికి?

చివరవరకూ అంతే.

ఈ ప్రయాణము దినమంతా చేయవలసినదేనా?

ఆఁ! అస్తమయంతో సరి.

రాత్రికి విశ్రాంతిస్థలం దొరుకుతుందా?

రాత్రియొక్క ప్రారంభదశలో అది నీకు కనబడుతుంది.

అంధకారంలో దాన్ని నేను కనుక్కోలేకపోతానేమో!

దాన్నిమాత్రం నీవు తప్పిపోలేవు.

ఇతరబాటసారులను ఎవర్నైనా రాత్రికి అక్కడ కలుసుకొంటానా?

ఆఁ! నీకంటె ముందువెళ్లినవాళ్లను.

అయితే నేను వాళ్లను పిలవడమేలాగ!

అక్కరలేదు. నీకోసం వారు ఎదురుచూస్తూనే ఉంటారు.

ప్రయాణపుబడలికవల్ల దుర్బలుణ్ణైన నాకు ఏమైనా అక్కడ సౌఖ్యముంటుందా?

నీ కష్టానికి తగినఫలం అనుభవిస్తావు.

వెతుక్కునేవారికి సౌకర్యాలుంటాయా?

అటువంటివారికి కావలసినవన్నీ ఉంటాయి.

## ౨
## కీర్తికాంత

ఆమె మధురమందగమనము భద్రగజయానము వలె మందాక్రాంతవృత్తమును జ్ఞప్తికిఁదెచ్చినది.

ధవళాంబరధారిణి యగు నామె యువనలిముఖరై కించిత్స్మితపూర్వకములగు దృగ్జాలములను ప్రేక్షకులపైఁ బఱపి అగ్రసరయగుచు నన్నతిక్రమించెను.

ఆమె నితంబబింబముపఱకును వ్రేలాడు మనోహరస్నిగ్ధకేశజాలము నన్నాకర్షించినది.

నేను చేలనైపోతిని. వెంటనే పరుగెత్తి ఆమె ఎదుట నిలచి అనుగ్రహింపుమని వేడితిని.

దర్శనీయమును, సముజ్జ్వలము నగు తనముఖము నామె నావంకకు మరల్చి నిశితదృష్టులను ప్రసరించెను. ఆమెదృగ్బాణములు నా నయనగోళములను ఛేదించివైచెను. నే నంధుఁడనై జ్ఞానశూన్యుఁడనైపోయితిని. ఆమె తిరోహితయయ్యెను. కర్తవ్యతావిమూఢుఁడనై అదిమొదలుకొని ఆమెకొఱకు అహోరాత్రములు పరిభ్రమించసాగితిని.

కాలస్రోతస్వినీగమనము మందగించలేదు. లోకము నన్నుఁజూచి అపహాస్యముఁజేసెను. నా ధోరణిలో నది నాకు వినఁబడలేదు.

నా అన్వేషణ నైరాశ్యభావముతో నంతమొందెను. నిస్పృహతో నీలజీమూతము వంక చూచుచు నిలువఁబడితిని. అప్పుడు విద్యుత్కాంతిపుంజములచే నావృతమైన ఆమె ముఖమందుఁ దళుక్కున ద్యోతకమయ్యెను.

ఉద్వేగసహితములగు నా శాప్రపూరితనయనములతో నామెను వీక్షించుచు జాలిగదురఁ బ్రశ్నించితిని.

"ఇంక నాకేది తెఱవు?" అని.

ఒకసౌదామినీలత అక్షరరూపమున మెఱసి పోయెను. అక్షరసమన్వయానంతరము "నిష్కామకర్మము" అని తెలిసికొంటిని.

## 3
## అమ్మ

అది ఒక బాలికాపాఠశాల. మనోహరమగు నుద్యానవనముచేఁ దదావరణ మతిరమణీయమై అలరారుచుండెను.

పండుగసెలవులలో నాశ్రమములోని బాలికలు స్వగృహంబులకుఁ బ్రయాణమై పోవుచుండిరి. మాతృదర్శనౌత్సుక్యము వారి ముఖముల నానందతేజో విరాజమానములుగాఁ జేసివైచెను.

సాయంసమయమయ్యెను. గంభీరమగు నిశ్శబ్ద మాశ్రమాంగణము నావరించెను.

ఆశ్రమోపాంతమున నొకపొగడచెట్టుక్రింద నొక యేడేండ్లబాలిక నిశ్చలశాంతచిత్తముతో నుపవిష్టయై యుండెను. ఉద్విగ్నహృదయుఁడనై ఆమెను డాసితిని. ఆమె లేచి నిలువఁబడెను.

"అమ్మా! నీవు పండుగ కింటికిఁ బోలేదా?" అని పలుకరించితిని.

"ఏయింటికి?" అని ఆమె ఉన్నమితభ్రూకుటియుతయై మొగము పైకెత్తి ప్రశ్నించెను.

"మీయింటికే!" అని సాభిప్రాయముగా సమాధానమొసంగితిని.

"మాయిల్లిదియే!" అని ఒకించుక హాసముతో నామె ఆశ్రమపర్ణశాలవంకఁ దనచేతిని జాపుచుఁ బలికెను.

"మీఅమ్మకూడ నిచటనే ఉన్నదా?" అని ఆదరణసూచకముగా నేనడిగితిని.

"మాఅమ్మ ఎవరు?" అని ఆమె ప్రశ్నించి విభ్రాంతయైనట్లు గన్పట్టెను. ఆమె దృష్టి నా ముఖముపై నిలచిపోయెను.

"నిన్నుఁగనిపెంచినది. నీపైఁబంచప్రాణములను మోపుకొనినది. ఆమెనుజూడ నభిలషింపవా?" అని సకరుణముగా నేనంటిని.

"అమ్మ ఇదిగో!" అనియాబాలిక ఆనందాతిరేకమున నాపొగడతరువును గాఁగిలించుకొనియెను.

"ఇదికాదు. అందరిబాలికలకు నుండునటువంటి అమ్మ—నీకుమాత్రము లేకుండునా? ఆమె ఎక్కడ నున్నది?"

"ఆ అమ్మ ఎవరో నాకుఁదెలియదు. నేను పుట్టినప్పటికే ఆమె అచటలేదు." అని ఆమె స్నిగ్ధశాఖాకదంబయు పరిమళమిళితపవనాశ్రయయునగు నావకుళవృక్షమును మరల గాఁగిలించుకొని ముద్దుపెట్టుకొనియెను.

పుత్రికాగాఢపరిష్వంగసుఖానుభవానంతరము దీవించినటు లాతరువు పుష్పాక్షతల నామెశిరస్సుపై వెదఁజల్లెను.

# ఏకాంత సేవ

వేదము వేంకటకృష్ణశర్మగారు

శ్రీకృష్ణుఁడు

మందపెలువడి నడిరేయి మందగమన!
మందమునుగూర్చ, మదిభయ మందకుండ,
మందభాషిణీ! యిపుడు నా మందటికిని
మందలన్ మీఱివచ్చి, తే మందఁ? జెపుమ!

రాధ

కేవలానందపరవశభావదివ్య
డోలికల నిర్వ్యరము నూఁగులీలకంటె
మోదమిడునది, యటనేది లేదు, కాన
మన సుశైకాంతసరణికి మందతగునె?
శ్రమలనొంది, ప్రశాంతమా సమయము గుట,
నర్థరాత్రంబునన్ సుప్తి నందుదునని
నాకనుల్ గప్పి చననానె?, నాథ! యిదియ
దొంగలంబట్టు తఱియని తోఁచలేద?
అలికిడిని విన్నయంతన, యందరాని
తావునకు నుఱికెదవని తలఁచి, యిట్టు
లింద్రియములు జలింప, నట్లే యిచటికి
వచ్చితిని నేను, బదము పైఁ బదమునిడుచు
వచ్చునపు డెన్ని శ్రమలకుఁ బాల్పడితినో,
యెఱిఁగి, నారాక యందమై యొసఁగెనంచు
గేలిసలిపెద, విది యొకలీలయేమొ?
కాని, యదియు ననుగ్రహమౌను నాకు
భావమున నిన్నె యిడుకొని వచ్చుచుంటి
నవశనై, కాన మార్గమధ్యంబునందుఁ

గంట కాశ్మాది బాధలేక్ గానరావు,
భయమునఁగూడను నామదిఁ బాసిపోయె.
ఇను మయస్కాంత మెట్టు లట్టీవు నాదు
మనము నీవంకకే లాగి-కొనుచునుండ
నొండుదోఁచునె? భయమేల యుండునింక?
ఆహహా! యెంతటిజాణవీ వాత్మనాథ!
అచలయోగుల మనములే నపహరించి,
వెంటఁగొనిపోవ,వారు నీవెంటఁబడుదు,
రింక నబలను, చంచల హృదయనైన
నన్నులోఁగొన, రాకెట్లు నాథ! నిలుతు
"మందభాషిణి"నగుదు, నెట్లందు వేని:
నందియుందని నినుఁబొంద నెందు నెపుడుఁ
దందరంబడుదాననే, నందునలన
సుందరాకార! పలుకుడు మందగతినె,
భవదధీనము, నాకేల పలువిధములఁ
బలుపలుకులాడఁ బలువురి పజ్జఁజేరి,
చెలులతోనైన నెంతనేఁ బలుకవలెనొ,
యంతియేకాని మెండుగా నాడ,నిజము
నాదునరసంపు సంభాషణంబులెల్ల
నిన్నె చేరను నామదిన్ గొన్న నాఁడు,
త్వత్కృపగల్గ నిపుడవి బయలుపడవె?
యీవెలుంగనె యాత్మేశ! యీవిధంబు?
ఏరికే నెన్నఁటికినైన నీవె గతివి,
కాన, నావలె నెల్లరుఁ గడకునీదు
మందటికిఁ జేరవలదె? యేమతము నేనిఁ
బట్టి,యిష్టార్థ మీవెకా భక్తతతికి
జల,నగ,రసా, సభా,యజ్ఞ,సదన, విప్ర
భవన,ఘోరవన,ద్వీప, వరతపోని
వాస,కైరాటముల నెందు వర్తిలినను
భక్తసంఘము వెదకి నిన్ బట్టరాదె?
మందలను మీఱినావనె?, యీ-నిందనాకు
నేలకట్టెద వీవు? యోగీశు లేనిఁ
బ్రకృతిమందల మీఱక, పరమపురుష
నిన్నుఁజేరఁగ శక్యమే? నిర్మలాత్మ!
శుద్ధసాత్త్వికమూర్తి నిన్ జూడువేడ్కఁ
త్రిగుణముల మందలన్ మీఱి తెగువతోఁ జ
దుచ్ఛసంసారబంధముల్ ద్రుంచివైచి
పరమభక్తులువెఱ్ఱులై తిరుగుచుండ్రు
ఐహికానందములకు జలాంజలియిడి,
నీచదేహాభిమానంబునీటఁగలిపి
యుత్తమపదంబునందుఁ గాలూది నిల్చి,
నిన్నుఁబొందెదు, నిష్ఠమై నెగడుయోగి.
త్వన్మహాజ్ఞపయోధి మందలనుమీఱుఁ
గులనగంబులుగూడ మందలనుమీఱుఁ
దలఁప భూతంబులైదు మందలనుమీఱు
నేనుమందలమీఱుట లెంత? నాథ!
ఎఱిఁగియెఱిఁగియుఁ "నేనుంద నిచటికీవు
వచ్చి"తనియెదు, నామది బయటఁబెట్ట
వలెనె? యేనె స్వయంబుగ, వాంఛితముల
నడిగితీర్చిన, సంతోష మధికమగునొ?
"అమ్మయైనను దాఁబెట్ట దడుగకుండ"
ననెడులోకోక్తి నిజము సేయంగఁదలఁతె
"తరుణులమనంబు సర్వపదంబు లెఱుఁగ
బమ్మకును శక్యమే" యంటనమ్మినావె?
నిన్నె పెన్నిధిగానమ్మి, యున్నిశిధి
శ్రమలకోరిచి వెదకుచు, నమితవాంఛ
నరుగుదెంచితి నేకాకి నగుచుఁగాన,
నడుగఁజంకఁగనేల? నిన్నాత్మనాథ!
ఆత్మ నీకర్పణమొనర్చినట్టిదనమె
జంకుఁగొంకుఁ గళంకము జావలంబు
వీడె నహఁ, గానఁ గోర్కుల వేడనింక
శంకయుండునె నామది సదయహృదయ!
ఐహికమహాసుఖములొల్ల, నాయువొల్ల,
సద్యశంబొల్ల, రూపాతిశయమునొల్ల,
సర్వసామ్రాజ్యమొల్లను, స్వర్గమొల్ల,
నేను గోరునదొక్కటే నిర్మలాత్మ!
అంచితామ్నాయసన్నుత మైనయదియు,
ససమపావనసాత్త్విక మైనయదియు,
నచలమైనది, చిన్మదం బైనయదియు,
నెదియొ, యాత్మైక్య మది నాకు నిచ్చికావు.

# పతిదేవత

శ్రీమతి యస్. వి. సరళా దేవిగారు

అది రుద్రభూమి. చితిశ్మశానం. పొడుగాటిజ్వాలలతో చితులు మండుతున్నవి. ఒకసుందరి పెండ్లికూతురివలె అందంగా అలంకరించుకొని, తనభర్తయొక్క శవంపాదాలదగ్గర ఆలోచిస్తూ కూర్చున్నది. సహగమనం చెయ్యవలెనని కాబోలు ఆమెకోర్కె.

పలుచని పసిమిశరీరముతో, కొంచెపాటిగెడ్డముతో, భక్తిమరందాన్ని వెలిజిమ్మేచూపులతో, ఒకపురుషుడు గంగానదీతీరాన్నే నడుస్తూ గాఢాలోచనానిమగ్నుడై వెళ్లుతుండెను. తటుక్కున అతనిదృష్టి ఆవనితపై ప్రసరించెను. తోడనే అత డక్కడకు నడచెను.

ఆయువతి అతనిని తులసీదాసని గుర్తించి, నమస్కార మాచరించి విన్నవించుకొన్నది: "తండ్రీ! అనుజ్ఞ ఇమ్ము. నాప్రాణదైవతముతోపాటు స్వర్గసీమల నధిగమింప నీశుభాశీస్సులు కురియుము," అని. తులసీదాసుడు అడిగినాడు "బిడ్డా! ఎందులకు నీకీతొందర? ఈభూమిమాత్ర మెవ్వరిదనుకొంటివి? ఇదికూడా ఆస్వర్గమునిర్మించిన వానిదేసుమీ!" "తండ్రీ! నేను స్వర్గసౌఖ్యమునకై వాంఛించటంలేదు. నాపతినిమాత్రమే నేనుకోరుతున్నాను." అని ఆసుందరి బదులిడినది. తులసీదాసు చిరునవ్వు "అయితేబిడ్డా! నీయింటికివెళ్లిపో. నీహృదయనాథుడు ఒకనెలలోగా మళ్లీ నీకుకన్పిస్తాడు" అనిచెప్పెను.

ఆవనిత ఆశాలతలు చిగురెత్తగా సంతోషించి, తిరిగి ఇంటికి వెళ్లిపోయింది. తులసీదాసు ప్రతిదినము ఆమెఇంటికివెళ్లి మహోన్నత భావాలను బోధిస్తూ, జ్ఞానమార్గం వివరిస్తూ వుండేవాడు. తుట్టతుదకు ఆమెహృదయపాత్రిక దైవభక్తిమాధుర్యాలతో తొణికిసలాడింది. దాదాపు నెలరోజులు గడిచిపోయినవి. ఈసంగతివిని చుట్టుప్రక్కల వాళ్లుఅంతా చాలా ఆశ్చర్యపడ్డారు. వారు విడ్డూరముగావచ్చి "ఏమమ్మా! నీమగడు నీకు మళ్లా కనిపించాడా?" అని అడుగుట ప్రారంభించారు. ఆమెనవ్వి "ఔను కనిపించారు" అనిచెప్పింది. వారింకా ఆతురలై "ఏడీ ఆయన ఎక్కడ? ఎక్కడ?" అని పృచ్ఛించారు. ఆమె ప్రత్యుత్తరించింది. "నాహృదయాధినాథుడు ఎక్కడో లేడు. నాతోఐక్యమై నాప్రభువు నాహృదయమునందే యున్నాడు." అని.

నేను—పెంచినవారుపోయిరి; త
  పించినవారును దూరులైరి; ప్రే
మించినవారునున్ సుతుని
  మ్రింగదలంచిరి; యిట్టి పట్లనే
వంచనో కాలమున్ గడపి
  పాపముపండిననాఁడు నే రసో
దంచితమైన జీవితల
  తాంతమునిండియు వ్రాలిపోయెదన్.

దివాంధము—పారిజాతమునేకోరు పాపియైన
కందిపూవునుకోరఁను విందుగాను
నష్టపరిహారమంచును సృష్టిఁజేసి
కల్పిపాత్ములఁగాఁజేసె కేశవుండు.

నేను—ఈనాఁడడ్రశమంబెట్లో చెదరిపో
  యెన్ లేశమాత్రంబునున్
రానేలేదు సహాయమున్ గలప బో
  రన్ శక్తి యూలేదునా
లో నేదోభయపెట్టె నన్ను కడుపా
  లోవైనచౌర్యంబుచే
లోనాడీవ్రణమట్లు బాధపడగా
  లోలోపలన్ కుందెదన్.

ప్రేమసంవర్ధనపులత రిత్తవోవ
శూన్యవీథినిమార్గంబుఁ జూడలేక
వలపులుడిగిన నేఁటినాతలపుఁగల్మి
గ్రీష్మకాలంపుఁడెండలఁ గేలుమోడ్చి
నిల్చియున్నది కృష్ణవేణీస్రవంతి.

తారకలు—బాలకా! యేటి కీచింతవగవవలదు
పాడుమోయి! నీజీర్ణవిపంచిఁదీసి
కడుపుకాలిపో ధృతరాష్ట్రకౌగిలింత
లే మిగులుగాని లోకాన లేదు ప్రేమ.
పుణ్యపాపములంచును పోయిపోయి
పూర్వగాథలచదువులే గర్వమాచి
తీర్చలేవోయి మనగోల తిన్నగాను
జీవి జీవించు బాలకా! జీవిమీద.
నయనసమ్మోహనంబుగ నాట్యమాడి
రాలిపోవునాఁటికి పూవు పాలిపోయి
తావినంతయు విడనాడి దారిలేక
కటినలోకానఁబడి పోయి కాలవలసె.
కాంచుచుంటిమేము యుగయుగాలనుండి
ఇంచుకంతయు లేదు మార్పిందులోన
ప్రేమశూన్యమై స్వార్థంబులో మునిగిన
పాపలోకంబు వదలి మాతోడ రమ్ము.

నేను—ముదిమిజనించె నాకు కడు
  పొంగెడిదుఃఖముతో వయస్సునన్
ముదుసలి గాకయుంటి నను
  బోలెడివృక్షరవంబులంచు నే
మెదలక యాలకించితిని
  మేల్పడి తీయనివానిభావముల్
వదలవు నామనంబు మన
  వంశముపాడెడి పాటలెంతయున్.

అస్మదీయగాఢసుషుప్తి యందుగాంచు
చుందు నిత్యంబు "రేరాణిసొబగు" స్వప్న
సంజనితవిషాదంపుటుమస్సు లెన్ని
చెరిగిపోయెనో యిచట నేఁ జెప్పలేను.
స్వామిభావంబుఁజూపఁ బాషాణమెత్తు
కూటికేడ్చిన లోలోన కుందుమనును
కష్టమిదియన్నచోఁ జేతికఱవిసరు
నెంతనిర్దయుఁడో దొర యెరుగలేను.
భ్రాతృజనము లీత్రోవనువచ్చిరేని
గాలికెగసి మిగిలిన నాధూళిమీద
విడువుఁ డొకబాష్పకణమును ప్రేమతోన
భిన్నహృదయంబు తా నిల్చియున్నదిచట.

# హైందవబాలిక, ఆమె విద్య

చేబోలు లక్ష్మణరావుగారు బి. ఏ; బి. ఇడి.

ప్రాచీనవిద్యావిధానమును గురించి ప్రశ్నింపగా డాక్టరు ఎ. క. కుమారస్వామిగారిట్లనిరి: "భారతదేశపు విశ్వవిద్యాలయములలో నుత్తీర్ణుడైన ఒకపట్టభద్రు డెవ్వరితోనైన గలసిమాటలాడ ప్రారంభింపగానే ఆయన తనకుగల షేక్స్పియరు మహాకవియొక్క పాండిత్యమును వెల్లడింప మొదలుపెట్టును; మతమునుగురించి ప్రసంగించిన అమాటకర్థమేమియో దెలియదు; సంగీతశాస్త్రము వేరెత్తిన నొకహార్మోనియమో, లేక ఒకగ్రామఫోను పెట్టియో దెచ్చి ముందుంచును; హిందువుల దుస్తులు, నగలు, మొదలగువానిగురించి ప్రస్తావించినచో 'ఛీ!' హిందువు లనాగరికులనును; భారతదేశ చిత్రకళగురించి వంచించిన మనదేశమున నయ్యది యుండినట్లే దెలియదు; ఇంతయేల ఇతరభాషలలోని ఒకయుత్తరమునిచ్చి ఆతనిమాతృభాషలోనికి తర్జుమాజేయుమనిన, నాచేతకాదనును. పాపము! తనదేశమునకు పరదేశీయుడగుచున్నాడు."

దీనికంతకు కారణము ప్రస్తుతపు విద్యావిధానము నందున్నదని వేరుగజెప్ప నవసరములేదుగదా! భారతదేశములోబుట్టిన బాలురకే యీవిధాన మసమంజస మగుచొడల భారతనారీమణులకంతకన్న వేయిరెట్లు అసమంజస మగుచున్నది. పురుషులసామర్థ్యములు, స్త్రీలసామర్థ్యములు వేర్వేరుగానుండు సందర్భములో ఈవిద్యావిధాన మామూలాగ్రముగా మార్పుజేసినను స్త్రీలకుపచరింప నేరదు. స్త్రీలకు జెప్పవలసిన విద్యకును, పురుషులకు నేర్పవలసిన విద్యకును ఏవిధమైన సంబంధమును లేదు. సంఘోద్ధరణములో పురుషుడు జేయవలసినపని వేరు, స్త్రీ జేయవలసినపని వేరు.

హిందూదేశమునందు ప్రవేశ పెట్టబడిన ప్రస్తుతపు విద్యావిధానము పౌరజనులకే గాని జానపదులకుగాదు. అనగా పట్టణములందు నివసించువారలకు విద్యగరపి వారి నౌన్నత్యదశకు దెచ్చినపిదప, పల్లెటూళ్లయందు వాసముజేయువారల నుద్ధరింప జూచుచున్నది. జనపదములందు మొదలిడి పట్టణములకు బోవుటకుబదులు యీవిధానము తలక్రిందుగా నడచుచున్నది. ప్రస్తుతపునాగరికత జానపదులకేగాని పౌరులకేల? వాస్తవముగా రవీంద్రుడు జెప్పినట్లుగా నిజమైన నాగరికత పల్లెటూళ్లలోనే జనన మొందుచున్నది. హిందూమతమునకు మూలాధారములగు వేదములు అరణ్యములలో బుట్టినవే గదా! బుద్ధునికి మహాజ్ఞానము నొసంగినవి అరణ్యములే గదా! అట్టి అరణ్యములను, జనపదములను మరచి మన విద్యావేత్తలు పట్టణములందు వారియుపయోగార్థమే విధానము లేర్పరచియున్నారు. కాబట్టి మనదేశమున నేర్పబడువిద్యకు పాశ్చాత్యవిద్య యను నామాంతరము పోయి హైందవవిద్యయనుపేరు రావలయునన్న పల్లెలందుగలవారి యౌన్నత్యమున కుపయోగపడురీతి ప్రస్తుతపు విద్యావిధానమును మార్పవలసి యున్నది.

పైనజెప్పబడినరీతిగా బాలురకు నేర్పువిద్య ఎట్లు వ్యవసాయము, పల్లెటూరినివాసము మొదలగు గ్రామౌన్నత్యములో సంబంధముగల విషయము లాధారముగా జేసుకొనియుండవలెనో, అట్లే బాలికలకు నేర్పువిద్యగూడ గృహకృత్యములు, శిశుపోషణ మొదలగు గృహౌన్నత్యములో సంబంధించిన విషయము లాధారముగ జేసికొనవలసి యున్నది. ఇప్పటివరకును మనవిద్యాశాఖాధికారులు పురుషులకు బనికివచ్చువిద్య, స్త్రీలకేల బనికిరాదను నూహతోనున్నారు. అంతియేగాని ప్రపంచమునందు పురుషుడెందులకు సృష్టింపబడినాడో, ఆయాకార్యములకు బనికివచ్చు విద్య పురుషునకును, స్త్రీయేల సృష్టింపబడినదో, ఆయాకార్యముల

ఉపకరించువిద్య స్త్రీకిని యొసంగవలసిన కర్తవ్యమును గుర్తించినారుకారు. ఇది గ్రహించినచోగాని మన హిందూస్త్రీ యున్నతదశకు రాజేరదని నొక్కి చెప్పవలసియున్నది. ఉన్నతదశను రాని స్త్రీ సంఘమునకు తోడ్పడజాలదు.

కాబట్టి స్త్రీలకు నేర్పబడువిద్య, స్త్రీకి ప్రపంచజ్ఞానము కలుగజేయుటకుతోడు గృహకృత్యములను కడునేర్పుతో నవరించుటకూడ నేర్పునట్టిదియై యుండవలయును. ఇప్పటివరకును మనదేశమునందెక్కడను గూడ నీఅంశము గుర్తింపబడినట్లు గానరాదు. ఇప్పటికిని, గృహనిర్వహణమునకు జేయవలసిన విధులు, స్త్రీ స్వయముగా తనంతటతానే నేర్చుకొనునని చాలమందియుద్దేశము. పూర్వము మనయార్యులు నివసించు రోజులలో బాలికలు వారి తల్లిదండ్రులవద్ద యీవిధులన్నిటిని నేర్చుకొనువారనిన, నమ్మవలసినదేగాని; యీనవనాగరికత ప్రబలి నివాసయోగ్యమై పాపమన్నదెరుగని పల్లెలన్నిటిని పాడుబెట్టిన యీరోజులలో మునుపటివలె స్త్రీలు తమంతటతామే వానిని నేర్చుకొనెదరనిన నమ్ముటకవకాశములేదు. ఇంటవృద్ధలగు స్త్రీలుండు టదియొకభాగ్య మనుకొను దినములుగతించినవి. ముసలమ్మలను జూడగానే అసహ్యముపుట్టించు కొని, "దీనికేమి తెలుసు ముసలమ్మకబుర్లు" అనువారేగాని, వారినిపూజించి వారివద్ద నేర్చుకొను వారెవ్వ రెవరున్నారు? పాఠశాలలలో నేర్చుకొనుటకు వీలులేదు, ఇంట వృద్ధమాతలనుజూచిన యసహ్యము, పుట్టినింట యున్నన్ని దినములు పనులలోనికి జోరకుండ అల్లారు ముద్దుగపెరుగును, అత్తవారింటికేగిన రోజునుండియు అత్తగారికి శలవు ఇప్పించ ప్రయత్నము—ఇంక గృహకృత్యముల నేర్చుటయెట్లు? దీనికంతకును ఫలితము మనము దినదినము జూచుచునేయున్నాము. ఉదాహరణకు-శిశుమరణమెంత హెచ్చుగానున్నదో జూడుడు! ప్రసవములో చనిపోవు తల్లులసంఖ్యజూడుడు!! ఎంతదుర్భరమో మీకేతెలియగలదు. ఈతల్లులకు విద్యా ప్రసాదముండిన యెట్లుండునోగదా! దేశమునకు భాగ్యముగలదేశజులేగదా ధనము, ప్రాణము, కీర్తి. అట్టి యెడ మనదేశపుబాలికలకు తగినవిద్యనొసంగి, ఆరోగ్యవంతులుగజేసి, సత్పుత్రుల బడయునట్లు చేయుబాధ్యత మనపైయున్నది.

ప్రస్తుతము బాలికలు చాలమంది పురుషులకొఱకు యేర్పరుపబడిన విద్యనేర్చి, గృహకృత్యములు హీనమగు పనులుగా జూచుచున్నారు. ఇప్పుడు బి. ఏ., యం. ఏ. లు ప్యాసయిన స్త్రీలలో ననేకులు వంటయున పెట్టెదో యెరుంగరు. కలముతో వ్రాత, హార్మోనియము మ్రోతయేగాని గరిటెత్రిప్పుటమాత్రము చేత కాదు. ప్రస్తుతపు పాశ్చాత్యవిద్య గృహకృత్యముల జేసికొనుట యందుగల ఘనతను బాలికలకు దెలుపజాలినది గాదు. జీవితములో భాగమగు ప్రతిపనియును ఘనతగలదేగదా! యనివారికి దెలుపలేకపోయినది. గృహకృత్యము గృహిణులజీవితములో చాలగొప్పదైయుండుటచేత బాలికాపాఠశాలలలో చెప్పుపాఠక్రమములో ప్రధానాంశమై యుండవలసియున్నది. నూటికి ఏ ఒకరిద్దరో కళాశాలలలోని విద్యనభ్యసింపగలవారుందురు. తక్కినవారందరును గృహమును సౌఖ్యదాయకముగజేసి, సంసారమను నంధకారమునకు జ్యోతివలె ప్రకాశించి మానవుని విషాదమును, కష్టమును సాధ్యమైనంతవరకు తగ్గించుటయే పరమావధిగనెంచియుందురు. అట్టియెడ నీక్రిందవ్రాసినరీతిగా బాలికాపాఠశాలలలో ప్రస్తుతము నేర్పు మాతృభాష, గణితము, ప్రపంచజ్ఞానము (దేశచరిత్ర, భూగోళము, ప్రకృతిశాస్త్రము), దేశభాష (హింది) లలితకళలకుతోడు ఒకనూతనపాఠ్యక్రమమును ప్రవేశపెట్టిన యుత్తమముగానుండునని నాయుద్దేశము.

1. పాకశాస్త్రము:—1. వివిధదినుసులనుకొనుట, నిలువచేయుట, 2. సామాన్యపాకములు, 3. పిండివంటలు, వానికివలయు సామగ్రి, 4. ఆహారములవిభజన, అవి శరీరమునకు జేయుపనులు, 5. ఆహారశాస్త్రము.

2. పరిశుభ్రత:— 1. గృహమును, గృహమునందలి వివిధసామగ్రులను శుభ్రముగానుంచుట, 2. బట్టలనుతికి ఇస్త్రీచేయుట 3. బట్టలకు రంగువేయుట, రంగులు పోకుండ నురుకుట 4. బట్టలపైపడు డాగులను పోగొట్టుట మొదలగునవి.

3. గృహవైద్యము:— 1. వాయుప్రసరణము 2. మురికినీరు, కాలువలు 3. సామాన్యమగు అంటు వ్యాధులు, వాని తాత్కాలికచికిత్సలు 4. గృహమందు తటస్థించు ఆకస్మికప్రమాదములు, వాని ప్రథమచికిత్స 5. శరీరము, పండ్లు, వెండ్రుకలు, గోళ్ళు, కళ్ళు మొదలగు వాటిని శుభ్రముగా నుంచుట.

4. కుట్టుపని:— 1. చినిగిన వస్త్రములు, చొక్కాలు, దుస్తులు మొదలగునవి కుట్టుట 2. చిన్నజుబ్బాలు, రవికలు, లాగులు వగైరాలు కత్తిరించుట, కుట్టుట 3. మిషనుపైపని 4. ఊలుకుట్టు అల్లిక 5. దారముతో అల్లిక మొదలగునవి.

5. ఇంటిపెరడు:— 1. సాధారణమైనపాదులు పెట్టి పోషించుట 2. ఎరువు 3. పూలమొక్కలు వానిని పెంచువిధము, ఋతువులు, వానితో పూలమొక్కలకుగల సంబంధము. 4. ఆవు, బఱ్ఱె, వానిపాడి. వాటిని పోషించుట 5. పాలనుండి పెరుగు, వెన్న, నెయ్యి తీయుట.

6. శిశుపోషణ:— 1. తల్లిపాలు, పోతపాలు 2. శిశువులదుస్తులు 3. శిశువుల అలవాటులు నడత 4. శిశుశిక్షణ 5. గర్భధారణ, దానికి సంబంధించిన ముఖ్యకట్టుబాటులు 6. ప్రసవము.

ఈ విషయములు తరగతినిబట్టి విభజనచేసుకొని షుమారు 8-వ తరగతి ముగియుసరికి చాలవరకు నేర్పవచ్చును. ఇంకను జదువ నుద్యుక్తులగు వారికి ఉన్నతపరీక్షల నేర్పాటుచేసి వైద్యశాలలలోను తదితరచోట్లను కండాలయజమానులుగాను, మంత్రసానులుగాను ఇంక ననేకవిధములగు నుద్యోగములకు తగునట్లు జేయవచ్చును.

ఈవిధముగా ప్రతిబాలికకును చదువను. వ్రాయను నేర్పినట్లే గృహకృత్యములను నెరవేర్చుటకూడను నేర్పవలసియున్నది. విద్యయను పేర స్త్రీలకు నేర్పవలసిన ఈ ప్రధానవిషయమును మాని దానికిబదులు కళాశాలలో బి. ఏ. లు, యం. ఏ. లు, మొదలగు పట్టములు పుచ్చుకొనుటకు మాత్రమే ఉపయోగపడు విషయములు మనమిప్పుడు నేర్పుచున్నాము. కాబట్టి ఇకనైనను విశ్వవిద్యాలయములలోను, సెనేటులోను మదరాసు శాసనసభలోను, తదితరసంఘములలోను సభ్యురాండ్రుగానున్న మనయాంధ్రస్త్రీలున్నూ, స్త్రీవిద్యపై శ్రద్ధవహింపనుద్యుక్తులుగనున్న సభ్యులున్నూ, యీవిషయమును బాగుగయోచించి, తప్పక రాబోవు సంవత్సరములోనైనను బాలికలకొఱ కొకనూతనవిద్యాక్రమము పురుషులతో సంబంధములేనిదిగ నుండు నట్లేర్పాటుచేసెదరని నమ్ముచున్నాను. అట్లుచేసినయెడల ప్రతిస్త్రీకిని తగినవిద్య యలవడును. అప్పుడుకూడ పట్టములుపొంది, పురుషులస్థానము లాక్రమించవలెనని యుద్దేశముగల స్త్రీలు పురుషులతోపాటు ఇప్పటివలెనే వారికళాశాలలో విద్యనభ్యసింపవచ్చును. కాబట్టి యీనూతన కార్యక్రమము వారికెంతమాత్రము యడ్డుతగుల దనికూడ మనవిచేయుచున్నాను.

# వీరమతి

పురాణం కుమారరాఘవశాస్త్రిగారు బి. ఏ.

మాలవదేశంలో ధారానగరచక్రవర్తి ఉదయాదిత్యుడు. అతనిరెండవభార్యకుమారుఁడు జగదేవుడు; పరాక్రమవంతుఁడు, యువరాజపదవి కర్హుఁడు. అసూయాగ్రస్తయగు పెద్దభార్యమాటలునమ్మి రాజాతని కారాగృహమందుంచెను. జగదేవునిభార్య వీరమతి. పేరుకుఁదగిన వీరురాలు. భర్తను విడిపించుకొని పోఁగలిగినది.—

అచిగురాకు టంగకములందున డాగిన లేమొడందలో
రేచినభావసంచయము లెట్టివో, ఎంతటి తీక్ష్ణమైనవో,
అచిరుసవ్వులో వికటహాసము, ఆకనుచూపునందు నే
దో చిరవేదనానలము తోఁచకమానదు చూచువారికిన్.
పదియారేడులు నిండినిండనిది లేబ్రాయంబులోఁజిందు తీ
యదనంబే తనరూపమై తనరఁగా నల్లారుముద్దైన చి
న్నది, నేడెయ్యదికారణంబొ తన సౌందర్యప్రభల్ గానరా
నిదశన్ నట్టనడింటఁ గూరుచొనియుండెన్ మోముచిట్లించుచున్.
తలవిరబోసియున్నది, యదాయదలై నమొడంద వేడియూ
ర్పులు నిగుడింప మ్లానమయిపోయిన దాస్యసుమంబు దుఃఖరే
ఖలకవుగింట దాగినసుఖంబువలెన్ దోలుకాడు చెల్వమై
చెలువ యొకప్డు కంటతడిచిందిన నొత్తుకొనున్ పటాగ్రమున్.
అది నడిరేయి, అంతవర కాయమ కన్నులుమూయలేదు, నె
మ్మది యికనైన శాంతపథమార్గముతోఁచదు, అంధకారముల్
పొదివిన వన్ని యాశ,లనిలుండు చలింపఁడు,శూన్యమై వియ
త్పథమునఁ జుక్కయైనఁ గనుపట్టదు, భీకరమైనయానిశిన్.
ఒక్కటె చీకటింట నవిమో తన చూపులలోనిభావముల్
ప్రక్కన మిన్కుమిన్కుమని భాసిలుచున్న నిదీపకాంతిలోఁ
జిక్కులుచిక్కులై మెరయ శ్రీమతి చూచుకొనున్ పయోధరుల్
నెక్కొని నేత్రగోళములు నిండి స్రవించెడిదాక నోర్పుమై.
ఎనసి దివాంధరోదనములే వినుపించెడి, యావిషాదగా
థనిశిని యామొగుండెలు దడాబిడఁ గొట్టుకొనంగసాగె, నెం
తని భరియించి సైపఁగల దాచిరులేతనయున్సుపావ;ఏ
మనగలవారమో విధిని? ఆపద మంచికిగూడఁ గల్గుఁబో.
మొగ మరవాంచి ఫాలమున మోపిన యా యరచేయికన్నులన్
సగముగ మూయ, నుస్సురని నాతి వచించెను "ఆకు రాలిపో

యెఁగద మదీయప్రేమలత, యీవిషవాయువు లేఁవచ్చెనో పగవలె నాకొంటంచనెడి పల్కులుమాత్రము రుద్ధకంఠయై. ఈనుడు లప్రయత్నముగనే వచియించినదో ప్రయత్నపూర్వానుగమంబులో తెలియరాదు; చివాలునలేచి యామె కుడ్యానఁ దగిల్చియుండిన పటంబుకుఁ గట్టెదుటన్ నిలంబడెన్ దీనతఁ గానలో బెదరి దిక్కులుచూచెడి లేడిపోలికన్. ఆపె యొకానొకప్డు మనసారవరించి వివాహమాడి ప్రేమాపగలో నెవానిహృదయంబు పవిత్రముజేసె వాని ఛాయాపటమద్ది, దానిఁ గనులార్పక అట్టులె చూచిచూచి తానాపట మట్టెలాగుకొని హత్తుకొనెన్ దన పాలగుండెపై.

నిముసమాత్ర మాయమ ధ్యాననిష్ఠలోన
నున్నరీతిఁగన్నట్టె కన్నులుమొగిడ్చి;
కనులుతెరచి నల్గడలఁ జూచినదిమరల,
అరుణదీధితు లాచూపులందుఁగలవు.
"ఏ యశుభ వేళ నడలిపోయినదొ కాని
నాభుజాబంధమందుండి నానిధాన
మెత్తుకొని పోయినాడు భూమీశు;డింత
నిర్దయుఁడు రాజు వర్థిల్లునే జగాన?
న్యాయమన్యాయ మరయలేనట్టిరాజు
రాజ్యపదవికర్హుండె! ఈర్ష్యాళువైన
సవతితల్లికోపాని కస్మన్మనోధ
వుండు చిక్కి కారాగృహంబున వసించు.
కొడుకుమీది యపేక్ష లేకుండ, మోహ
వశత,నొకయాఁడుదాని కువాక్యములను
నమ్మి యింతలు చేసినా డమ్మహీశుఁ
డింతనగఁ గూర్చినాఁడు నాహృదయమునకు.
అబలననియెంచెఁగాబోలు; ఆడుపులి న
టంచు రూపింపఁగలను; ఆహవములందు
దిగ్విజయమందినారు తంత్రీనినాద
ములకె విసుఁగందు కుసుమకోమలులు మునుపు.
అట్టి రక్తపూరంబె కాదా! మదీయ

రక్తనాళాలఁ బ్రవహించి ప్రజ్వలించు
ఉష్మమయొనర్తు నేవిభుని ప్రాణములతో వి
నోదముగ నాటలాడు ఈనృపవతంసు.
భరతమాతగర్భంబునఁ బడినయపుడె
వీరవనితలమైనాము; విచ్చుకత్తి
మాచిరుతహస్తములతోన ఆచిపట్టి
నాట్యమాడింతు మరులకంఠములమీద.
స్త్రీలవీరంబు చచ్చిపోలేదు మాటు
మణిఁగియున్న దంతే కాలమాయచేత,
బయలుపడితీరు కృష్ణసర్పంబుభాతి
సమయమబ్బినచోఁ గుబుసంబువిడచి.
తలపునకువచ్చి గుండె బ్రద్దలయిపోవు,
పాడుచెరసాలలోఁబడి ప్రాణనాథుఁ
డెంతకృశియించినాఁడొ; నే నింకనైన
మేలుకొనరాదె అతనిఁ బ్రేమింతునేని.
వీరమతియని జనకుఁడేవేళనాకు
నామకరణంబు తాఁజేసినాఁడొ, దాని
సార్థకముజేసికొనుటకు సమయమబ్బె—
ననితలచి లేమ తనవేస మంతమార్చె.
నలుపారుతలకట్టు నైగనిగ్యము మాటు
పడియున్నయది తలపాగలోన
జిలుఁగులేవలిపంబు చెలువారు కటిసీమ
తనరుచున్నయది యోధునిషరాయి
అరటిపూరేకు లాచిరుపాదములపై నె
తోలుచెప్పుల యొరతోడిచెలిమి.
బంగారునగలు సొంపారునట్టి రుచిరాం
గకములన్ని నిరలంకారమయ్యె.
వేసమును వీరమతి మార్చివేసినది ని
గూఢవర్తనంబుకు, తనగుట్టుదాచి;
మీసమును, గడ్డమును లేని మించు రాకు
మారువేసంబు తగియున్నదారమణికి.

ప్రేమమాధురిమ చిప్పిలునేత్రయుగ మగ్ని
కణములై నా చిమ్మఁగలదొకప్డు
ఒరవుఁజూపాన్పుపై నొత్తిగిలుతనువు
కదనకేళికి నిల్వఁగలదొకప్డు
ప్రియునికంఠమె పెనవేయుహస్తము చుర
కత్తిపెరికి పట్టఁగలదొకప్డు
ప్రణయకోపము జూపవలసిన భ్రూభంగ
ములు వైరులను వ్రేల్చఁగలవొకప్డు
అబలయౌఁగాక దాన నేమాయె; సమయ
మబ్బినపుడైన తెలికిరాదా! హృదంత
రాళమున నొదిగిన వీరరసఝరీప్ర
వాహ మొల్లనొరసి ప్రతిధ్వనులు పెట్టి.

చిగురుంబోడి కుమారవేషమును దాల్చెన్ కొను తూగాడకుఁ
డగ శస్త్రంబు బిగించి దాచినది యొడ్డాణంబుగా; నేమిసే
యఁగ నెంచేగుచునుండెనో తెలియరాదాయర్థరాత్రిన్ కుటీ
రగవాక్షంబును దాటికన్పడదు సాంద్రాంధ తమోరాశిలో.

తెలతెలవారువేళ సుదతీసహితుండయి కాననాంతసీ
మలఁ జనుచుండె నొక్కసుకుమారతనూవిలసుండు? సుందరాం
గి లలితబాహుయుగ్మము బిగించిన కంఠమువంచి యామెకుం
తలములు రాయు బుగ్గపయి నవ్యమృదుస్మితరోచి పర్వఁగా.

వీరమతి యామె, జగదేవవీరుఁ డతఁడు,
ప్రణయదంపతులిరువురు; వనులలో నె
వో ముదావహంబుగ లేతముచ్చటలను
నుడువుకొను చేగుచున్నారు; బడలినారు.

ఈయరుణోదయాన వికసించినయట్టి గులాబిపూవు కెం
జాయలతళ్కులే బయల చాదిన నీనునులేతచెక్కుళుల్
నాయెదరాచి తన్మయుఁడనై తిని; ఎన్నిదినాలకబ్బనే
నీయమృతంపువెల్లువలునిండినకౌగిలి నాకు నెచ్చెలీ!
ఈవనసీమ ఁజూచి వికసించిహసించెడు జంటపూవుల
ల్లీవలపుల్ పెనంగొనఁ జరింతము మోదరసప్రసక్తిలో
జీవితకష్టముల్ మరచి; చెన్నొసలారెడి సౌఖ్యవీచిమో
దావహమై తరంగపుటుయ్యాలల నిన్నును నన్నునూపఁగా.

ప్రణయినీ! మనపూర్వసంపదలు మనల
విడచిపోయినవని దుఃఖపడను నేను;
ఈదరిద్రాంధకారమందే మరింత
తేజరిల్లును మనప్రేమదీపకళిక.
అరయ 'పట్టణ'సంస్థాన మరిగి యచట
చిన్నయుద్యోగమొకటి యార్జించి బ్రతుకు
గడుపుకోలేమొ? తిండిలేక మరణింతు
మే! జనకునకు కాకపోయితిమకాని.

మనమున మెచ్చుకొంటి ననమానమహాద్భుత పౌరుషంబు జూ
పిన భవదీయవిక్రమము—విస్మితదృష్టినిగిడ్చి చూచినా
డను సుమ! జైలుకాపరి యొడందప్రవాహమురీతి త్వత్కృపా
ణనిశితతీవ్రపాతమున, నాథరో! నెత్తురు గ్రక్కుచుండగా.

అంత నాతని యొంటగలట్టితాళ
పుంజెవినితీసి జైలుతల్పులను దెరచి
ఆతురతనన్ను కౌగిలినదుముకొనిన
నీపురుషరూపు నేనుధ్యానించుకొందు.
వీరవనితవై నావు, నాప్రేమ నీప
యిని నినుమడించినయది, నాహృదయమునకు
ధీశురాలవై నావు, నీవెంతభర్తృ
హితవో తెలియవచ్చినది; నాకిదిముదంబు.
ఉసువు లేరీతి మార్చినావో, తమోవి
లీనమార్గానఁబడి రాగలిగితి వెట్లొ,
ఏవిధంబున నన్ను రక్షించినావొ,
అబలవయ్యును నీవీర మద్భుతంబు."

అని పొగడింతలన్ జదువు
నట్టి మనోహరువైపు నెమ్మొగం
బును పయికెత్తి "ఆర్య! తను
వున్, బ్రతుకున్ భవదర్పితంబొన
ర్చినపదదాసి యేమిబొన
రించిన మీకృపచేతనేకదా"
యనియె; మరింత దగ్గరకు
హత్తుకొనెన్ బ్రియుఁ డానుహాసినిన్.

# నేను నీ రైతును

అ. ల. నరసింహంగారు బి. ఏ

౧

"అమ్మా! టెలిగ్రాంవచ్చిందమ్మా,"

"ఎవరిదగ్గఱనుంచేఁ?" "ఏమోనే!"

"నీవు బళ్లోకివెళ్ళి చదువు నేర్చుకున్నావుకదూ!"

"నాన్నగారే వొచ్చి చదువుకుంటారు లేవే."

"నీవు చదవలేవటే."

"టెలిగ్రాం చదివేటంతచదువు బళ్లో చెప్పరే."

"పోనీ! ఏవూరునుంచో చూడు!"

"మద్రాసు!"

"నీ మొగుడుదగ్గఱనుంచేగా!"

"ఏమో!"

"అంతసిగ్గెందుకే!"

సాయంకాలము పొలానికివెళ్ళిన రామయ్యగారు వచ్చారు.

"వచ్చారూ? మీఅల్లుడుదగ్గఱనుంచి ఏదో వచ్చింది. చదవండి!"

"అల్లుడు బి. యల్ ప్యాసైయాడే!"

మబ్బులోనుంచి తొంగిచూచు చంద్రునిహాసంలాగ రమణమోము పైకన్పించ గదిలోనికి పారిపోయింది.

౨

"అమ్మాయీ! ఇంకా నిద్రపోతున్నావే!"

"లేచి చాలా సేపైనదమ్మా!"

"రాత్రి నిద్రపోలేదటే!" "ఊఁహూఁ!"

"ఒంట్లో కులాసాగా లేదామణీ!"

"ఊరికే నిద్రపట్టలేదే!"

"నీవు బందరుపోవా లీరోజున! జ్ఞాపకముందా?"

"ఏమోనే!"

"అమ్మాయీ! నీకు నేచెప్పే దేమీలేదు. కాని పుట్టినింటికి మెట్టినింటికి కీర్తితే!"

"ఇవ్వేళనే వెళ్ళడం అమ్మా! నా బుజ్జామ నెవరు పెంచుతారేయింక! ఆవూళ్ళో పాడిపంటా వుంటాయి! గన్నేరుపూలు, పొగడపూలు ధరించి సస్యాల మీదనుంచి సోకే చల్లనిగాలి నే నక్కడ అనుభవిస్తానా?"

"వీటికన్న యెక్కువ ప్రేమాస్పదమైనది లభించిన తర్వాత వీటిని మఱుస్తావే!"

"అలాకాదమ్మా! ఈ కోకిలల గానమాధుర్యాలు, యీప్రకృతిమాతప్రేమను యెడబాసి నే నుండగలనటే!"

"భర్తయెడట ప్రపంచకమే మఱపువస్తుంది లేవే!"

"అమ్మా! నిన్ను మఱచి పోనే!"

రెండు చేతులతో ముఖం కప్పుకుని బోర్లాపడుకుంది కదలకుండా రమణ!

౩

"రమణా! కాఫీలో పంచదార వెయ్యలేదేమే?"

"ఇదిగో కావలసినంత వేసుకోండి. సరేనా!"

"నీవుకాస్త తాగుదు!"

"నాకు సయించదండీ!"

"పల్లెటూరిదానవు! తరవాణి చద్దన్నమే కాని అలవాటు లేదు."

"ఏదో! మఱి మీరు పెళ్ళాడారుగా!"

"నీవు తాగకుండావుంటే నాకుమాత్రం యెలా వుంటుంది!"

"మీరు తాగుదురూ! నాకదే ఆనందం."

"నాకో?"

"నాసంతోషం చూచి!"

"త్వరగా కోర్టుకెళ్లాలి!"

"మీరు కచేరి చావట్లో కూర్చునేటప్పటికి తయారవుతుంది."

"ఎంతచమత్కారివే! ఏదీ నీ చిఱునవ్వొకసారి!"

౪

"మూడేళ్లయిందే యీప్లీడరీ వృత్తిలో ప్రవేశించి! చదువుకే అయ్యాయి యెనిమిదివేలయప్పు! పదెకరాలమ్మేసి అప్పుతీర్చాను. ఈమూడేళ్ల ఖర్చుకే తతిమ్మా పదెకరాలు అమ్మేసి యీరోజే బాకీదార్లకిచ్చేశాను. రేపెలాగో తోచడంలేదు."

"ప్రియా! ఎప్పుడూ ఒకలాగే యుంటుందా?"

"ఒకలాగే వుండకేముంది గాఢాంధకారం! పది రూపాయలు, యీలాపుస్తకాలు మిగిలాయి. అంతకన్న యేమీ కన్పడటంలేదు."

"చూడండి యింకా!"

"ఎన్నాళ్ళని యీ చూడడం! రోజులు చూడడంతోటే ఉన్న ఆస్తి అంతా హరించుకు పోయింది. పుస్తకాలు అమ్మేస్తా!"

"అమ్మేసి!"

"ఏవూరైనా వెళ్ళి వర్తకం చేసుకోవడం మంచిది."

"వర్తకంవద్దూ ఏమీ వద్దు."

"ఐతే యేంచెయ్యమంటావు!

"నాకానుల పేరు, వడ్డాణం అమ్మేస్తే వేయి రూపాయలు వస్తాయి. వీటితో ఐదారునెలలు కాపురం గడుస్తుంది. ఆపైనికూడ యిలాగేవుంటే ఆలోచిద్దాము. దైవానికి దయరాకుండా వుంటుందా?"

"దయరాకేం! ఇదంతా భగవంతుని కృపగాదా?"

౫

"నీనగలు నా లాపుస్తకాలు ఆఖరై పోయాయి కానిఅదృష్టదేవతమాత్రం యింకా ప్రసన్నంకాలేదు."

"అలా విచారించకండి!"

"నిన్ను ఆభరణవిహీనురాలిని గా చేసి నా దైవానికి కృప గల్గిందికాదు యీషణ్మాత్రం!"

"అన్నిటికంటె మిన్నయగువారు మీరులేరా నాకు! ఇంక యీదుఃఖాలన్ని సౌఖ్యాలు గా నే పరిణమిస్తాయి నాకు!"

"మనమువేమునందిట్టి సుగుణవతు లుద్భవించుట చేతనే పురుషులకు శాంతిగల్గుచున్నది."

"భార్య భర్తసుఖదుఃఖాలలో పాల్గొన కుండునా!"

"ఇప్పటికన్ని అయిపోయాయి. పాత్రసామానులు, కుర్చీలు, బల్లలు, మంచాలు ఇంకమిగిలాయి. ఇపుడు చేసేదేమిటింక? చేతకానీలేదు. ఇంతవరకు కాఫీ అయినా త్రాగలేదు.?"

"పెట్టెలో ఒక కానుంది. అది మీరు కాఫీ త్రాగి మార్చిరండి! రెండురోజులు దానితో గడుస్తాయి."

"పోస్టు! పోస్టు!"

"ఏం!"

"టెలిగ్రాం వచ్చిందండి!"

"రమణా! మీ నాన్నగారికి జబ్బుగావుందట! వెంటనే బయలుదేరి రమ్మన్నారు!"

"అః! నాన్నగారికి జబ్బా! అపాయమేమి లేదు కదా!"

"భయపడవలసిన పనిలేదు. ప్యాసింజరులో వెడదాము!"

"ఏమోనండి! నాకుభయమేస్తోంది."

"రమణా! కాను అమ్మేసి వస్తాను. ప్రయాణానికి సిద్ధంచెయ్యి!"

౬

"ప్రియా! చూడు నీపొలాలు! ఈయేడు పొగాకు ముమ్మరంగా పండింది. రెండువేలచిల్లర వస్తుంది పొగాకు అమ్మితే! ధాన్యం పదిపుట్లయాయి!"

"నాన్నగారు, అమ్మ లేనిలోటే కన్పిస్తోంది."

"నీకు పది యెకరాల పిస్తుకింద యివ్వాలసిన వెయ్యిరూపాయలుపోను రెండువేలు సుమారు లాభం వుంటుంది.

"అదిగో! మళ్లీ అలా అంటారేం! నా భూమి మీదికాదా!"

"స్త్రీ ఐశ్వర్యం అనుభవించే నిర్భాగ్యుణ్ణి చేసేవా నన్ను! లాభంతో యీయేడు సుఖంగా కాలక్షేపం చేయవచ్చు."

"అలాగేలెండి! అబ్బాయి వస్తున్నాడు! రారా నాయనా! రామం!"

"నా రామం పుట్టడంతోటే పెద్దమ్మ మసల విడిచి పోయింది."

"నాథా! పొలాలమధ్య పుట్టాం! పొలాల్లో జీవిస్తున్నాం తృప్తితో సుఖంగా!"

"నీవు యినాందారిణివి, నేను నీ రైతును."

"ఎప్పటికీ నేను మీదాసినే!"

రామాన్ని ఎత్తుకొని ముద్దుల వర్షం కురిపించింది రమణ!



# శ్రీమహాదేవుని ప్రార్థన

శ్రీమతి టంగుటూరి నాగలక్ష్మిగారు

ఈమె 'యదార్థభారతి' పత్రికాసంపాదకులుగానుండిన బ్రహ్మశ్రీ టంగుటూరి రామస్వామయ్యగారి భార్య. వయస్సు 20 సంవత్సరములు. విదుషి. వేదాంతవిషయములందు అభినివేశము మెండు. తమిళాంధ్రముల నెఱుగును. అచ్చుకూర్పుటయందు అందెవేసినచేయి. ముద్రణవిషయమున ఈమెతో దొరయుపాటి జ్ఞానముగలవారు ఆంధ్రస్త్రీలలో ఎవ్వరులేరని చెప్పవచ్చును ఈకీర్తన శివరాత్రికెంతయు తగియున్నదనుట ఈమాసమున ప్రచురించుచున్నాము.

—సంపాదకుడు.

శ్రీమహాదేవ శంభో చంద్రశేఖర మహాత్మ
నామనవియాలకించి నన్ను పాలింపు దేవా
జననమరణాదులెన్నో చెందియున్నానుగాని
ఘనమైనసీదుకరుణ గాంచంగలేనైతిని
నరజన్మమిచ్చినావు నాయందుకరుణకలిగి
పరమేశ జారనీక పట్టినన్నేలుమయ్యా
భక్తులవలెనిన్ను భజనసేయుటకునాకు
శక్తి లేదనుచు నన్ను సర్వేశ వదలకయ్యా
కాలకింకరులువచ్చి కట్టి చేకొనకమునుపే
శూలపాణి దయాళో సుందరా నన్నుబ్రోవు
కాలకాలాకపాలీ కరుణ నాయందునుంచి
కాలునిభయమునాకు కడద్రోసివేయుమయ్యా
శివశివాశంభో యీశా చిన్మయానంద దేవా
భవబంధములచేనన్ను బాధింపజేయకయ్యా
పంచబాణునిపోగరు భస్మముసేయు దేవా
సంచితాఘములను సంహరించుము శివా
స్వామి మహానుభావా సర్వేశ దీనబంధో
కామాదిమోహములను ఖండించివేయుమయ్య
శరణన్నవార్లనెంతో కరుణించిగాచినావు
కరుణాసముద్రనాడు చెరదీర్పరావదేమో
జననమరణముల దుఃఖముగుభవమొందు

దీనజనులరక్షించ నీకు ఘనముకాదా మహాత్మా
నామీదదోషములు నమితమైయుండినాను
తామసమొందకయే దయయుంచిమన్నించుమా
నిన్ను నేనెరుగలేక యెన్నో విధములను
నన్నుతించితిస్వామి అన్నియునునీవేకావా
తనువులో నీవుండి నే తత్తరపడుటయెరిగి
మనవిచేకొనకయుంట మహిమయే నీకు దేవా
నీయాజ్ఞవలననేదో నెరవేరుచుండగాను
ఆయాసపడుటవలన నది వేరెయగునోయీశా
చలియించు నాదుమనసు చంచలమొందనీక
నిలుకడకలుగజేసి నీదర్శనమునిమ్మా
నీమహామహిమజూడ నేనాశగొంటినయ్యా
నామనోవాంఛదీర్చు నాగభూషణ, యీశ్వరా
పరిపరివేడవచ్చు భజనసేయగవచ్చు
పరమాత్మ నీవు నాకు ప్రత్యక్షమగుటయెట్లు
అతివేగముననను నన్ను ఆదరించకయుంటె
గతియేమి యున్నదికను గౌరీశ దెల్పుమయ్యా
సాంబశివ మహాత్మా సాయుజ్యమొసగుమయ్యా
అంబరకేశ దేవా హర, హర, శరణు, శరణు.

# స్వార్థపరులకు నిత్యసంపత్తి యున్నె

గోటేటి సత్యనారాయణగారు

దినమెల్ల రవికిరణదీప్తిచే జగమును
వెలిగించి తనకాంతి వీడకుంట
నిర్మలాంబువులను నిత్యంబునొసగుచు
ఝరులింక కూటల నూరుచుంట
చల్లగాడ్పుల నజస్రము వీచుచునువాయు
వొక్కింత బలమైన నుడుగకుంట
అనుదినంబును మనోహ్లాదంబు నిచ్చుచు
పూలతల్ శోభ గోల్పోవకుంట
ప్రకృతివైచిత్ర్య: మిందలిభావమేమొ
కానఁగాలేక నరుఁడెంత కాలమైన
నిచ్చగించును స్వీకృతి కియ్యకొనఁడి
తరుల కొసఁగఁగఁ గోల్పను దానఁజేసి
స్వార్థపరులకు నిత్యసంపత్తియున్నె?



'పట్టుకుంటా, పడు'



కుట్టుపని



'నీలాటి రేవు'

ఛాయాచిత్రగ్రాహకులు: శ్రీ రామారాయవర్మ గారు



'సంగీతసాధన'



సోదరీ ప్రేమ



'ఎత్తుపై ఎత్తు'



శ్రీమతి తాయిరత్నమాలగారు
వ్యాసకర్త్రి



—రా జా ఖా జా—

సేరు మైదాపిండి తెచ్చి ఆపిండి పావుసేరు నేతిలో వేయవలెను. ఆపైని ఆపిండి ముద్దఅగునట్లు నీళ్ళతో కలుపవలెను. నిమ్మకాయంత ముద్దచొప్పున అప్పడాలకర్రతో అప్పడములు వత్తవలెను. ఈఅప్పడాలు చాలాపలచనగా వుండవలెను. ఒక్కొక్క అప్పడంపైని వెచ్చటినెయ్యిరాసి రెండేసి చొప్పున కలిపి మూడుమడతలుపెట్టి మనకు కావలసినంతముక్కలు కోయవలెను. ఒక అరవీసెడు నెయ్యి బాణలిలోపోసి మరగపెట్టి యీఅప్పడంముక్కలు వేయించవలెను. ఈవేయించినవి అన్నీతీసి ఒకపళ్లెంలో పెట్టుకోవలెను. అరవీసెడు పంచదార పాకంవచ్చినట్టు మరిగించవలెను. తీగపాకంరాగానే తీసివేసి, అందులో యాలకుపళ్ళగింజలగుండ, కుంకుమపువ్వువేసి ఆపాకు బాగాకలిపి అందులో పైనివేయించి వుంచుకున్న అప్పడంముక్కలు మంచి కొంచెముగాకలిపి బాగా పాకం అన్నిటికి అంటునట్టు చూచుకొని భుజించవలెను. చాలా బాగావుంటాయి.

—న్యాపతి బుచ్చిలక్ష్మమ్మ.

—మెం తి కూ ర మా టో డా—

మెంతికూర కాడలులేకుండా ఏరి సన్నగా తరిగి మట్టిలేకుండాకడిగి వడపోసివుంచవలెను. శనగపప్పు తగుమాత్రంగా నానపోసి నానినతరువాత బాగాకడిగి నీళ్ళులేకుండా వడియపోసి తరువాత తగుమాత్రం మిరపకాయలు ఉప్పు యింగువవేసి మెత్తగారుబ్బి కరిగిపెట్టిన మెంతికూరనువేసి, కలిపివుంచవలెను. పొయ్యిమీద బాణలివేసి నెయ్యిగాని నూనెగాని మరింతవేసి ఆవాలు, పుద్దిపప్పు వేయవలయును. అది వేగిన తరువాత ఈకూరను బాణట్లోవేసి వేయింతవలయును. నిలుపకుండా వేయించి కొంచెము ముద్ద పొరుగా వుండునప్పుడు దించి, కళాయిపాత్రలో గాని, మరిగెలోగాని తోడుకొని వేయించిన దోసకాయలతోనే అదిమిఉంచి 5 నిముషములుతాళి అన్నములో కలిపి భుజించిన చాలారుచిగావుండును. దేహమునకు మంచిఆరోగ్యమును ఇచ్చును. అన్నమునకు మంచిపాచకము. పాడిపాళ్లాడుతూవుండును. ఈ మెంతికూర కర్నాటక దేశములో విశేషముగా చేయుదురు. శరీరమునకు ఆరోగ్యమైనది. ఈమాదిరి చిక్కుడుకాయకూడా చేయవచ్చును.

—రాళ్ళబండి సీతాలక్ష్మమ్మ.

—బొ రు గు ల వు ప్మా—

రొయ్యగడ్డలు 5 పలాలకు పైగా పొట్టులేకుండా వొలిచి సన్నముక్కముక్కలుగాతరిగి వుంచవలెను. 2 సేర్ల బొరుగులు తెచ్చి మట్టి, ఇసుక లేకుండా కడిగి బుట్టలోవడియబోసి వుంచవలయును. బాణట్లో నెయ్యివేసి ఆవాలు, పుద్దిపప్పు తిరుగపోసి రొయ్యగడ్డ ముక్కలను వేయవలయును. అది మెత్తబడినతరువాత బొరుగులు పచ్చిమిరపకాయలు ముక్కలువేసి వేయించినతరువాత శెనగపప్పుపిండి కొంచెముచల్లి దింపి నిమ్మపండురసముపిండి కలియపెట్టి దింపి కళాయి పాత్రలోవుంచి వేడిగా భుజించిన చాలరుచిగావుండును. రవకంటె అతిసులభము. వెలతక్కువ. ఫలము ధికము. వేడిచల్లారకముందే తినవలెను. రొయ్యగడ్డలు పనికిరానివారు వట్టిబొరుగులతో చేయవచ్చును.

—పురాణం జ్ఞానమ్మ.

—కొబ్బరికాయ గారెలు—

మంచి రెండు కొబ్బరికాయలను తెచ్చి కోరి యుంచుకోవలెను. ఆ రెండు కాయలకోరుకి ఒక అర్ధ పావు బియ్యము నానవేసి యుంచుకొని ఆ పిమ్మట యీ కోరు, నానినబియ్యము, దానికి తగినంత ఉప్పు, కారము, జీలకర్ర, అల్లము, పచ్చి మిరపకాయలు, కొంచెం యింగువ వేసి మెత్తగా రుబ్బి యుంచుకోవలెను. తరువాత ఒక బాణలిలో నూనెపోసి పొయ్యిమీద ఉంచవలెను. ఈరుబ్బియుంచిన ముద్ద కొంచెంతీసి గారెలవలె తట్టి బాణలిలోవేసి బాగా వేగినపిమ్మట తీసి భుజించవలెను. ఈ గారెలు చాలా రుచిగానుండును. మరియు ఈ గారెలు కారము మొదలైనవి వేయకుండానే, యీ కోరున్ను బియ్యము మెత్తగారుబ్బి బెల్లముగాని పంచదార గాని వేసి రుబ్బి గారెలుగాచేసి వేయించి భుజించిన చాల రుచిగానుండును. ఇవి రెండు మూడు దినము లున్నను చెడిపోవు.

—నువ్వుల కక్కెరములు—

మంచి నువ్వులు పప్పుచేసి యుంచుకోవలెను. పిమ్మట ఆ పప్పును బాణలిలోవేసి పెళపెళమను వరకు వేయించి తీసి పళ్లెములో ఉంచుకోవలెను. తరువాత ఆ వేయించిన పప్పును రోటిలోపోసి గుండ అగునట్లు దంచవలెను. అట్లు దంచిన నువ్వులగుండకు సరిపడునంత బెల్లముగాని పంచదారగాని అందులో పోసి రెండును కలియునట్లుగా బాగా దంచవలెను. తరువాత ఆ ముద్దను వేరె పళ్లెములో యుంచవలెను. (1 సేరు నువ్వులపప్పుకి ½ వీసె పంచదారగాని, ¼ వీసె బెల్లముగాని వేయవలెను.) మరియొక గిన్నెలో 1 అర్ధసేరు బియ్యంపిండి, 1 పావుసేరు మైదాపిండి బాగా జల్లించి తోపునకు కలిపియుంచవలెను. (ఇదిగాక ఒక అరసేరు బియ్యము ఒక పావుసేరు మినపపప్పు కలిపి విసిరి జల్లించినను సరే లేక యీ రెండును కలిపి నానవేసి రుబ్బిన పిండి తోపు అయినను సరే) యీ మూడువిధములైన తోపుల లోను ఏది అయినను పనికివచ్చును. ఆ తోపు బాగాకలిపి యీ నువ్వులు, బెల్లమూ కలిపి దంచి యుంచిన ముద్ద చిన్న యుండవలెచేసి కొంచెం బిళ్ల మోస్తరుగాచేసి యీ తోపులో ముంచి మంచి నూనె బాణలిలోపోసి మరుగుచుండగా ముంచిన ఉండలను వేసి ఎఱ్ఱగా వేగినపిమ్మట తీసి భుజించవలెను. చాల రుచిగానుండును. ఎన్ని దినము లున్నను చెడిపోవు.

—దుంపల బూరెలు—

మంచి దుంపలు ఒక వీసెను తెచ్చి కడిగి ఒక గిన్నెలో నీళ్లుపోసి యీ దుంపలను ఆ గిన్నెలోవేసి పొయ్యిమీద పెట్టి మెత్తగా ఉడికించి తోలువలచి యుంచుకోవలెను. ఆ పిమ్మట ½ వీసె పంచదార వేసి యీవలచియుంచినదుంపలు కలిపి ముద్దచేయవలెను. ఏలకపళ్లు దానికి తగినంత గుండచేసి ఆముద్దములో వేసి కలుపవలెను. తరువాత బియ్యము ఒక అర్ధసేరు. 1 పావుసేరు మినపపప్పు కలిపి విసిరి జల్లించిన పిండిగాని, లేక నానపోసి కలిపి రుబ్బిన పిండిగాని, లేక ఒక అర్ధసేరు బియ్యంపిండి ఒకపావు సేరు మైదాపిండి బాగా జల్లించి చోవివలె కలిపి గాని, తోపు పెట్టి యీ చక్కెర ఏలకుల పొడిచేసి కలిపియుంచిన ముద్దను చిన్న చిన్న యుండలుగా చేసి యీతోపులోముంచి మరుగుచున్న నూనెలో వేసి బాగా బూరెలవలె ఎఱ్ఱగా వేగినపిమ్మట తీసి భుజించవలెను.

—పి. కొండమాంబ.

—అటుకుల దోసెలు—

బాగుగా (ధాన్యములేకుండ) దంచిన అటుకులు 1 సోలెడు, 3 సోలలు బియ్యమును, కొంచెము నీటి లోనూ, పుల్లని మజ్జిగలోనూ, నీరుమజ్జిగాకూడా నానుసరికి యిగిరిపోయేటట్లు నానపెట్టవలయును. మరునాడు వుదయము యివి రుబ్బురోటిలో మెత్తగా రుబ్బవలయును. రుబ్బుచున్న పిండిలో పచ్చిమిరప కాయలు, (పచ్చి మిరపపండ్లు (శ్రేష్టము) అల్లము ముక్కలు, కొంచెము జీలకర్ర, తగిన వుప్పు చేర్చుకోవలయును. పెనము బాగుగా కాలనిచ్చి, నెయ్యి గాని, నూనిగాని పెనముమీదవేసి రమారమి ” దళసరిలో అట్లు పోసుకోవలయును. ఈ అట్లు అంత తొందరగా కాలనివ్వగూడదు. అట్టు కాలు సరికి ½ దళసరితో, తెల్లగాను, మిక్కిలి చలాగ్గానూ తయారగును. ఇదిచూచుటకు రొట్టెవలె నేయుండి తినుటకు బహురుచికరముగా ఉండును. ఎన్ని తిన్ననూ జబ్బుచేయదు.

—జయంతి వేంకటలక్ష్మి.

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## జోలపాట

ముగువ నాఅబ్బాయి మాటల్లుజూచి,
మాణిక్యములతోటి పొడిచెనూర్యుడు.
చిన్నినాఅబ్బాయి చిరిముఖముజూచి,
సిగ్గుపడిచంద్రుడు పొడవనేరడు.
పొద్దున్నరావోయి భోగిసూర్యుడ
పొడగన్నవారెల్ల నీకు మ్రొక్కేరు.
రాత్రికివస్తేను రామచంద్రుడ
రాచవారాడోడుదు నిన్ను రానియడు.
పుణ్యమ్ముగలవారి పందిళ్ళక్రిందా
ఆడుచువుండేనె తాను అబ్బాయి.
పుణ్యమ్ముగలవారి పూతోటలోను
పింఛమిచ్చాడింది సోగల్లనెమిలి.
చిలకల్లు మాయింటి చెలికత్తెలమ్మ
హంసలు మాయింటి ఆడుపడుచులు.
కోవెలలు మాయింటి కొత్తకోడండ్లు
అబ్బాయి మాయింటి ముద్దుమనమడు.
పుణ్యమ్ముగలవారి పువ్వుల్లబీర
భాగ్యమ్ముగలవారి పందిళ్లకిభ్యా.
అందెల్లుపెట్టేడు తాను అబ్బాయి
అందుకొని ఆబీరపువ్వుల్లే కోసు.
కాళ్ళకడియాల తాత అబ్బాయి
వద్దురమ్మనిపిలుచు ముద్దుతమ్ముణ్ణి.
తిరుమంత్రమే వీరి తిరుమేనులై య్యుండు
పరగద్వయమే వీరిపాదాంబుజములు.

శ్రీమతి కంకిపాటి రుక్మిణమ్మగారు

చరమార్థమే వీరి చలవతిరునయనములు
ఉరునాభికమలమే ఓంకారము.
పరంజ్యోతిప్రణవమే పట్యమంచమాయ
పరగాదిశేషుడే పానుపాయె.
లాలెమ్మగుఱ్ఱాలు లంకల్లుమేసు
అబ్బాయిగుఱ్ఱాలు మేసుపల్లాలు.
తొట్టినాగన్నకు తోడెవ్వరమ్మ
యేనుగలమొక్కేటి రాయప్పతోడు.
ఆడుకొనిఅబ్బాయి వచ్చగాజోలు
అందెల్లు చప్పుడాయ అరుగుల్లమీద.
చదువుకుని అమ్మాయి వచ్చెగాజోలు
సరస్వతి చప్పుడాయ చావిడిలోను.
గోల్కొండ కడనుండి ఢంకానగారా
గొబ్బున్నకొనివచ్చి గోవిందుకిచ్చె.
నెల్లూరిఅంగట్లో నెమలివాలింది
నెమలికేసినఅంబు నేలకానింది.
సింహాపురి సింహాపురి అందురేకాని
చూపులకు సింహాపురి చుట్టుకొల్లారు.
కోమట్లకు సింహాపురి కొంగుబంగారు
బ్రాహ్మలకు సింహాపురి పెన్నస్నానమ్ము.
ఇల్లలికి ముగ్గుపెట్టి ఇంతపనిచేసి
ఈయింటి ఆడోసుచు ఎందుపోయినదో?
ఈయింటి ఆడోపుచు తానురాజలక్ష్మి
అన్నలతో వియ్యమ్ము అందపోయినది.

పోకవన్నె చీర కట్టవేడుకె,
పోరుగూరిపెండ్లికిపోను వేడుకె.
వన్నెచీరందమ్మ వీణెమందమ్మ
వెలదికి అర్ నెల్ల వేకటందమ్మ
పట్టుచీరందమ్మ పాపడందమ్మ
చుట్టరె చుట్టరె వడకచక్కిలాలు
చిన్ననాఅబ్బాయి వడుగుమాయింట.
వండరెవండరె వడుగువంటల్లు
వల్లభుడు జగన్నాథు వడుగుమాయింట.
ఆటకూటమ్మున ఆడేటినెమిలి
వేటకాడొచ్చేటపు ఆటచాలించు.
నాటకపుశాలలో నవ్వేటిపద్మ
నీమొగుడువొచ్చేను నివ్వుచాలించు.

దిగువతిరుపతిలోను దివిటీలువెలుగు
ఎగువతిరుపతిలోను ఏరాజుపెండ్లి
దిగువతిరుపతి-లోను దీపములువెలుగు
అప్పయ్య అలమేలు మంగపెళ్ళిళ్లు.
ప్రొద్దుప్రొద్దు లేచి మొక్కుదముకొండ
మ్రొక్కుదము మనపాలి వెంకటప్పన్నే
శ్రీవెంకటప్పయ్య దిక్కునీవయ్య
బాలులనురక్షించ నీభారమయ్య.
అలిమేలుమంగమ్మ ఆడిన్నపసుపు
అప్పయ్యకోనేట తెప్పలై తేరు.
వెంకటప్పనికొంక వెలశుండవలెను
ఎప్పటికిపుట్టిల్లు కలిగుండవలెను.

౨. కథలు

## కొండత్రవ్వి ఎలుకను బట్టుట

శ్రీమతి జి. సత్యవతమ్మ గారు

పూర్వకాలమున ఒక గ్రామములో ఒక రాజుండెను. అతడు బాల్యమున విద్యనభ్యసించని హేతువున నిరక్షరకుక్షియై లౌకికజ్ఞానమున నెట్టిదియో యెఱుగక మిక్కిలి మూర్ఖతచే రాజ్యపాలన మొనరించుచుండెను. అతనియొద్ద మంచిచెడ్డలనెఱుగని మంత్రియు, తెలివిలేని సేవకులును కొలువుసేయుచుండిరి. ఒకనాడారాజు కోడిపందెముల కేగదలచి తానుధరించు వస్త్రములను చాకలివానిచే శుభ్రముగా ఉదికించుమని సేవకున కాజ్ఞాపించెను. సేవకుడు చాకలిని పిలిపించి రాజుగారు రేపటిదినమున కోడిపందెములకు దయచేయుదురు. కావున వారిబట్టలకు గంజివగైరాలు బాగుగా పెట్టి తయారుచేయవలయునని చెప్పెను. చాకలి అట్లేచేసెదనని చెప్పి కొన్నిబట్టలను గొనిపోయి వానికి పెసరపిండి మొదలగునవి దిట్టముగాబెట్టి కూనూరుకొండపై ఆరవేసి తెచ్చి సేవకున కొప్పగించెను. సేవకు డాబట్టల నొకపెట్టెలో బెట్టెను. ఆమరునాడు రాజు స్నానమాడి ప్రయాణపుబట్టలు కట్టుకొనుటకై తెమ్మనియడుగగ సేవకుడు పెట్టెలోబెట్టిన బట్టలను తీసుకొనివచ్చి విప్పిచూడకయే రాజునకిచ్చెను. రాజు ఒకపంచెమడత విప్పిచూడగా దానికి మూడుచోట్ల పెద్ద కన్నములుండెను. అంతరాజు ఈకన్నము లెట్లువచ్చెనని సేవకునడిగెను. ప్రభూ! ఆసంగతి నాకేమియు తెలియదు. చాకలి యెట్లిచ్చెనో అట్లేనేను పెట్టెలోబెట్టితినని సేవకుడు బదులుచెప్పెను. రాజు వెంటనే చాకలిని పిలిపించి "ఓరీ! చాకలీ! నిన్న నీవునాకు తెచ్చిన బట్టలలో ఒకదానికి కన్నము లెట్లువచ్చెనురా?" అనియడిగెను. చాకలి యిట్లుచెప్పెను "స్వామీ! ఈదినమున దేవరవారు కోడిపందెములకు దయచేయుదురు కావున నలుగురు జూచి మెచ్చుకొందురని ఏలినవారిబట్టలకు పెసరపిండి వగైరాలు దిట్టముగా పెట్టి ఈప్రాంతమున ఆరవేసినచో ఎలుకలుండునేమోయని భయపడి మిక్కిలి ప్రయాసమున కూనూరుకొండపైకేగి అచ్చట ఆరవేసితిని. కాని ఏమూలనుండియో ఒకఎలుకవచ్చి ప్రభువువారి పంచెయనినైన యోచించక పరుకుపరుకుమని కొరికివే

సెను. నేనుదానిని బట్టుకొనవలయునని చాలదూరము తరిమితిని. కాని నన్నదిమాయజేసి ఒక కొండబొరియలో దూరిపోయెను. ఈవిషయమున నాతప్పేమియులేదు. కావున నన్ను క్షమింపవలయును" అని పలుక రాజిట్లనియెను "ఏమి! ఒకయెలుక మాబట్ట కొరికివేసెనా. అది మాప్రతాపం తెలియదుగాబోలును. దానికిప్పుడే తగినశిక్ష యొనరింపవలయును" అనిపలికి మంత్రిని వెంటనే పిలిపించి మంత్రీ: ఈచాకలి దివాణపు బట్టలు కూనూరుకొండపై ఆరవేయగా ఒకయెలుక నాబొద్దంచుపంచెను కొరికివేసినదట. అందువలన మేమిప్పుడే అచ్చటికిబోయి కొండత్రవ్వి ఎలుకనుబట్ట నెంచితిమి. కావున నాలుగువేలమంది ఉప్పర్లను, అయిదువేలమంది. వేటకాండ్రును, పారలు, గునపములు, తుపాకులు, బల్లెములు, మొదలగు సాధనములతో మావెంట బైలుదేరివచ్చునట్టి యేర్పాటు చేయవలయును. మఱియు మేము తిరిగి వచ్చువర్యంతము మా జనానావారికి ఏబాధయు గలుగకుండ నీవుమిక్కిలి జాగరూకతతో జూచుచుండవలయును" అనిచెప్పిన, మంత్రి "రాజేంద్రా! తమ సెలవుప్రకారమన్నియుగావించెద" ననిపలికి వెంటనే సైన్యములరప్పింప రాజు సైన్యములతో ప్రయాణమై చని నాటిసాయంకాలమునకు కూనూరుచేరి కొండత్రవ్వింప మొదలుపెట్టెను. ఇట్లొక నెలదినములు గడచినపిమ్మట ఒకదినమున రాణిగారి కాలిబొటనవ్రేలిపై తేలుకుట్టినందున మిక్కిలి బాధనొందుచు ఆపత్కాలముకావున గోషావిడిచిపెట్టి మంత్రినిపిలిపించి తనకాలిపై తేలుకుట్టినదనియు, విషము పైకెక్కుచున్నదనియు ఈబాధ వెంటనే నివారణచేయువిధ మాలోచింపుమనియు బలుక, మంత్రి మిక్కిలిజాలినొంది ఆలసించిన విషము తలకెక్కి ఏమిప్రమాదము సంభవించునోయను భయమున వెంటనే ఆమెశిరస్సు గొడ్డలిచే నరికివేసెను రాణి తక్షణమే గిలగిలతన్నుకొని మరణించెను. పిమ్మటమంత్రి తనమనసునం దిట్లు యోచింపసాగెను "ఈమె ప్రాణములు మహాద్భుతముగా పైకెగిరిపోయినవి. నేనిప్పుడు ముఖ్యముగ చేయవలసిన దేమనగా. ఈరాణి గోషాస్త్రీకావున శ్మశానవాటికకు గొనిపోవుట మంచిపనికాదు. మఱియు ఈమె అతిసుకుమారియగుటవలన ఈమెశరీరము కట్టెలచే దహనమొనరింపగూడదు. ఈమేడలోనే కొన్ని గడ్డిబొద్దులు పరిపించి ఆగడ్డినిండ కిర్సనాయిల్ పోయించి ఈమెనందుపై మెల్లగా బరుండబెట్టి ఒకఅగ్గిపుల్ల వెలిగించినయెడల ఒకనిముషములో కార్యము నెరవేరగలదు" అని నిశ్చయించుకొని వెంటనే ఆప్రకారము జరిగించెను. ఆవిధముగ గడ్డిబొద్దులంటించుటచే క్రమముగ కోటలోనున్న మేడలుమిద్దెలన్నియును, గ్రామములోగల యిండ్లన్నియును తగులబడి భస్మమైపోయినవి. అంత మంత్రి అభస్మరాసులన్నిటిని దిలకించి అవిపోవు ఉపాయంబెట్లని యోచించి కొంతవడికి ఆగ్రామమునగల పెద్దచెరువుగట్టు తెగగొట్టించిన ఆచెరువులోని నీరంతయు గొట్టుకొనివచ్చి అభస్మరాసులన్నిటిని క్షణములో మాయముజేసెను. మంత్రి కప్పటికి కొంతశాంతిగలుగుటచే రాజుగారి కీసమాచారము తెలియపరచుట మంచిదనియెంచి మొదటినుండియు జరిగినవృత్తాంతమంతయు ఒక కాగితముపై వ్రాసి అది రాజుగారికిచ్చి రమ్మని ఒకబంట్రోతు చేతికిచ్చెను. ఆబంట్రోతు వీరందరికన్న మిక్కిలి తెలివిగలవాడగుటచే "అయ్యా, రాజుగారిప్పు డెక్కడనుండిరో ఏదిక్కుగా అచ్చటికి బోవలయునో ఆవయనము చెప్పకున్నచో నేను పోజాల" నని పలికిన మంత్రియిట్లనెను. "నీముక్కుకు తిన్నగా పడమరదిక్కునకు పోవలయును. త్రోవలో ఎక్కడ ప్రొద్దుగ్రుంకినట్లు కనబడునో నీవక్కడ పండుకొనుచు ఆమరునాడు సూర్యోదయ మయినతరువాత లేచి వెళ్లుచుండవలయును. అట్లువెళ్లినచో ఏడుదినములకు నీవచ్చటి కేగగలవు. అనిచెప్పుటయు బంట్రోతు అజాబు తీసుకొని ప్రయాణమై పోయెను. ఇట్లుపోవుచుండ ఒకనాటి మధ్యాహ్నము రెండుగంటలవేళ ఒకచోట రెండు పెద్దకొండలు వానికి గనబడెను. ఆకొండలమధ్య ఒకచిన్నకాలువ పారుచుండెను. ఆకాలువపై ఒక తాటిబద్ద వేయబడియుండెను. బంట్రోతు ఆకాలువదాటుటకై తాటిబద్దపై ఒకకాలును, క్రింద ఒక

కాలునువేసి ఆకాశమువంక జూడగా ఆరెండుకొండలమధ్య సూర్యుడు కనుపించనందున ప్రొద్దుగ్రుంకినని తలంచి మంత్రిచెప్పినమాటలు జ్ఞప్తికివచ్చుటచే వెంటనే ఆతాటిబద్దపై పండుకొని నిదురబోయెను. ఆనాటి తెల్లవారుజామున ఒకమంగలి కూనూరుకొండపైనున్న రాజుగారికి క్షౌరముచేయుటకై పోవుచు ఆకాలువ చెంతకువచ్చి తాటిబద్దపై పండుకొనియున్న బంట్రోతునుజూచి "ఎవ డిక్కడ పండుకొనినది? లేచి దారియొసంగుడు" అని గద్దించిపలికెను. బంట్రోతు వానిమాటల వినిపించుకొననందున కోపమువచ్చి ఆమంగలి బంట్రోతు తల నున్నగా గొరిగివేసి వానివీపుపై మూడుతాపులు తన్ని తనదారినిబోయెను. బంట్రోతు సూర్యోదయమైనపిమ్మట లేచి ప్రయాణమైపోవుచు సమీపమునున్న ఒకచెరువులో మొగముకడుగుకొనబోయి ఆనీటిలో తన నీడగాంచి ఎవడో బోడివా డచ్చటనున్నాడనియెంచి అటనుండి వేరొకచోటికేగి అచ్చటను అట్లేకనబడుటచే మిక్కిలి కోపముతెచ్చుకొని "ఎవడురా ఈబోడివాడు. నేనెక్కడకుపోతే అక్కడకే వచ్చుచున్నాడు" అని తిట్టుకొనుచుండ ఆసమయమున అమార్గమునబోవు బోడివాడొకడు వానిమాట లాలకించి వాడు తన్ను తిట్టుచున్నాడనియెంచి "ఎవరినిరా తిట్టుచుంటివి. నీకంటె బోడివా డిక్కడ నెవడున్నాడురా" అని వానిబోడిగుండుపై గట్టిగా నాలుగు మొట్టికాయలు మొట్టెను. అంత బంట్రోతు తలదడివిచూచుకొని "ఆహా! మంగలివాడు నాతల గొరిగిపోయినవాడు కాబోలును. వాడెంతకైన దగినవాడని చెప్పవచ్చును". అని యనుకొని మొలను గట్టుకొనియున్న కండువా తలకుజుట్టుకొని అచోటుబాసిచని కొంతవడికి కూనూరు కొండపైకేగి అచ్చట అతిదీక్షతో కొండద్రవ్వించు రాజును గాంచి నమస్కరించి "మహాప్రభూ ఇదిగో మంత్రిగారు దేవరవారికిమ్మని జాబుపంపించినారు" అనిచెప్పి జాబు రాజున కిచ్చెను. రాజుఆజాబంతయు జదువుకొని బంట్రోతు నిట్లడిగెను ఒరే సేవకా! ఈమధ్య రాణిగారికాలిపై తేలుకుట్టినదా.

బంట్రో:—చిత్తము మహాప్రభూ:

రాజు:—తేలువిషము తలకెక్కునేమోయని మంత్రి భయపడి గొడ్డలిచే ఆమెతల నరికివేసినాడా?

బంట్రో:—ఔనుబాబూ!

రాజు:—ఆమె గోషాస్త్రీ యగుటచేతను, సుకుమారి యగుటచేతను, కోటలోనే గడ్డిబొద్దుపై కిర్సనాయిల్ పోయించి అందుపై ఆమెను పరుండబెట్టి అగ్గిపుల్ల అంటించినాడా?

బంట్రో:—చిత్తముదేవా!

రాజు:—కోటలోని మేడలన్నియును, గ్రామములోని యిండ్లన్నియును, కాలిపోయి భస్మమైపోయినందున ఆభస్మమంతయు గొట్టుకొనిపోయి భూమియంతయు సదునగుటకు పెద్దచెరువుగట్టు తెగగొట్టించినాడా?

బంట్రో:—చిత్తము.

రాజు:—ఓరీ! ఇవియన్నియు బాగుగానే వ్రాసినాడు కాని ఆతెలివితక్కువమంత్రి చెరువులోని చేప లేమైనవో ఆవయనము వ్రాసినాడుకాడేమిరా! అని మహాకోపమున బలికెను. బంట్రోతు గడగడ వణకుచు "దేవా! ఆసంగతి నాకేమియు దెలియదు. ఏలినవారికుత్తరమిచ్చిరమ్మని పంపగా వచ్చితిని" అని చెప్పెను.

అంత రాజు చేపలవిషయమై సంశయము దీర్చుకొనదలంచి వెంటనే స్వగ్రామమున కేగుటకై మితపరివారముతో బైలుదేరెను. త్రోవలో రాజుమనసునందు చేపలవిషయమగు చింతయేగాని వేరొండు చింత యెంతమాత్రమును లేదు. కాని తనగ్రామముదరికి వచ్చువప్పటికి ఆతని కింకొకవిధమగుచింత కలిగి యిట్లు దుఃఖింపదొడగెను. "అకటా! నా గ్రామమునకెట్టి గతి తటస్థించెను. ఇంద్రసౌధములబోలు నా మేడలేమై పోయినవి. పురజనుల గృహములన్నియు భూమిపాలై పోయినవే. అయ్యో! ఇదిగాక నా ప్రాణసమానయగు

రాణి గతించెనే! బుద్ధిహీనుడగు మంత్రిని చేపట్టి నందువలనగదా. నాకిట్టి చేటువాటిల్లినది. నా తెలివితక్కువ తనమే నాకింపగూల్చినది. వెనుకముందరయక కొండ్రతవ్వి ఎలుకనుబట్టి నెంచితిని. ఇంతకన్న తెలివి తక్కువ వేరొక టుండునా! నాయట్టివాని కిట్టిగతి ప్రాప్తించకుండునే!" అని యీవిధముగ వగచి వెంటనే మంత్రిని అరణ్యప్రాంతమునకు బారద్రోలి కుమారుకొండపైనున్న తనసైన్యముల రప్పించి కొందఱు బుద్ధిమంతులను బిలిపించి వారితో నన్నివిషయము లాలోచించి వారిబోధనల శిరసావహించి దేశదేశములనుండి చిత్రకారుల రావించి మునుపటికన్న గొప్పపట్టణము నిర్మింపజేసి సన్మార్గవర్తియై, సర్వజనానురాగియై, రాజ్యపాలన మొనరించుచు సుఖముగానుండెను.

## బుఱ్ఱబావ—పిల్లిబావ

కల్లూరు అహోబలరావుగారు

అనగా అనగా నొకయూరు. ఆయూరిలో నొకయింటివారొక పిల్లిని పెంచుచుండిరి. ఆపిల్లికి దేనియందును లోటులేదు. ఇంటిలో పాడియెక్కువ. ఎక్కడ పెట్టిన పాలు, పెరుగు, వెన్న, నెయ్యి యక్కడనే గుటుక్కు స్వాహా, చేయుచు 'గప్‌చిప్' గానుండెను. దీనికితో డింటివారు భోజనము చేయు సమయమునందు దాని నాహ్వానించి యొకవిస్తరిలో అతిథికి వడ్డించినట్లు వడ్డించువారు. ఇట్లు తిని, త్రాగి బలిసి యాబిడాల మాయింటియందున్న చిట్టెలుకల సహితము మట్టుబెట్టి తనపొట్టఁ బెట్టుకొనుచుండెను. కొంతకాలమిట్లుకడచెను. ఆ యింటివారాపిల్లిని 'పిల్లిబావా' యని పిలుచుచుండిరి. ఆపిల్లిబావకు చక్కని పిల్లను పెండ్లిజేయవలయునని యా యింటివారందఱుఁ దలంచిరి. పొరుగూరి పిల్లిపిల్ల పెండ్లికన్యక యయ్యెను. ముహూర్తమేర్పాటుకాఁబడెను. మేళతాళములతో పిల్లిబావ పెండ్లి పూర్తియయ్యెను. అందఱు విందులు గుడిచి యానందించిరి. వియ్యాలవారు తమయూరుఁ జేరుకొనిరి. దీపావళిపండుగ సమీపించెను. అల్లుని రమ్మని అత్తమామలు కబురంపిరి. పిల్లిబావ తనపెండ్లమునుఁజూడ ముచ్చటపడెను. ఇంటివారు పిల్లిబావతో "పిల్లిబావా! అత్తవారింటికి బొయ్యెదవా!" అనగానే తోకాడించి "మ్యావు—మ్యావు" అని అఱచి మందహాసము జూపెట్టుచుండెను. ప్రయాణదినము వచ్చెను. పిల్లిబావ చాలాఆత్రముతో నుండెను. ఇంటివారానాఁడు దానికి తలంటి నీళ్లుబోసిరి. పాలన్నము—పెరుగన్నము—నేతిఅన్నము కలిపిపెట్టిరి. ప్రయాణమునకు బుత్తి కట్టిచ్చిరి. త్వరలో రావలెనని సాగనంపిరి. పిల్లిబావ దారి నతియాత్రముతో నడచుచుండెను. అది యరణ్యమార్గము. దుష్టమృగముల బాధయెక్కువగానుండెను. ఊరిపొలిమేరలోనె, ఒకనక్క యెదురుపడి "పిల్లిబావా! ఆకలియగుచున్నది. నిన్ను తినివేసెదను" అనిచెప్పెను. అందుల కాపిల్లిబావ భయపడక నుపాయ మాలోచించి యిట్లుచెప్పెను. "నక్కబావా! అత్తవారింటికిఁ బోవుచున్నాను. దీపావళివిందులు కుడిచి వచ్చెదను. అప్పటికి బలిసియుందును. నీవు నన్నప్పుడుతినుము" అనిచెప్పగా "మంచిది త్వరగారమ్మ" అని నక్కచెప్పెను. ఒకగండము గడచినదని పిల్లిబావ సంతోషించి, చాలా ఆత్రముతో దుముకుచు, దుముకుచు దారిని నడచుచుండెను. అంతలో తోడేలొకటి యడ్డువచ్చి "పిల్లిబావా! ఆకలియగుచున్నది. నిన్ను తినెదను" అనిచెప్పెను. అందుల కాపిల్లిబావ "తోడేలుబావా! పోవునది అత్తవారిల్లు. కుడుచునవి క్రొత్తక్రొత్త విందులు. త్వరలోవచ్చెద. నా మెత్తనిమాంసము నీ చిత్తానుసారము తరువాత తినుము" అని చెప్పగా "మంచిది. త్వరగారమ్మ" అని తోడేలుచెప్పెను. రెండవగండముకూడా గడచెనని యాపిల్లిబావ దూకుచు దుముకుచుఁ బోవుచుండగా, హఠాత్తున నొక పులికానబడి "పిల్లిబావా! తినివేసెద" ననగా "తాళుతాళుము అత్తవారింట క్రొత్తక్రొత్తరకపు మెత్తనిపిండివంటలు మొత్తములుగాఁదిని క్రొవ్వివచ్చెద. ఆతతి నీ చిత్తానుసారము నా మెత్తనిమాంస మారగింపుము" అన, "మంచిది. త్వరగారమ్మ" అని వ్యాఘ్రము చెప్పెను. మూడవగండంబుకూడా కడచెనని మనంబున మిక్కిలి సంతసించి యాపిల్లిబావ యత్తవారిల్లుచేరె. అత్తమామ లాదరించిరి. బావమఱదులు పరిహాసమాడిరి. తలంటి నీరుపోసిరి. పిండివంటల దండిగఁబెట్టిరి. అనుగుభార్య ముసిముసినవ్వులునవ్వి, పిల్లిబావకెదురుగా పీటపైఁగూర్చొని పాటలఁబాడెను. పసుపుకుంకుమల మగనికిఁ

చూపెను. గంధమలందెను. పూమాలవేసెను. పూబంతులాడెను. తాంబూలమొసఁగెను. ముద్దుముచ్చటలతో నలుగుముచ్చటలాడెను. పిల్లిబావ సంబరమందెను. పెండ్లమును చూచిచూచి సంతసించెను. ఇట్లు చూపుల తీపులుదీరెను. ఎట్టకేలకు ప్రయాణదినమువచ్చెను. చిన్నిముద్దు పెండ్లమును విడువజాలక విడిచి బావ యవారి ప్రయాణమయ్యె. ప్రయాణమునకు ముందు మామగారితో "మామయ్యా! త్రోవలో ముప్పురు శత్రువులు నా కొఱకుఁ గాచియున్నారు. నేనొకరిఁదప్పించుకొనిపోయిన నొక్కరు చంపకవిడువరు. దీని కుపాయమేమి" అని యడుగగా, మామయ్య ఆలోచించి యొక్క పెద్దసొఱకాయబుఱ్ఱకు క్రిందిభాగమున తూటుకొట్టి లోపల దొల్లఁజేసి పిల్లిబావనందులోఁ గూర్చుండఁబెట్టెను. సద్దిబువ్వ బుఱ్ఱలోఁబెట్టి దానితూటు బిగించి దొర్లించివిడువగా నదిదొర్లిదొర్లి పోసాగెను. కొంతసేపటికే పులి ప్రత్యక్షమై యాబుఱ్ఱబావను చూచి "బుఱ్ఱబావా! బుఱ్ఱబావా! పిల్లిబావను చూడలేదా" అని యడుగగా, "పిల్లిబావలేదు. గిల్లిబావలేదు. నాకిన నూతామడలు పోవలెను. తాకినఁ దలవగులవలెను" అని యనగా యాపులి భయపడి పఱుగెత్తెను. మఱికొంత సేపటికి తోడేలెదురుపడి "బుఱ్ఱబావా! కుఱ్ఱపిల్లిబావయేడి?" యని యడుగగా "కుఱ్ఱపిల్లి—తొఱ్ఱపిల్లి—నే చూడలేదు. నాకిన నూతామడలు పోవలెను. తాకిన తలవగులవలెను" అని చెప్పగా యాతోడేలు భయపడి పరుగెత్తెను. ఊరిపొలిమేరవచ్చెను. నక్కయొక్కటే పిల్లిబావకొఱకు కాచుకొనియుండెను. బుఱ్ఱదొర్లిదొర్లి వచ్చుచుండెను. అదింతఁ బరీక్షింపఁదలఁచి "బుడబుడబుఱ్ఱా! బుడబుడబుఱ్ఱా! బిడాలకుఱ్ఱఁడేడీ?" అని యడిగెను. "బిడాలకుఱ్ఱఁడు. బీడీలకుఱ్ఱఁడు. నాకుతెలియదు. పో. పో. నాకిన నూతామడలుపోవలెను. తాకిన తలవగులవలెను" అని చెప్పగా "అబ్బే! తలవగులువా? ఇదోచూడు. ఈరాతితో నీ తలబుఱ్ఱఁ జిదుకఁ గొట్టెద"నని పెద్దరాతి నా బుఱ్ఱమీఁద వేసెను. బుఱ్ఱబుదుక్కుమనెను. తుఱ్ఱున పక్షివలె యందున్న పిల్లిబావ యెగిరి, సుఖము గానింటిని జేరుకొనియె. ఇంటివారికి పిల్లిబావ తనకథఁజెప్పగా, వారు పిల్లిబావ యుక్తికి చాలా మెచ్చుకొని దానినప్పటివలెనే యాదరించుచుండిరి. కథకంచికిపోయెను—మనమింటికి వచ్చితిమి.

## మానసికపూజయే విశేషము

శ్రీమతి పాకలరత్నమాలగారు

భారతయుద్ధములో తనపుత్రుఁడభిమన్యుఁడు తెగినవార్త విని యర్జునుండు దుఃఖముతో రాత్రి నిద్రించుచుండఁగా నతఁడు కృష్ణునితో కైలాసమునకుఁబోయినట్లు కలగనెను ఆకాలములో నాతనికి తనకంటెభక్తిపరుఁడు జగములో లేడనియు తనయన్న భీముఁడు మోటువాఁడనియు నతనికి భక్తి యనునేమియో తెలియదనియు ఒకవిధమైన తలంపుగలిగెను. అట్లు కృష్ణునితో కైలాసమునకుఁబోవుచున్న పార్థుఁడు దారిలో నొకసేవకుఁడు బండిపై వాఁడిన పువ్వులవేసికొని దానిని లాగుచుండుటను చూచెను. బండివానితో అయ్యా! ఈ పుష్పములు వాడియున్నవి. ఎందుకని వీని కొనిపోవుచున్నావు? అని యాశ్చర్యముతో నడుగ, నాపనివాఁడు తనపనియందు దృష్టిగల్గి పార్థునితో మాట్లాడకుండెను. అర్జునుఁడాగలేనివాఁడై మఱిమఱి బండివానినడుగ నతఁడించుక కోపముదెచ్చుకొని యిట్లనియె "ఓరీ వినుము. నేనసాధ్యమైనపని చేయవలసియున్నది. పల యూరక ప్రశ్నించి నాపని శీఘ్రముగా పూర్తిగాకుండునట్లుచేసెదవు? నేఁడే నూఱుబండ్లు పువ్వులే యందుఁ జేర్చితిని. ఇంకను శివాలయములో నూఱుబండ్లు పుష్పములు శివుని పాదములయందుఁ బడియున్నవి. పాండవవీరుఁడైన భీమసేనుఁడు నిన్నటిదినము పూజకుఁ దెచ్చినపుష్పములివి.

అతఁడీదినము పూజసేయుటకు యికకొంతసేపేయున్నది. అంతలో వానినిందులకు తెచ్చి పడవేయవలయును. నాకుపనిగలదు. నన్నడ్డగింపకుము" అనియాతండు బండినితోలుకొని పోవ అర్జును డాశ్చర్యపడి బండివానిఁజూచి "అర్జునుఁడా లేక భీమసేనుఁడా నిన్న పూజించినది?" అనియడుగ, "భీముఁడే యట్లుపూజయొనరించినది. అర్జునునిపూజయంతయు వట్టియాడంబరమే" యనివాడు ప్రత్యుత్తరమిచ్చెను. అప్పుడొకచిన్నగింపలో ఒకఁడు వాఁడినపువ్వులను దెచ్చుటను జూచెను. తోడనే కృష్ణపరమాత్ముఁడాతనిఁజూచి "ఇవెవ్వఁడు పూజచేసిన పువ్వులని యడుగ వాఁడు "ఇది ఆడంబరపరుడైన అర్జునుఁడు పూజించినవి" అనిచెప్పెను. అర్జునున కపుడే తానుజేయుపటాటోపపూజలకన్న భోజనముపకుముందు భీముఁడు భక్తితో కొంతకాలమొనరించు మానసికపూజయే మేలైనదని తెలియవచ్చెను. వానిగర్వమును దురభిప్రాయమును నాటితోఁదీఱెను. ఏధర్మమునకైనను మనము నిక్కువముగా అర్పించవలసినది అంతఃకరణము. ఏకార్యమునైన మనసారచేయకున్న ఫలింపదు. ఆడంబరమునకుగాను భూషణములన్నియు గాంధిమహాత్మున కర్పించిననూ ఫలమేమి? పరిశుద్ధాంతఃకరణములో ఒక్కనూలుపోగర్పించినచో ఇంటికొక పుష్పమిడిన ఈశ్వరునకొకమాల యనునట్లగును.

## నివ్వెఱ

కుందుర్తి నరసింహారావుగారు

పులుఁగులముద్దుపాటలెటు పోయినవో! నవసంధ్యవచ్చిన
న్నలమినదే,యిదేమి పరిహాసముగా మధురస్రవంతిలో
నెల నటియించునీటిదఱి నీవుచరించిననాఁటి లేఁతఅం
దెలమురళీధ్వనిం దలఁచితిన్ ప్రకృతింగని విస్మరించితిన్!
ఇదియేమే, హృదయేశ్వరీ! స్మృతిపథంబే దుర్భరావేదనా
స్పదమై గుండెలు చీల్చుచున్న దిటు లబ్బా! ఆదుకోవే!మిన్నే
మదినూహింపఁదలంపకే బ్రదుకలేనా: యింకదిక్కేమి చె
ప్పెదవే, మాయలుపన్ని నన్విగతజీవింజేసి పోరాదటే?
చెఱయొకపాలునామోఁడద జీల్చితి చూడఁగదే, చెలీ! చెలీ!
మఱచితిగాయిదెల్ల? కొఱమాలిన యీ మునిమాపుసందెలో
పరుగిడివచ్చుమబ్బుల నవాలున నిల్చిననామనస్స్థితిన్
మెఱసిలివేటికో, ఉపశమించిన నాపయి నొట్టుసు మ్మికన్!
విద్యుత్కాంతులవట్టులే నిలుపుకోవే: పాపభూయిష్ఠమీ
సద్యోమోహితలోచనద్వయి లసచ్ఛంపాలతాంతస్ఫుటా
గ్రోద్యద్భుగ్నకణాగ్నికుండమున గ్రుమ్మగ్నన్ గాక! యీ అంధునిన్
విద్యాశాలిని నీవు నవ్వులొలుకన్ వీక్షింతుగాకిప్పుడే.

3. బాలవాఙ్మయపరామర్శ :—

## ఆంధ్రవాచకములు

ఆంధ్రసారస్వతమునందలి బాలవాఙ్మయమును ఈనడుమ కొంతపరిశోధనము గావించు చుంటిమి. తొలుతవాచకపుస్తకములను పదిపండ్రెండు రకములను చూచితిమి. మా చూచినవానియన్నిటిలో ఏలూరు వేంకటరామ్ అండుకోవారు ప్రచురించిన ఆంధ్రవాచకములు మేలితరముగనున్నవని చెప్పగలము.

ఇవి ఎనిమిదివాచకములు. రచయితలు అ. జయరామరావు పంతులుగారు బి.ఏ., యల్.టి., దర్భా జగన్నాథశాస్త్రిలుగారు, కె. హెచ్. వి. యస్. నారాయణ బి.ఏ., యల్.టి.గారును. ఉన్నతపాఠశాలకు ఉపాధ్యాయులుగానుండి వీనుమిగిలిన ఆంధ్రవిద్యార్థులలో జయరామరావుపంతులుగా రొకరు. దర్భా జగన్నాథశాస్త్రిలుగారు పేరుగల ఆంధ్రపండితులు. కె. హెచ్. వి. యస్. నారాయణగారు సాహితీసమితిసభ్యులు, భారతి మొదలగు ఆంధ్రపత్రికలను వ్యాసభూషలచే నలంకరించుచున్న వ్యాసకర్తలు, విద్యార్థుల మన స్తత్త్వములను పసిపట్టునేర్పుగల డెప్యూటీఇన్స్పెక్టరులు. ఇట్టి మువ్వురుకలసి రచియించినవగుట ఈవాచకములు విషయములందేమి, భాషయందేమి ఎన్నదగినవై నవి.

వాచకములన్నిటియందును మొదటివాచకమును రచియించుట బహుకష్టము. నూతనముగా బడికి రాప్రారంభించిన విద్యార్థిమనమున చదువునందు కుతూహలము పుట్టింపవలయును. మనస్సునకు పరిశ్రమకల్గింపరాదు. భావముయొక్క కేంద్రీకరణమే వాక్యముగానుండవలయునను సుప్రసిద్ధన్యాయ మీ బాలశిక్షయందు బాగుగాపాటింపబడినదని చెప్పగలము. ప్రథమపాఠమున 'ఈగ' 'తల' అనునవి బోధించి వానినుండి 'ఈగతల', 'ఈతల ఈగతల' అని యిట్లు ఆపదములతోడనే వాక్యములనుకల్పించి ఇందీయబడినవి. బోధనాపద్ధతులలో ఇదియొక ప్రశస్తమార్గము.

ఈవాచకములయందు ఆటవిడుపుపద్యములు, సమస్యలు, పొడుపుపద్యములు, ప్రార్థన పద్యములు చేర్చబడియుండుట ప్రశంసనీయమునున్నది. మన వాచకపుస్తకములయం దీ పద్ధతి నూతనము. ఆటవిడుపుపద్యములనుమాత్రము ఈవాచకములందేగాక ఇదివఱకు మఱియొక వాచకములందును వేయబడియున్నవి. ప్రార్థనపద్యములు, పొడుపుపద్యములు, సమస్యలుచేర్చుట కీవాచకములే ప్రారంభము. అందు ప్రయిమరీతరగతుల కుద్దిష్టమైన రెండు, మూడు, నాలుగు తరగతులయందే ఇది విరళమైయుండుట గమనింపదగినది. సమస్యలచే పదవిజ్ఞానమును, పొడుపుపద్యములచే లోకజ్ఞానమును విద్యార్థులకు గలుగును. ఇవి వారి మనస్సులకు వేదనలేని పరిశ్రమను కలిగించును. జిజ్ఞాసను రేపును.

కల్లబొల్లి స్వతంత్రరచనముగల పద్యములుగాక ఈవాచకములయందు ప్రాచీనములగు శతకములనుండియు, ప్రబంధములనుండియు పద్యములేర్చికూర్చుట పొగడదగినది.

పెద్దలనోటవినిన పద్యములతో నిట్లు పుస్తకమున బాలకుకు పరిచయమునొందుటచే నవి వానిమనమున బాగుగ హత్తును. అదియునుగాక పసితనముననే విద్యార్థికి మనప్రాక్తన సాహిత్యముతో పరిచయమేర్పడును. ఇట్లనుటచే ఈవాచకములందు నవీనభావములను ప్రసరించుపాఠములులేవని తలంపరాదు. 'బాలభటులు;' 'పరపతిసంఘములు' మొదలగు పాఠములు విద్యార్థులకు నవ్యభావోదయమును కలిగింపసమర్థములై యున్నవి. సత్యము, సహనము, స్వాతంత్ర్యము మొదలగు సద్గుణములను ఈవాచకములయందు కథానిదర్శనములతో నిరూపించుటచే విద్యార్థులు నైతికజీవనమలవడజేసికొనుటకు ప్రోద్బలముగలదు. జాతీయ జీవితమునకు దర్పణములగు విజయదశమి, కృష్ణాష్టమి, కార్తికపూర్ణిమ మున్నగు పర్వములనుగూర్చి ఈవాచకములందు పాఠములుగలవు. ఇవి ప్రత్యేకముగ విద్యార్థుల చిత్తము నాకర్షింపగలవి యని మాఅభిప్రాయము.

ఈవాచకములయందు ఒక్కొక్కదానియందును ఒకటిరెండు తెనాలి రామలింగ నిహాస్యకథలు పాఠములుగా చొప్పింపబడియున్నవి. హాసము ఆనందదాయకము. ఆనందము ఆరోగ్యవర్థకము. అగుట ఈరీతిపాఠములు వాచకములందు చేర్చుట ప్రత్యేకప్రశంసనీయము. నిరంతరపఠనముచే విద్యార్థుల మనములు మొగ్గువారకుండ ఇట్టిపాఠములు ఉజ్జీవింపజేయగలవు.

వీటియున్నిటికంటె ఉత్తమవ్యక్తుల జీవితచరిత్రలు చేర్చుట ఈవాచకముల శ్రేష్ఠత్వమునకు శిఖరప్రతిష్ఠ. ఖడ్గతిక్కన, బాలచంద్రుడు మొదలగు ఆంధ్రవీరులచరిత్రలు, పెద్దన, వేమన, తిమ్మన మున్నగు ప్రాచీనాంధ్రకవుల చరిత్రలు, వీరేశలింగముపంతులు, వేదము వేంకటరాయశాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహము మొదలగు ఆధునికాంధ్రసారస్వతసేవకుల జీవితచరిత్రలు, త్యాగరాజు అను ఆంధ్రగాయకశిరోమణిచరిత్ర చేర్చుటచే ఈ వాచకములు ఆంధ్రవాచకములై ఆంధ్రమహాశయుల ప్రత్యేకాభిమానమునకు పాత్రములై ఆంధ్రవిద్యార్థులకు అవశ్యపఠనీయములగుచున్నవి. ఆంధ్రమహాపురుషుల జీవితములేగాక గోవిందరనడే, శివాజీ, రవీంద్రుడు, వివేకానందస్వామి, విద్యాసాగరుడు, దాదాభాయి నౌరోజీ, మాలవ్యా, గోపాలకృష్ణగోఖలే మున్నగు భారతమహాపురుషుల పవిత్రజీవితములు ఈవాచకములందు జేర్చియుండుటచే వీనిని పఠించు విద్యార్థులు ఆంధ్రకీర్తితోడనే గాక భారతకీర్తితోడను ప్రవేశముగందురు. ఒక్క పురుషులజీవితములనేగాక చాందుబీబి, రాణిభవాని మున్నగు భారతమాతృశ్రీలను ఈవాచకములయందు స్మరించిరి. మతసహనమును కలిగించి విశ్వసౌభ్రాతృత్వమును పెంపొందించి విద్యార్థులకు తేజముగలిగించుటకీ వాచకములందు వివిధమతప్రవర్తకుల జీవితగాథలు చేర్పబడినవి. ఇట్లు వివిధవిషయములకు చెందిన విషయములతో ఈవాచకములు ఒప్పుచున్నవి. విజ్ఞానము, నీతి, ఉత్తమశీలము గలుగుటయేగాక ఈవాచకముల పఠనమున విద్యార్థులభాషయు పరిణతిచెందును. ఇందలి

శైలి తరగతివారీగా క్రమవికాసమునొందుచున్నది. అతినిర్దుష్టమగు భాషయని నిస్సందేహముగా చెప్పవగును. ఇన్నిరీతుల ప్రశస్తములై యున్న ఈవాచకములను ఆంధ్రవిద్యార్థికులు పాఠశాలలయందు ఉపయోగించి వీనిపఠనమువలని పూర్తిలాభమును ఆంధ్రవిద్యార్థులకు కలిగింతురుగాకయని గోరుచున్నాము.

## జానకీనిర్వేదము

శ్రీమతి సామవేదము సీతారావమ్మగారు

౧

పిడుగటు లీ యుదంతము చెవింబడినంతనె నాదుప్రాణముల్
విడివడిపోవదేలనో? ద్రవించెడునీమనమెల్ల నాకునై
సుడివడిస్రుక్కి, ఇంతదయఁ జూపఁగలేక రఘూత్తముండు నా
నడవడి దోషయుక్తమనెనా? అనలుండెరుగండొ? లక్ష్మణా!

౨

ఏ యనురూపదంపతుల నేభవమం దెడబాపి యుంటినో
ఈయడవిం దపించి కృశియింపగ నిట్లు దయాసముద్రుఁ డ
న్యాయపువాదునమ్మి కడునాకొనఁగూరిచెనెగ్గునైన, దా
నే యిటులెంచ, లోకమది నేర్పునె యొండొకరీతిపల్కఁగన్?

౩

తలలోనాలుకవోలెనుండి తనసంతాపాగ్ని, మత్ప్రేమవా
గ్జలసందోహముచేత నార్పుచు, సజస్రమ్మెక్కుడౌ భక్తితో
సలుపన్ లేవోకో! సేవలన్ వనములో, సంతోషివై ప్రేమవా
క్కులందాఁబల్కఁగలేదో? కూరిమిని నాకుం గూర్చెడో లక్ష్మణా!

౪

అనయము శ్వాపదమ్ములకు నాస్పదమై, కనినంతనే భయం
బును కలిగించు కాననము పూర్వము తా గడుసంతసంబునే
యొనరిచె నాథుపజ్జ సతిఁ దూర్జితప్రేమరసైకవాహినిం
దనుపుటఁజేసి, నేడుకలదా సుఖలేశ మిఁకేల ప్రాణముల్?

౫

ఈ కొరగానిగర్భ మిపు డేటికిదాపురమాయె? నాయెఁబో
నాకిటు జాహ్నవీదరిశన(?)మ్మొనరింపఁగఁ గోర్కెకల్గ నే
లా? కలిగెన్ దయానిధి విలంబమొనర్పక లోకవాదుకై
యీకరణిన్ ద్యజించి నను నిట్టులసేయగనేల? లక్ష్మణా!




## దేవికృతి

శ్రీమతి బొడుపల్లి బాలాత్రిపురసుందరమ్మగారు

బేగడరాగము.—ధర్మసంవర్ధనీ మాయమ్మా వలె.

పల్లవి:—మాతామాం పాహి మరుజనక సోదరి మాతామాం పాహి॥మా॥

అనుపల్లవి:—మాత మహీ నీమహిమ దెలియ నాతరమె సీతాంశుముఖి జలజాతనయన
విధాతవశమా పాతకము లెడబాపుదయతో॥మా॥

యోగ యోగిని యోగరూపిణీ యోగధారణి యోగిజనమానసవిలాసిని
నీలతోయదమధ్యరూపిణి నిర్వికారిణి నిత్యనిర్మలనిర్మలి వాణీ సెరసమ్మతిని ॥మా॥
భువనమోహిని భవవినాశిని బుధజనావని పురహరుని అర్ధాంగి పరదేవి
నిరతమును నిను సమ్మతినిగోరి కాత్యాయిని కలుషములు కడద్రోయక
జననీ నిగమాంతవేదిని॥మా॥
ధరను ఛత్రాపురనివాసిని త్రిపురేశ్వరినీ। కరుణగోరి గౌతమసవారి పుర
మనేమందిరమునను వెలసి సిరులొనగూర్చు పరమపావని పలుకవేలానే
పంతమేలానే॥మా॥

### దేవిమంగళహారతి : రామాలాలి వలె

పల్లవి: అంబ మంగళం జగదాంబ మంగళం కంబుకంఠి త్రిపురసుందరీ కాళిమంగళం॥

చరణం: మాయిమంగళం భోగదాయిమంగళం మాయమాయలకు నెల్లామూలమంగళం
కాళిమంగళం ఓంకాళిమంగళం కాళిభద్రకాళి శ్రీబాలమంగళం॥అం॥

## దేవి కృతి

### బిలహరి రాగము

### మహిషాసురమర్దని వలె

పల్లవి: బాలత్రిపురసుందరి నమోస్తుతే ॥బా॥

అనుపల్లవి: ఫాలశూలిని భక్తపాలిని కాళిని శూలిని మాలిని లీల నుగుణయశోవిశాలిని ॥బా॥

చరణం: హరిణాక్షి హరిమధ్య హరివాణి హరివేణి హరిరాణి హరివాహి

హరిపదధ్యాన్నే సరసిజోద్భవసన్నుతే ధరలసురలాపూజితే వరహిమాలయ
గర్భములలో సురచిరంబై యున్న దేవి ॥బా॥
ధర వెలయు గుముదూరిపురవాసు పరమేశు చరణకమలసేవ మరువక
ధ్యానించే గిరిజప్రతిక పార్వతే సరసిజములచే పూజితే పరమపావని
యనుచు దలిచిన ధరలో లక్ష్మణకవిని బ్రోచిన ॥బా॥

కమలాంబ నాచింతదీర్చవమ్మా వలె.

పల్లవి: మంగళంబిడే మాత అన్నపూర్ణ
అనుపల్లవి: రంగనిసోదరీ మంగళాంబ వేగ ॥మం॥
చరణం: విశ్వజనని నీకు వశ్యమేది కాదు సత్యమూలరాశి విశ్వనాథురాణి ॥మం॥
పాటినాక్షి నన్ను కరుణించిబ్రోవు వారణాశిపురగౌరి భారతాంబ ॥మం॥
మానసమునసీదు ధ్యానమెప్పుడుమరువ దానవాంతకీ యీదీనురాలిచేతి ॥మం॥
సాక్షిరూపిణి మోక్షదాయిని మహాలక్ష్మి నామొరవిను విశాలాక్షి తల్లి ॥మం॥

# శ్రీరంగనాథుని ముక్కోటి వైభవము

శ్రీమతి వావిలికొలను సుబ్బమ్మగారు

కమాసు రాగము—చాపుతాళం
("మాశాడబార దేనో" అను జావళిప్రకారము పాడవలెను.)

పల్లవి: రంగనికనుగొంటిని శ్రీవయ్యారి రంగధాముని గంటిని ॥రంగ॥
అనుపల్లవి: శ్రీమంగళకరమా రంగపురమునందు। రంగనాయకితోడ రాజిల్లుకావేరి॥రంగ॥
చరణం: పరమమంత్రసారము శ్రీవైకుంఠపురమున కిది సమము
పరమార్థమిదియని భక్తులకెరిగింప పరవాసుదేవుడై భాసిల్లుపరిమళ॥రంగ॥
చిలుకమంటపమునను శ్రీమాళ్వార్లు తనకీర్తిపాడగను
కలికితురాయి మెరయు ఘనకిరీటముదాల్చి
తళుకుచెవ[illegible] ముద్దులొలుకు శ్రీవయ్యారి ॥రంగ॥
రత్నకవచము మెరయగా రాజాధిరాజుల్ రమణీయముగ గొల్వగా
ఉత్తరద్వారమున వెడలి సహస్రపాద
రత్నమంటపమున రాజిల్లుకస్తూరి ॥రంగ॥
ముక్కోటిదేవతలు ముదమున గొల్వ ముక్కంటిసేవింపగా
అక్కరతోసకల దేశవాసులుగొల్వ
ముక్కోటిహరివాసరమున శ్రీమోహన ॥రంగ॥
యెన్నెన్నోవిధములను భాగవతులు సన్నుతుల్ సేయగను
తిన్నగవీణగానము నాలకించుచు పన్నగశయనుడై సన్నేలువయ్యారి॥రంగ॥




ప్రపంచములోనికెల్ల చిన్న పోస్టాఫీసు :—

ఇది మాజిలన్ జలసంధిలోనున్నది. ఇది రంగువేయబడిన యొకచిన్న పీపా. ఇది గొలుసులతో రాళ్లకు గట్టబడి నీటిపై దేలుచుండును. ఇటునటు బోవుచున్న యోడలు, ఒక చిన్న బోటుద్వారా యందున్న జాబులను దీసికొని, యందులో వేయవలసినజాబులను వేసి పోవుచుండును. ఈ పీపా ప్రపంచ నౌకాదళసంఘములన్నిటిచేతను రక్షింప బడుచున్నది.

మిక్కిలి దీర్ఘమైన టెలిగ్రాము :—

యునైటెడ్ స్టేట్సు సెనేటరుగానున్న పిప్పర్డుగారికి టెక్సాసునుండి యొక టెలిగ్రాము వచ్చియుండెను. అందులో 22205 మాటలుండెను. వీనిలో 7770 సంతకములున్నవి. ఇది వ్రాయుటకు సాధారణమైన టెలిగ్రాఫుఫారములు 142 పట్టెను.

మశకసంహారమునకు బూనిన పరిశోధకురాలు :—

'మైల్ జర్మన్ గోల్డ్' అను ఒక ఫ్రెంచియువతి లక్షలకొలది దోమల నొకేసారి చంపుటకు యంత్రమొకటి క్రొత్తగా కనిపెట్టినది. మార్సెల్సా సమీపమున రోనునదీముఖద్వారమునందు కామర్గాద్వీపమునందలి మురికిగుంటలయొద్ద పరీక్ష సలిపినది. ఈ బోనుకు పైభాగమున మంటకలిగిన ఒక విద్యుద్బల్బు గొట్టముండును. క్రిందిభాగమున దోమలను లాగుకొనుటకు తగిన పనితనమున్నది. వెల్తురుకొఱకు దోమలు రాగానే అవి గొట్టములోనికి ఆకర్షింపఁబడును. నవీనపరిశోధనలవలన 4 ఘంటలకాలములో ఆ యంత్రము 5 పౌనుల బరువుగల 34 లక్షల దోమలను పట్టుకొనినది.

పది నెలల నిద్ర :—

చికాగోలో నొకబాలిక పదినెలలనుండియు నిద్రబోవుచున్నది. ఈ నిద్ర యొకవిధమగు వ్యాధియని వైద్యులనుచున్నారు. ఈ జబ్బులో నామెకు ద్రవపదార్థ మాహారముగా నీయబడుచున్నది. ఇటీవల నామెకు మరల చైతన్యమువచ్చుసూచనలు కనబడుచున్నవి; అప్పుడప్పుడు కాలును, చేయియును కదలించుచున్నది. ఆమెను చూచుచున్న వైద్యులింకను ఆమె కెప్పుడు పూర్తిగ తెలివివచ్చునో చెప్పజాలమనుచున్నారు.

**మెమొరీఫోను:—**

జ్ఞాపకశక్తిచాలని తమ చందాదారుల కుపకరించుటకై బెర్లిన్ నగరమున టెలిఫోను అధికారులు ఒకపని చేయుచున్నారు. చందాదారుడు తనయొక్కగాని తనవారియొక్కగాని శుభాశుభము లేతేదీలయందు వచ్చునో ఆయా తేదీల నొక్కసారిమాత్రము వ్రాసియిచ్చిన చాలు. ఆ తరువాతనుండి ఆయా తిథులు వచ్చినపుడా చందాదారుని పిలచి ఆ యధికార్లు జ్ఞాపకము చేయుచుందురు. దీనికి చందా స్వల్పమే.

**పదియడుగుల యెత్తుగల నేలకలువ:—**

దీని విస్తీర్ణము విన్నచో నెవ్వరైన నబ్బురపడక మానరు. దీని పేరు "ఎమోర్ఫోఫల్లస్ టిటానం" (Amorthothallas Titanumlily) సృష్టిలోనున్న నేలకలువజాతిలో నిది పెద్దది. ఇది జూలై నెల తే 22 దిని మొగ్గతొడిగినది. ఈ విచ్చుమొగ్గ రమారమి యెనిమిదడుగుల యెత్తును ఐదడుగుల నిడివియు గలిగియుండెను. దీని దళము లోన రక్తవర్ణమును, బయట పసుపువర్ణమును గలది అని ప్రొఫెసర్ యన్స్లేటు గారు హాలెండుదేశమునుండి వ్రాయుచున్నారు.

**కుట్టను, వ్రాయను నేర్చిన మొండిచేతి పిల్ల:—**

బెర్మాండ్సీ గ్రామమునకు చెందిన మిస్ క్యారీరివ్యాట్ అను (పదునేడేడుల) బాలికకు పుట్టినప్పుడే రెండుచేతులకును వ్రేళ్లులేవు. ఈమె వ్రేళ్లులేనియా మొండిచేతులతోనే అల్లగలదు, కుట్టగలదు, వ్రాయగలదు, చిత్రింపగలదు, పియానా వాయించగలదు. ఈమె లండన్ కన్ట్రి కౌన్సిలు ఆర్టు స్కాలర్షిప్పును పొందెను. క్యాంబర్వెల్ చిత్రకళాశాలలో ఈమె చదువుచున్నది.

**నాలుగు రెక్కల పక్షి!—**

న్యూజర్సీ యను గ్రామమునందు నొకరైతుయొద్ద నొకపక్షి యున్నది. ఇది యొక కోడివలె నుండును. ఇది నాలుగు రెక్కలను విప్పుకొని యెగురునపుడు బైప్లేనువలెనుండును.

**పేకముక్కలను పంచు యంత్రము:—**

అమెరికాలో ప్రొఫెసర్ యల్. యఫ్. వుడ్రఫ్, ప్రొఫెసర్ ఇ. యల్. రోజ్ అనువా రిద్దరు పేకముక్కలను పంచుటకు యంత్రము నొకటి నిర్మించిరి. ఒక బల్లపైన ఈ యంత్రమునుంచి ఒక బొత్తాము నొత్తినచో ఆటగాండ్రకు నాల్గు నిమిషములలో ముక్కలు పంచివేయును.

**ఎల్యూమినియమునకు స్వస్తి:—**

బెరిలియం అను నొకనూతనలోహము కనిపెట్టబడినది. ఇది ఎల్యూమినియంకంటె తేలిక యినుముకంటె గట్టి. దీని యుపయోగమునుగూర్చి తీవ్రపరిశోధనలు చేయబడుచున్నవి. ఇది గాజువలె విరుగును. అయినను దీనిని ఎల్యూమినియంవలెనే అన్నిపనులకు నుపయోగించుటకై ప్రయత్నములు చేయబడుచున్నవి. ఈ పరిశోధనలు జయప్రదమగుచో అల్యూమినముకంటె ఈలోహము హెచ్చు ప్రచారమునకు రాగలదు.

**మనుష్యునకైదేసి ఎలుకలు:—**

ఒక జర్మనీదేశపు జంతుశాస్త్రప్రవీణుని రికార్డుప్రకారము ప్రపంచములో ఎలుకలు మనుష్యులకన్న నైదురెట్లు ఎక్కువగానున్నవని తెలియుచున్నది. భూమండలమున నించు మించు 10000000000 ఎలుకలును, 1849500000 మనుష్యులు నున్నారనియు, ప్రపంచములో 1100 జాతులకు చెందిన జంతువులును పురుగులును కలవనియు, ఒక్కొక్కజాతిలో 400000 రకములు కలవనియు, అందులో 280000లుగా పురుగులు వృద్ధిచెందుననియు, వీనిలో సాలెపురుగులజాతిలో 120000, సీతాకోకచిలుకలజాతిలో 50000, ఈగజాతిలో 40000, చేపలజాతులలో 12000, పక్షిజాతిలో 10000, పలువిధములుగా నున్నవనియు ఆజంతుశాస్త్రప్రవీణుడు తెలుపుచున్నాడు.



హాలెండు దేశపు స్త్రీలు :—

"ఐరోపాఖండమునందు హాలెండుదేశ మొక చిన్నస్వతంత్రరాజ్యము. అయినను ఆ దేశపు స్త్రీలు ఎట్టి ఉన్నతస్థితికి వచ్చియున్నారో, అట్టిఔన్నత్యము మరియేదేశమువారును చెందియుండలేదు. అచటస్త్రీలు సుశిక్షితలు, పరిశ్రమశీలలు, దేహక్షేమమునకన్న దేశక్షేమమునకై ఎక్కువగా పాటుపడువారునై యున్నారు. వారు ఆటపాటలు, నృత్యములన్న ఏవగింతురు. వారి దినచర్యయంతయు గృహకృత్యములు, విద్యాభ్యాసము, దేశసేవ మొదలగు ఉత్కృష్ట కార్యములతో నిండియుండును. అచట బాలికలయెడ బాల్యావస్థనుండియే శిక్షణావిధానమున ఎంతయు శ్రద్ధవహింపఁబడుచున్నది. కళాశాలలయందు ఉన్నతవిద్య చెప్పింప సామర్థ్యముగల తల్లిదండ్రులు తమబాలికలను లీడను విశ్వవిద్యాలయమునకు పంపుచుందురు. అది హాలెండు దేశపు విశ్వవిద్యాలయములలో ఆదర్శప్రాయమైనది. ఉన్నతవిద్యాప్రాప్తినందగోరు విద్యార్థినులు సాధారణముగా అక్కడికే వెళ్లుచుందురు. హాలెండుదేశమునందు స్త్రీలు వైద్యము, ఉపాధ్యాయినీత్వము, ఇంజనీరి మొదలగు గొప్పగొప్పవృత్తుల నవలంబించి పురుషులకన్న ఎక్కువ అధికారపదవుల నాక్రమించియున్నారు. అచట వృత్తులన్నిటిలోను వైద్యవృత్తి మిక్కిలి ఆదాయకరమైనది. హేగ్, ఐంస్టర్డమ్ మున్నగు ప్రసిద్ధనగరములలో స్త్రీలే వైద్యరాండ్రుగానుండు వైద్యశాలలు ఎన్నియోగలవు. వారు రోగులయెడ ఎంతయో శ్రద్ధవహించి చికిత్స చేయుదురు. అక్కడ యువతులు మొదట కంపౌండరి నేర్చుకొని ఏదో వైద్యాలయములో పనిచేయుచుండి కొంతకాలమైన పిమ్మట స్వీయవైద్యశాల లేర్పాటుచేసుకొందురు. అక్కడ పురుషులకన్న స్త్రీలే విశేషముగా వైద్యవృత్తి అవలంబించి యున్నారు. లీడనువిశ్వవిద్యాలయములోని శిక్షణాపద్ధతి అత్యుత్తమమైనది. అక్కడ స్త్రీలకు వారములో 18 గంటలు లేటిన్‌భాష, 16 గంటలు గ్రీకుభాష, 6 గంటలు ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు, 4 గంటలు జర్మనుభాష నేర్పబడుచున్నవి. హాలెండుదేశపుస్త్రీలు ఈవిధముగ గొప్ప విద్యావతులయ్యును గృహకృత్యములుమాత్రము స్వయముగా చేసుకొనుచుందురు. కళాశాలలయందును, విశ్వవిద్యాలయములయందును ఈవిషయమున యువతులకు ఎక్కుడు శిక్షణమీయబడుచున్నది. పాఠ్యక్రమములో గృహవిజ్ఞానశాస్త్రమునకు ప్రాముఖ్యత ఒసగబడియున్నది. ఇంటిపనులు చేయుటయన్న వారికి ఉత్సాహము మెండు. ఆ దేశపుమహారాణికూడ తనకుమార్తెలకు విశ్వవిద్యాలయములందు ఇతరవిషయములతోపాటు గృహవిజ్ఞానమును నేర్పించుచున్నది. రాజసౌధములలో తఱచుగా వారిచేతనే వంట చేయించుచున్నది. రాజకన్యలకు వంట, కుట్టుపని, గృహనిర్వహణము మొదలగు పనులు నేర్పుటకై వారములోకొన్ని ప్రత్యేకదినములు నియమింపబడియున్నవి. ఆకార్యక్రమము ననుసరించి వారు పనిచేయు

చుండవలెను. హాలెండుదేశమున పురుషులు స్త్రీలను మిక్కిలి గౌరవింతురు. ఆదేశస్త్రీలకున్న గౌరవము మరి ఏదేశస్త్రీలకుగాని లేదని చెప్పుట అతిశయోక్తి కాజాలదు. సంపన్నగృహములందలి స్త్రీలకును, సాధారణకుటుంబములయందలి స్త్రీలకును భేదభావములేక సమానగౌరవాదరము లొసంగ బడుచున్నవి."

—(ప్రతాప్ హిందీ పత్రిక.)

అవ్వయారు:—

"చోళదేశమున భగవాన్ అను ఒక బ్రాహ్మణుండుండెను. ఆ భగవాన్ ఆది యను పంచమ స్త్రీని వివాహమాడెను. ఆస్త్రీ దైవభక్తురాలై సుగుణములచే భర్త్రాజ్ఞానువర్తినియై యుండెను. కొంతకాలమునకు వారికి సంతానప్రాప్తి అయెను. కొందరు పుత్రులును, పిమ్మట ఒకపుత్రికయు కలిగెను. ఈపుత్రికయే అవ్వయారు. ఈమె మిక్కిలి చిన్నవయస్సునందే విజ్ఞానవతియై సకలవిద్యలయందును ప్రవీణురాలని ప్రసిద్ధిజెందెను. ఎక్కువకాలము జీవించియుండుటచే అవ్వయారు అనే నామధేయము ప్రసిద్ధమాయెను. ఈమెయొక్క నిష్కళంకమైన చరిత్రములను, పవిత్రోపదేశములను శ్రద్ధతో గ్రహించిన స్త్రీపురుషాదులు అనేకులుగలరని అవ్వయారుగారి జీవితచరిత్రమువలన తెలియుచున్నది. తనవలె స్త్రీ పురుషులు విద్యావృద్ధులు కావలయునని ఆమెయొక్క ఆశయము. అందులకుగాను ఆమెయే స్వయముగా ప్రతిగృహమునకు పోవుచు పాటలును, పద్యములు పాడుచు పవిత్రోపదేశములతో మానవసేవ చేయుచుండెను. ఆ యూరియందు బట్టకూతురు అనేయొక పండితుడుండెను. ఆపండితుడు తనకు మించినవారు లేరని అవ్వయారుయొక్క విద్యాభివృద్ధిని చూచి యోర్వలేక పరాభవముచేయవలె ననెడియోచనతో ఉండెను. ఇట్లు బట్టకూతురిఅభిప్రాయమును అవ్వయారుకూడా గ్రహించియున్నందున వారిరువురికి మనస్పర్థలు యేర్పడెను. ఇట్లుండ ఒకనాడు చోళరాజును, పుగళేంది పులవరను, బట్టకూతురును, వీరు మువ్వురు విహారార్థమై బయలువెడలి అవ్వయారు ఉండేవీథిని వచ్చుచుండిరి. ఆమె గృహమువెలుపల తిన్నెపై కూర్చుండియుండెను. ఆమె ఆసమయమున రెండుకాళ్లు చాచుకొనియుండెను. ఆమహాత్మురాలు వీరిరాకను చూచినదై రాజునుచూచి ఒకకాలు, పుగళేంది పులవురలను చూచి రెండవ కాలు ముడుచుకొనెను. బట్టకూతురును చూచిన క్షణముననే రెండుకాళ్లను బాగా చాచుకొనెను. ఈమూడు ప్రదర్శనములను చూచి రాజు ఆశ్చర్యముతో ఇందులకుకారణము వివరముగా తెలియజేయుమని అవ్వయారును అడిగెను. అందులకు అవ్వయారు రాజులను తమయొక్క ప్రజలు గౌరవించెదరనియు, విద్యావినయసంపన్నులగు పండితులకు ప్రపంచమందంతటను గౌరవము ఉండుననియు, గర్వభంగమునకుగాను మూడవప్రదర్శనమనియు బదులుచెప్పెను."

—జి. రాజమ్మ (స్త్రీధర్మ.)

మహాసంగ్రామ వ్యయము:—

"లేబరుపక్షమున కొకపుడు మంత్రిణియైయుండిన మిస్ మార్గరట్ బాన్‌ఫీల్డు అను నామె ఆయుధ విసర్జనము: నిరుద్యోగము" అను విషయమును గూర్చి, లీగ్ ఆఫ్ నేషన్స్‌యూనియను సంఘమున నుపన్యసించుచు, యునైటెడ్ స్టేట్సు కాంగ్రెసులో సాంఘికసభ్యులుగానుండిన కీ. శే. విక్టరుబెరరుగారు చేసియుండిన యొక లెక్కను ఉదాహరించెను. "మహాయుద్ధమునందు పాల్గొనియుండిన వివిధదేశముల వారిచే వ్యయముచేయబడియుండిన 80,000,000,000 పౌనులతో గ్రేటుబ్రిటను, అమెరికా, కెనడా, ఫ్రాన్సు, జర్మని, బెల్జియం, రష్యా దేశములందుగల ప్రతియొక్కకుటుంబమునకును, 800 పౌనుల విలువ

నేయు స్థలమును—బల్లలు మంచములు మొదలగుసామానులతోఁగూడిన యింటితోఁగూడ—కొనవచ్చును. ఇది యైనవెనుక వైదేశములలో 200000 ప్రజలుగల ప్రతినగరమునందును, 1000000 పౌనుల విలువగల లైబ్రరీ నెలకొల్పవచ్చును, 1000000 పౌనులతో ఆస్పత్రి పెట్టవచ్చును, 2000000 పౌనులతో సర్వకళాశాలను పెట్టవచ్చును. ఆమిగిలిన మొత్తము నూ 5 చొప్పున ట్రస్టుఫండుగానుంచినచో యేఁడాదికి 200 పౌనులు వృద్ధి వచ్చును. దీనితో 25000 మంది ఉపాధ్యాయులయు, 125000 మంది దాదులయు జీతములు చెల్లించుచుండ వచ్చును. ఇదియంతయును కాఁగా మిగిలిన మొత్తము యుద్ధమారంభమై యుండిన 1914వ సంవత్సరము వాటికి ప్రాన్సు బెల్జియం దేశము లందు గల పబ్లిక ప్రైవేటు ఆస్తుల మొత్తమునకు సరియగును."

—*The Daily Post.*

హైందవ నృత్యము:—

శ్రీమతి డాక్టరు కజిన్సుసతిగారిట్లు వ్రాయుచున్నారు:—

"ఉత్తరహిందూస్థానమున మహేంజదర యను గ్రామముకడ భూగర్భపరీక్షకులు త్రవ్వుచుండునపుడు నారికొకవానె మిటీపల చిక్కెను. ఆవానెము వెనుక నర్తకి రూపమున్నది. ఆవానెము క్రీ.పూ 3000—5000 సంవత్సరముల నడుమనుండు కాలమువాటిదని యూహింపబడెను. కాబట్టి దీనింబట్టి హిందూదేశము నందు నృత్యవిద్య, అంతప్రాచీనకాలమునుండియు నలరారుచుండెనుట యథార్థము. ఆనృత్యమున కుత్పత్తి కారణము మిక్కిలి యుత్కృష్టమైనది. అప్సరసలు నృత్యవిద్య కాధారభూతులు. దేవసభలయందుఁ దత్ప్రీతికై వారు నాట్యము చేయుచుండిరి. మరియు దేవతలుగూడ నర్తకులే. మహాశివుండు లోకముల సృజించి తదనంతర మభయముద్రఁజూపుచు చేతులెత్తి యానందనృత్యముజేసెను. ఆఢక్కానినాదము లయాబద్ధము. అది జగముల నడిపించుచున్నది. కాబట్టి శివుఁడు మహానటుఁడు లేక నటరాజు ననఁబడుచున్నాఁడు. జగత్తులను శాంతికానందమునుండి క్రమముగ బరమానందమునకు నడిపించుకొని పోవునది నిజమేలుగానానుసారియగు శ్రీకృష్ణుని తాండవమే. ఇండియాలో మృదంగమును, మురళియు వాయింపబడుట విన్నపుడెల్ల హైందవ సుజ్ఞానముఖ్యసూచకములగు శైవవైష్ణవసాంప్రదాయములు రెండును స్ఫురించును. ఈరెండును తపోయోగవిశిష్టములు, ఈతపోయోగము లన్యోన్యసంబంధములు. మరియు నిట్టిస్ఫురణవలనఁ దోచునదేమనఁగా మన జీవితముగూడ నొకతీరు లయాకృతిసమన్వితమని. అనగా జీవితమున కొకపద్ధతియును బరమార్థము నున్నది. ఇది యెఱింగినపుడే జీవితము సువ్యక్తమై లోకమున కుపకరించును. మరియు క్రమనియమములనూటి యందుగలదు. ఇట్టి జీవితశాంతిమయమైనది. తదన్యమేమో?—దుఃఖభాజనము.

—*New India.*

జపానుదేశ వివాహసంస్కారము:—

"జపానునందు పదునారుమొదలు పదునెనిమిదివర్షములపర్యంతము వివాహసంస్కారము జరుగుచుండును. వైవాహికప్రణాళి వారిప్రాచీనసమాజనియమానుసారము సంపాదితమగును. మొదట కన్యయొక్క పిత తన యిచ్ఛానుసారము వరుని సేకరించుకొనును. తరువాత సంపూర్ణవివరణపూర్వకముగా కన్య కనగత మొనరించును. పిమ్మట వరునినడిగి వివాహసంబంధమున నాతనిమతామతములను గ్రహించెదరు. ఒకవేళ కన్య తనతండ్రిద్వారా, అథవా ఆప్తాత్మీయునిద్వారా నియమితవరునితో వివాహబంధము సంపాదించుకొనుటయం దనిచ్ఛప్రకటిత మొనరించెనేని ఆయనిచ్ఛ అకారణమైనదేయైనను కన్యాభిప్రాయవిరుద్ధముగా కార్యము జరుపబడదు. జపానునందు యూరోపీయసభ్యసమాజరీతి గాకోర్టుషిప్ అనగా వివాహపూర్వము ప్రకాశ్యపరిణయరీతియును గలదు. వివాహేచ్ఛుకల యువకుడు తన మనోనియత

కన్యావివరణము తన బాంధవుల ద్వారా ప్రకటిత మొనరించుకొనును. ఆ బాంధవులు కన్యయొక్క మాతాపితలతోడ సంబంధమును స్థిరపరచెదరు. వరుని మనోనియత కన్యయే బహుశా వివాహేచ్ఛకుడగు యువకుని పత్నియగును. కన్యయొక్క పిత తన కన్యను యుక్తయువకుని కిచ్చుటకు సమ్మతి యగునేని బాంధవగణ మొక స్థానమందు సమావేశమై వరునియొక్కయు, కన్యయొక్కయు గుణావళీ సంబంధమున నాలోచన నొనరించెదరు. వరునియందును, కన్యయందును దోషమేదియు పరిలక్షితము కాకుండునేని యుభయపక్షములనుండియు నుపహారముల ఆదానప్రదానములు జరుగును. వివాహతిథియును నిశ్చితమగును. మధ్యస్థబంధుగణము, ఆత్మీయగణమును వివాహమునకు సంబంధించిన సమస్తాయోజనముల నొనరించెదరు. ముందుముందు పతిపత్నులకు వివాహవిచ్ఛేదము గలుగునేని దానికొరకు వీరే యుత్తరదాయిగణముగా నుందురు. ప్రాచీనకాలమున మధ్యాహ్నసమయమున వివాహసంస్కారము జరుగుచుండెడిది. కాని ప్రస్తుతకాలమునందు సంధ్యాకాలమున జరుపబడును. వివాహమునకు పూర్వదినమున కన్యయొక్కమాత తనకన్యకు ద్వాదశాజ్ఞాప్రదాన మొనరించును. అవి "Twelve Commandments of the Bride" అను నామముతో ప్రచలితము లగుచున్నవి. ఈ యాజ్ఞాప్రదానరీతి జపానుదేశమునం దనేక శతాబ్దములనుండియు నాచరణయందున్నది. ఉపర్యుక్తద్వాదశాజ్ఞలు నిమ్నభాగమున నుదాహరింపబడుచున్నవి. "౧. ఓ కల్యాణీ! వివాహప్రియాసంపన్నమైన పిమ్మట నీవు మాకు సంబంధించినదానవుగా నుండవు. అద్యావధి నీ వెటుల మాయాజ్ఞానుకూలవగుచుంటివో అటులనే యిప్పటినుండి నీవు నీయత్తమామల ఆజ్ఞానుకూలవగుదువు. ౨. నీపై నీస్వామికి సంపూర్ణాధికారముండును. ఇక్కడనుండి నీస్వామియే నీకు అధిపతి. అతనితోడనే నీశిష్టవినీతవ్యవహారము జరుగును. స్వామి ఆజ్ఞానుకూలముగ దిరుగుటయే స్త్రీకి సర్వోచ్చధర్మమని చెప్పబడుచున్నది. 3. నీ వ్యవహారసర్వస్వము తల్లికి బదులు అత్తతో జరుగుచుండును. ౪. స్వామి చరిత్రయం దెప్పుడును సందేహ మొనరింపరాదు. సందేహించుచో నీయందు స్వామికిగల స్నేహము హ్రాసమగును. ఏ విషయమందైనను స్వామివలన పొరపాటు జరిగె నేని అప్పుడును నీవాతనియెడల రోషప్రకటన మొనరింపరాదు. సహిష్ణుతావలంబన మొనరింపవలయును. అతడు శాంతచిత్తుఁడైనపుడు మృదుభాషతో నీ వాతని పొరపాటు నాతని కవగత మొనరింపవలయును. ౫. స్వల్పభాషిణివై యుండుము. ప్రతివాసినులతో నెప్పుడు నెట్టి యసంతోషవచన మనరాదు. అసత్య మెప్పుడు నాడకుండుము. ౬. నిత్యముషఃకాలమునందే శయ్యాపరిత్యక్త మొనరింపవలయును. రాత్రులం దందఱు శయ్యాగతులైన పిమ్మట నీవు శయన మొనరింపవలయును. దినమందు సర్వతోభావముగ నిద్రాత్యాగ మొనరింపవలయును. ౭. ఏబది సంవత్సరములవయస్సు వచ్చుటకుపూర్వము ఎట్టి సాధారణజనమండలిలోగాని అథవా ప్రకాశకార్యములయందుగాని యోగదాన మొనరింపరాదు. జనులగుంపులోని కెప్పుడును పోరాదు. ౮. జ్యోతిషీజనుల కెప్పుడును నీచేతిని చూపరాదు. ౯. ఉత్తమ గృహపరిచారికవు గమ్ము. విశేషముగ గృహకార్యములయందు మితవ్యయకారిణివి గమ్ము. ౧౦. ఏదోయొక యౌవనావస్థయందే వైవాహికకార్యసంపన్న వయ్యెదవు. అయినను యువకసమాజముతో నీ కధికసంసర్గము గలుగదు. ౧౧. నీ వసనధారణము మిక్కిలి చిత్రవిచిత్రముగా నుండఁగూడదు. సర్వదా సంయతభావముతో వేషవిన్యాస మొనరింపుము. ౧౨. తండ్రి వంశమును బట్టిగాని, ధనమును బట్టిగాని అహంకారముగలదానవు కాకుండుము. తండ్రి ధనికుఁడైనను అత్తవారియింట అతని యైశ్వర్యసంబంధమున గర్వపూర్ణవచనమును బలుకకుము." ఈ యాజ్ఞాసమూహము ప్రత్యేక మొక్కరత్నవిశేషముగానున్నది. జపానుదేశస్త్రీలు ఈయన్నియుపదేశముల ననేకశతాబ్దములనుండి విశేషాదరముతో విశేషయత్నముతో పాలన మొనరించుచువచ్చుచున్నారు. వివాహకార్యము

వరగృహమునందే యొనరింపబడును. వివాహసంస్కారము జరిగిన తృతీయదివసమున నవదంపతులు కన్యాగృహమునుగూర్చి నడచెదరు. దీని యుపలక్ష్యమునందనేకప్రకారములగు నారోజన లొనరింపబడును. కన్యయొక్క పిత వారి బాంధవగణముకొఱకు గొప్పవిందుచేయ ప్రయత్నమొనరించును. నవదంపతీ గృహప్రవేశసమయమున వరపక్షజనము వెంట నానాప్రకారములయుపహారములను, ద్రవ్యాదులను దెత్తురు. వరపక్షకన్యాపక్షములవల్ల నదివర కేయుపహారము లభించెనో, దాని ప్రత్యుపహారస్వరూపముగా నీ యుపహారము వినియోగింపబడును. ఆ సమయమున కన్య తనస్వామివలన ప్రాప్తమైన వస్త్రములనే ధరించియుండును. ఆ వస్త్రములపై వరవంశపరంపరాగతచిహ్నములే విద్యమానమగుచుండును. వాని వలన కన్యక యీసమయము మొదలు పితాపరివారసంబంధమేదియులేక పితృగృహమున నతిథిస్వరూపిణియై వచ్చినటుల భావము సువ్యక్తమగును. ఈ సంబంధమున జరుగునుత్సవము మధ్యాహ్నకాలముబట్టి చాలరాత్రివర కవిచ్ఛిన్నమగును. అనేకప్రకారగీతవాద్య, ఆమోదప్రమోదకార్యకలాపముజరుగును. భోజన సమయమందు కన్యయు, తన్మాతయు నిమంత్రితవ్యక్తులను దర్శింతురు. పిమ్మట రెండుమూడుమాసములకు నవదంపతులు తమబాంధవుల కొకవిందు నొనరింతురు తమయింటియందైన, అథవా పూటకూళ్ళ యింటియందైన, విందుకు వేర్పాటులొనరించి యందఱ నచటికే నిమంత్రితమొనరించుకొనియెదరు. కొందఱేదయిన సుందరమగునుపవనమునందు దీనివేర్పాటునొనరించెదరు. జపానుదేశ బాలిక వైవాహికవస్త్రములచే సుసజ్జితయై పతిగృహమున పదార్పణమొనరించుసమయమున "ఈ సమయముదొట్టి అతనియెడల సతర్కయై తిరుగవలసియుండును" అని తలంచును. ఆ బాలిక సదాచారసద్వ్యవహారముల [illegible]ందే ఆమె భవిష్యజ్జీవనముయొక్క సుఖదుఃఖములు నిర్భరములైయుండును."

—భాగ్యనగరపత్రిక.

ఏకాక్షరస్మరణము:—

"గృహలక్ష్మీ! నేను చెప్పబోవుసంగతి నీవు శ్రద్ధగా గమనించుము. కనకాపురంబునందు "వేదాంత మయ్యంగార్" అను ఒక బ్రాహ్మణునికి 16 సంవత్సరములు వయస్సుగల ఒకకొమారుడు గలడు. ఆకొమారునికి తండ్రి "రామ" యని పేరుపెట్టి అధికప్రేమతో జూచుచుండెను. ఇట్లుండ వేదాంతమయ్యంగార్ వృద్ధాప్యమగుటచే అంత్యకాలకఫవాతరోగబాధలు పడుచుండెను. ఇట్లధికమృత్యుబాధలు పడుచుండియు కొమారుని ఎడబాయక అధికప్రీతితో "రామ" యని పిలుచుచు తనదగ్గరనే పెట్టుకొనియుండెను. రామునకున్ను తండ్రిపై అధికప్రేమవాత్సల్యము లుండుటచేత తండ్రిని ఎడబాయక గంటగంటకు మందులు యిప్పించుచు, ఉపచారములుచేయుచు అధికప్రీతితో తండ్రిదగ్గరనే యుండెను. ఇట్లుండ ఒకసమయమందు తండ్రిపడుకొనియుండిన గదికిప్రక్కగదిలోనికి మందులు కలిపి తెచ్చుటకై పోయెను. అట్టి సమయమందు తండ్రికి అంత్యకాలము తటస్థించియు కొమారునియందుండెడు ప్రేమచేత వానిని చూడదలచి 'రామ!' యని రెండక్షరములుచేర్చి పిలువబోయి సాధ్యముగాక 'రా' యని ఒక అక్షరముచే పిలచి 'మ' యనునంతలో ప్రాణము పోయినది. 'రా' యని తండ్రి పిలచినది కొమారుడు వినియుండియు 'రా' అక్షరముతోకూడా 'మ' అక్షరము చేర్చి పిలువనందువలన "మా తండ్రి యెవరినో 'రా' యని పిలుచుచున్నాడు. నన్నే పిలచేయెడల "రామ" యని పిలువడా" యని తలచి రాముడు రాకనే యుండెను. ఇంతలో తల్లి కొమారుని పిలచి దుఃఖించుచు, "రామ! మీతండ్రి నిన్ను పిలుచుచు ప్రాణము వదలివేసెను. నీవు మీతండ్రి దగ్గరకు రాకపోతివే" అని అడుగ కొమారుడు ఇట్లనియె: "అమ్మా! 'రా' అని తండ్రి పిలచినది నేను వింటిని గాని 'రా' అక్షరముతోకూడా 'మ' అక్షరముచేర్చి 'రామ' యని పిలువనందుచేత నన్నుగాక

ఎవరినో 'రా' యని పిలుచుచున్నాడని తలచి రాకనే యుంటినిగదా" యని దుఃఖించెను. కనుక ఓ గృహలక్ష్మీ! మరణసమయమందు 'రామ' యని రెండక్షరములు చేర్చి భగవంతుని ధ్యానింతుమని నమ్ముటకు సాధ్యముగాకున్నది. పై జెప్పిన వేదాంతమయ్యంగారి మనోభీష్టప్రకారము మరణసమయమున జరుగలేదనే దృష్టాంతము తెలియుచున్నది. ఒకరు బహుకాలము అష్టాక్షరముచే భగవధ్ధ్యానముజేయుచుండి మరణసమయమున ధ్యానముజేయుటకు సాధ్యముగానియెడల నేమిప్రయోజనము? ఇంతకాలము కష్టపడియు ఫలము పొందనివారగుదురు. ఇదిగాక ఈ ప్రపంచమందు అనేకదైవభక్తులు వారివారిమనోభిలాషప్రకారం, పంచాక్షరి, శ్రీరామ, షడక్షరి, యని అనేకవిధములుగా భగవధ్ధ్యానము జేయుచున్నారు. అట్టివారు మరణసమయమున భగవంతుని అష్టాక్షరపంచాక్షరంబులచే ధ్యానింతురని యెట్లు నమ్మవచ్చును? ఇన్ని యక్షరములు పలుకువరకు ప్రాణము పోక నిలచియుండునని ఎట్లుదలంపవచ్చును? అట్లు ధ్యానించుట మానవజన్మమునకు దుర్లభము. కావున గృహలక్ష్మీ! పరబ్రహ్మస్వరూపమైన ఓం అను ఏకాక్షరప్రణవమంత్రమును జనులందరును స్మరణమం దభ్యాసముజేయువారైతే దేహమును విడిచి ఈలోకమునుండి పోవునపుడు ఓం అని స్మరించి ముక్తిపొందవచ్చును. ఓం అను ఏకాక్షరము స్మరించుట సాధ్యమగునని నమ్మవచ్చును. ప్రణవమున కన్యమగు మంత్రము లెన్ని జపించినను ముక్తినొందుట దుస్తరమని మహర్షులు జెప్పుదురు. ఏకాక్షరమైన ప్రణవమంత్రధ్యానమే శ్రీకృష్ణమూర్తి గీతయందుపదేశించినారు. కనుక ఓ గృహలక్ష్మీ! సప్తకోటిమహామంత్రములలో నుత్తమోత్తమమగు ప్రణవమంత్రమును నీ జీవితపర్యంతము శ్రద్ధాభక్తితో సదా ధ్యానించు చుండుము."

— సౌ. పార్వతమ్మగారు.

## నేటి స్త్రీలకనీసధర్మములు:—

దేశోద్ధారక, విశ్వదాత శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు బాపట్లయందలి స్త్రీహితైషిణీమండలివారొసంగిన సన్మానమునకు నిట్టుల బదులుచెప్పిరి:—

"సోదరీమణులారా! ఈ సన్మానమునకు నేను కృతజ్ఞతను దెలుపుచున్నాను. నేను ఇరువదేండ్లకు పూర్వము ఈపురమునందు గుంటూరుమండలమువారి సంఘసంస్కరణ సభకధ్యక్షతవహించితిని. ఆకాలమునందు స్త్రీలయభివృద్ధికై శ్రీమతి చోరగుడి సీతమ్మగారు పాటుపడుచుండెడిది. యువతీసంఘాభ్యుదయమునకై ఆమె నాటిన బీజములు వర్తమానకాలమునందు స్త్రీహితైషిణీమండలియందు పల్లవించుచున్నవి. ఆ కాలమునందు సంఘసంస్కరణసభలందు స్త్రీలపునర్వివాహము, స్త్రీవిద్యాభివృద్ధి, బాల్యవివాహములు, పతిభక్తి మొదలగువిషయములు చర్చింపబడుచుండెడివి. వర్తమానకాలమున నట్టివిషయములను చర్చించుట హాస్యాస్పదముగనుండును. ప్రపంచమునం దంతటను యువతీమండలియందు మహాప్రబోధనము గలిగినది. స్త్రీలు పురుషులతోపాటు సకలవ్యవహారములను నిర్వహించుటకు సమర్థతను గలిగియున్నటులు ప్రపంచవ్యవహారములు విశదముచేయుచున్నవి. రష్యాయందు స్త్రీలు, సైన్యమునందును, యంత్రాలయములయందును, విద్యాలయములయందును, రక్షకభటశాఖయందును, శాస్త్రపరిశోధనలయందును పురుషులనతిక్రమించి పనిచేయుచున్నారు. సకలదేశములందును వివిధవ్యవహారములందును స్త్రీలు పురుషులతో పోటీచేయుచు విజయమును పొందుచున్నారు. వర్తమానకాలమునందు స్త్రీలయభ్యుదయము స్త్రీలస్వాతంత్ర్యమును నితరదేశములకంటెను హిందూస్థానమునం దత్యంతావసరముగనున్నది. స్త్రీలును పురుషులవలె ఆత్మవికాసమును బొందుటకు సంపూర్ణాధికారమును గలిగియున్నారు. వర్తమానకాలమునందు సీత, సావిత్రి, చంద్రమతి, దమయంతి మొదలగు పతివ్రతలచరిత్రములతో సంతృప్తిబొందవలసిన కాలముపోయినది. పురుషులతోపాటు సకలరంగములందును స్త్రీలును స్వీయసంఘాభ్యుదయమునకును, దేశాభ్యుదయమునకును, ధర్మాభ్యుదయమునకును పనిజేయవలసిన శుభసమయము సంప్రాప్తమైనది. ఇతరదేశములందువలెను మనదేశమునందును స్త్రీలు సకల

వ్యవహారములందును సమర్థతను జూపుచున్నారు. శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు రాజకీయములందును,
శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మొదలగువారు సారస్వతమునందును నితరస్త్రీ లితరరంగములందును
చూపుచున్న పరిజ్ఞానము స్త్రీల ప్రత్యక్షజ్ఞానమునకు నిదర్శనముగనున్నది. ఆంధ్రయువతు లనేకులు పురుష
లతోపాటు రాజకీయవ్యవహారములందును మహాత్యాగమునుజేసి దేశారాధనమును చేయుచున్నారు. గాంధి
మహాత్ముడు భారతరంగమునందు పురుషులందువలెను స్త్రీలయందును ఆత్మగౌరవవిశ్వాసములను గలుగజేసి
స్త్రీల శక్తిప్రాభవమును గ్రహింపజేసిన విధము దేశవ్యవహారములు విశదముచేయుచున్నవి. శ్రీమతి సరోజినిదేవి,
కస్తూరిబాయి, ఊర్మిళాదేవిగారలు మొదలగువారు చేయుచున్న త్యాగము, సేవ స్త్రీలనిరుపమానమైన
ప్రతిభకును సాహసధైర్యములకును నిదర్శనములు. హిందూయువతుల శీలమత్యుదారము. వారికిగల శాంతి
స్వభావము, ధర్మప్రవృత్తి, సహనశీలము, పరిజ్ఞానము నిరుపమానము. హిందూయువతుల సహజగుణసంపద
వికాసము హిందూదేశాభ్యుదయమునకు సాధనముగనున్నది. దేశమునందు సగము శక్తి వికాసమునుబొందు
కవకాశములులేనపుడు దేశవికాసము సాధ్యముగాదు. స్త్రీలును యథార్థముగను వారి భాగమును నిర్వహి
చుటకు విద్యావంతులై స్వాతంత్ర్యమును గలిగియుండవలయును. అజ్ఞానము పూర్వాచారాస్పదమై అభ్యుదయ
మునకు ప్రతిబంధకమగుచున్నది. జ్ఞానదీపము ప్రపంచమునందు మానవులకు స్వధర్మారాధనమున కధికా
లను జేయుచున్నది. దేశక్షేమమునకు పాటుపడుటకు స్త్రీలకు పురుషులకన్న నధికతరమైన యవకాశము
గలవు. గాంధిమహాత్ముని యుపదేశముల ననుష్ఠించుటకు స్త్రీలకు విశేషమైన యవకాశములుగలవు. గా
మహాత్ముడు దరిద్రగ్రస్తమైన దేశమునుద్ధరించుటకై ప్రజలకందరకును ఖద్దరుదీక్షను నిర్ణయించిన విషయ
మీకందరకును తెలిసియున్నది. సంవత్సరమునకు 60 కోట్ల రూప్యములను బట్టలకై విదేశముపాలుచే
చున్న దేశమునందు స్త్రీలందరును ఖద్దరుదీక్షనువహించి దేశక్షేమమునకు తోడ్పడుట ధర్మము. నూలు
కుట, ఖద్దరుగట్టుట స్త్రీలకు దేశారాధనమునకు సాధనముగనున్నది. మనదేశమునందంటరానివా ర
బించుచున్న దైన్యము మనసంఘమునకు కళంకమును గలుగజేయుచున్నది. మాలపల్లెలందు మనదేశీయు
మతిసులను అనుభవించుచున్న దుఃఖభూయిష్ఠమైన జీవన మమానుషకరమై స్త్రీల ఆదరణపోషణ
పాత్రముగనున్నది. నే నిటీవలను నరసాపురమునందు శ్రీమతి రామలక్ష్మమ్మగారు నిర్వహించు
శిశుపోషణ సంరక్షణాశ్రమమును జూచితిని. ఆ సంస్థయందు మాల మాదిగ పాకీవాండ్రపిల్లలకు స్నానపా
వసతులను గల్పించుచు చేయుచున్న సాంఘికసేవ మీ సంఘమునకును ఆచరణయోగ్యముగనున్నది.
సేవయే ఈశ్వరసేవ యని సకలమతములు సహస్రముఖముల చాటుచున్నవి. అందు ముఖ్యము
జనావనము భగవంతునకు భక్తిప్రదమైన విషయము. గాంధిమహాత్ముడు పరమహేయమైన అంట
మును నిర్మూలము చేయుటకై పూనిన ప్రాయోపవేశదీక్ష మీకందరకును తెలిసియేయున్నది. గాం
త్ముడు మనకందరకును చేసిన మహోపకారమునకును, స్వధర్మనిర్వహణమునకును మీరందరును యథ
అంటరానితనమును తీసివేయుటకును దీనులనుద్ధరించుటకును పాటుపడవలయునని వేడుచున్నాను.
పురుషులవలె చతుర్విధపురుషార్థములను బడయుట కధికారమును గలిగియున్నారు. ఆయధి
కర్మయోగమూలమునను సాధ్యమగుచున్నది. నిష్కామపరమైన కర్మయోగము పురుషార్థమునకు సా
విధమును గాంధిమహాత్ముని త్యాగజీవనము విశదముచేయుచున్నది. నిష్కామకర్మవలెను కాషాయ
లును, సన్యాసమును కర్మయోగమునకును త్యాగమునకును చిహ్నములు కాజాలవు. మీరందరును వి
యందు మీకుగల యవకాశములను యథాశక్తిని మానవసేవకును, దేశసేవకును, దైవారాధనమును విని
స్వధర్మనిర్వహణము చేయుటకు వేడుచున్నాను."

# గ్రంథపరిచయము

**మైత్రేయి :—**

ఇయ్యది శ్రీ సీతానాథతత్వభూషణునిచే రచియింపబడిన ఆంగ్లగ్రంథమున కాంధ్రానువాదము. అనువాదకర్త్రి జ్ఞానాంబ. పరలోకవాసియగు శ్రీమాదిరెడ్డి తాయారమ్మగారి కంకితమీయబడినది. ప్రాచీనభారతనారీమణియగు మైత్రేయి బ్రహ్మజ్ఞానముచే ప్రఖ్యాతినొందిన యీయుత్తమగ్రంథము నాంధ్రస్త్రీలు యాదరించి కృతకృత్యులయ్యెదరుగాక! క్రౌను 105 పేజీలగ్రంథము. వెల తెలియదు.

**గీతబోధ —**

ఆంధ్రగ్రంథమాల పదునెనిమిదవ కుసుమము. గ్రంథకర్త మహాత్మాగాంధి. అనువాదకుడు ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారు. భగవద్గీతారహస్యమును వెల్లడించు నీయుత్తమగ్రంథము నాంధ్రసోదరసోదరీమణులెల్లరు పఠింపదగినది. వెల 0-4-0. క్రౌనుసైజు పేజీలు 28. వలయువారు. ఆంధ్రగ్రంథమాల, 6-7 తంబుశెట్టివీధి, మద్రాసునకు వ్రాసిన బడయగలరు.

**సబర్మతీ ఆశ్రమ నియమములు :—**

ఆంధ్రగ్రంథమాల 19 వ కుసుమము. గ్రంథకర్త మహాత్మగాంధి. అనువాదకుడు శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు. సబర్మతీయాశ్రమవాసుల యభివృద్ధికొఱకు, ఎఱవాడచెరసాలనుండి, ప్రతిదినము మహాదుత్ముడు ప్రభాతసమయమున పంపుచుండెడి "మంగళప్రభాత్"యనెడు వ్యాసముల సంపుటి. దీనికి శ్రీకాశీనాధుని నాగేశ్వరరావుగారి విపులమగు పీఠికగలదు. క్రౌనుసైజు 62 పేజీలగ్రంథము. వెల 0-4-0అణాలు ఆంధ్రగ్రంథమాల, 6-7 తంబుశెట్టివీధి, మద్రాసు, అనివ్రాసిన బడయగలరు.

**తెలుఁగుసీమ :—**

ఇయ్యది తెలుఁగువీరులయొక్కయు, దేశముయొక్కయు, పతివ్రతలయొక్కయు మహత్వమును వెలిబుచ్చు గ్రంథరాజము. రచయిత బుద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. నిరాడంబరులియగు సర్దార్ గొల్లపూడి సీతారామశాస్త్రిగారి కంకితమీయబడినది. గేయరూపమున లలితపదములతో కూర్చుటచే నీకబ్బమున కొకయందమేర్పడినది. ఆంధ్రులైనప్రతివారును తప్పక చదువదగినది. నిర్దుష్టమైన సాహిత్యము. సులభశైలి. చక్కనియచ్చు. వెల 0-4-0. వలయువారు మానవాదర్శగ్రంథమండలి, అంగలూరు కృష్ణాజిల్లా"యని వ్రాసిన బడయగలరు.

**గాంధిగీత :—**

ఇది మానవాదర్శగ్రంథమండలివారి 10 వ పుష్పము. గ్రంథకర్త మానవజీవితాది గ్రంథకర్తయగు [illegible]యుత దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. నిరంతర దేశసేవాతత్పరులగు మూల్పూరు రంగయ్య, చుక్కమ్మ[illegible]ర్ల కంకితమీయబడినది. మహాత్మునితత్వము బాలునికి సహితము పరిచయమగురీతి యల్లబడినది. ధారణా[illegible]ర్థ్యముకొఱకు హృద్యమగు గేయములు గూర్చబడినవి. మహాత్మునిపవిత్రసందేశమును ఆంధ్రలోకమున [illegible]జేయుచున్న ఈగ్రంథమును విజ్ఞులు ఆదరింతురుగాక! పుటలు 88. వెల 0-8-0. ముద్దుగొల్పు అచ్చు. [illegible]వాదర్శగ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా యనివ్రాసిన బడయగలరు.

**[illegible]వ్వయియనాధబాలికాపాఠశాలశరణాలయనివేదిక:—**

ద్వితీయవార్షికకార్యనివేదిక (Avvai Home and Orphanage) మాకుజేరినది. ఈసంస్థ మైలాపూ[illegible] నెలకొల్పబడియున్నది. శ్రీమతి డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డిగారు దీనికి కార్యదర్శినిగ నున్నారు. పది

మంది బాలికలతో మొదట నారంభింపబడిన యీసంస్థలో రెండవయేడు ముగియుచున్న యిప్పుడు ముప్పది మంది బాలికలున్నారు. దీనినిబట్టి, యీమహోపకారము జేయసమకట్టియున్న స్త్రీలెంత శ్రమపడియుం దురో తెలియునగు. దేశము బాగుపడవలెనన్న నిట్టిసంస్థలు ప్రతిజిల్లాయందునుండి తీరవలెను. ఆయాజిల్లాల యందుగల యిల్లాండ్రు గట్టిగ ప్రయత్నించినచో నిది నెరవేరకుండునా?

**శ్రీకృష్ణలీలాస్మృతి :—**

శ్రీయుత బందా ఆదినారాయణకవికృతము. ఇది 108 పద్యములుగల యొక చిన్న కావ్యము. శ్రీకృష్ణుని చరిత్రమంతయు నిందు ముద్దులుమూటగట్టుపద్యములతో చిత్రింపబడియున్నది. ఇందు భక్తి ప్రధానాంగము. స్త్రీపురుషులందరు జదివి యానందింపవచ్చును. వెల 0-4-0. క్రౌనుసైజు 30 పుటలు. చిరునామా : బి. ఆదినారాయణ, టీచరు, మున్సిపల్ హైస్కూలు, చీరాల, గుంటూరుజిల్లా.

**పొగచుట్టలవలని ప్రమాదములు .—**

మ. రా. శ్రీ దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావు, బి. ఏ., గారు ఆరోగ్యవారపుటుత్సవమున కాకినాడలో నొసగిన మహోపన్యాసము. చుట్టలు, సిగరెట్లు, బిడీలు, కారాకిల్లీలు మొదలగువాని కలవాటుపడి ధనారోగ్యములను బాడుచేసుకొనుచున్నవారిది చదివి తీరవలెను. తత్రాపి విద్యార్థులు! దేశోపకారపారీణులగు శ్రీ సూర్యప్రకాశరావుగారు పితృవాత్సల్యమున నిచ్చిన యీయుపదేశమును విద్యార్థులు ప్రీతిపూర్వకముగ గ్రహించుట పరమధర్మము. డెమ్మీసైజు 22 పుటలు. వెల 0—0—9. గ్రంథకర్తగారికి కాకినాడకు వ్రాయుడు.

**రామకృష్ణ మందిర నివేదిక :—**

శ్రీ రామకృష్ణస్వామిపేరను విద్యార్థినిలయముయొక్క యిరువదియెనిమిదవ వార్షికకార్యనివేదిక నందు కొంట కెంతయు సంతసించుచున్నాము. ఏటేటోత్తరవృద్ధినొందుచు నీసంస్థ యాచంద్రార్కమై యుండు గాక. ఆంధ్రదేశమున నిట్టిసంస్థయొకటి లేకుండుట మిక్కిలి విచారకరము.

**విచారసంగ్రహము :—**

శ్రీ నటనానందస్వామిగారు ద్రవిడభాషయందు వ్రాసిన యీగ్రంథమును, శ్రీ సాధు ధ్యానా నందులవా రాంధ్రీకరించిరి. దుర్గ్రాహ్యములగు తత్త్వవిషయము లిందు తేటతెల్లములగు తెనుగుమాటలతో ప్రశ్నోత్తరరూపమున దెలుపబడియున్నవి. సాధారణజనులును బఠింపవచ్చును. క్రౌనుసైజు 38 పేజీ వెల 0—4—0. చిరునామా :—సాధు ధ్యానానందం, శ్రీ శాన్తిశక్త్యాశ్రమము, ఘంటసాలపాలెం, చ పల్లిపోస్టు, కృష్ణజిల్లా.

**మచిలీపట్టణ బ్రాహ్మణసమాజ అర్ధశతాబ్దవృత్తాన్తనివేదిక :—**

సం. 1882 రమున స్థాపింపఁబడిన యీపవిత్రసమాజము యీనాటివరకు నీశ్వరసేవ జేయుగ యుండుట ఆంధ్రులు గర్వింపదగినవిషయములలో నొకటి. అందును విద్యార్థిదశలో నాదిమసభ్యు యిప్పుడు, కాలజ్ఞానవయోవృద్ధులై యొప్పు ది॥ బ॥ మ॥ రా॥ శ్రీ తిక్కాని బాలాజీరావు నాయు గారును, రా॥సా॥ మ॥రా॥ శ్రీ దేవరకొండ సుబ్రహ్మణ్యం పంతులుగారును చిరజీవులై యుండుట సంతో ముతో గమనింపదగిన విషయము. తాము నాటినమొలక తమయెదుటనే వృద్ధినొంది మహాఫలప్రద యొప్పుచుండుటను గనులారజూచుటకంటె నధికతరభాగ్య మేమున్నది?

**ఆరోగ్యదీపిక :—**

అనకాపల్లి రేంజి, 9వ జాతీయఆరోగ్యశిశువార కమిటీ 1932—33 సంవత్సరపునివేదికయును, మరికొన్ని యారోగ్యసంబంధములగు విషయములునుగల చిన్నసంచిక. సామాన్యజనులును జదివి లాభము నొందవగు పెక్కువిషయము లిందు గూర్పబడినవి.

**గుంటూరుమండల ఆదియాంధ్రసంఘమువారి నిబంధనలు :—**

ఈసంఘము సం॥ 1928 రమున స్థాపింపబడినది. పశుమాంసభక్షణము మాన్పుట, బాలబాలికలకు విద్యగరపుట, కార్మికవ్యవసాయాదుల వృద్ధిచేయుట మొదలగు నిట్టి యుత్తమాదర్శములతో బనిసేయు నిట్టి సంస్థలు సర్వజనసమాదరణము నొందుట భావ్యము.

**శ్రీ రామచంద్ర తారావళి :—**

శ్రీయుత దాసరి అంజదాసకృతము. ఇది ఆదిపూడిలోనున్న "అఘవినాశకగ్రంథమండలి" వారి ద్వితీయకుసుమముగా బ్రచురింపబడినది. "భద్రగిరివాస హనుమంత భక్తపోష, రాజకులచంద్ర భీసాంద్ర రామచంద్ర" యను మకుటముతో నొప్పు నిరువదియేడు సీసపద్యము లింకు నక్షత్రములవలె బ్రకాశించు చున్నవి. కవి పరమార్థియై వ్రాసెను. క్రౌను సైజు 14 పుటలు, వెల 0—1—0. చిరునామా: గ్రంథకర్త: ఆదిపూడి, బాపట్ల తాలూకా.

**వీరగాథలు :—**

మద్రాసు చెట్‌పట్ నందున్న సేవాసదనము హైస్కూలునందు తెలుగుపండితులుగానున్న ఆకుండి వేంకటశాస్త్రిగారిచే రచియింపబడినది. భానునినాటకమగు మధ్యమవ్యాయోగనాటకమునుండి గైకొన బడిన ఘటోత్కచ భీమసేనులగాథ; పరిష్యను దేశచరిత్రమునుండి గైకొనబడిన సోహ్రాబురుస్తుములగాథ; భారతారణ్యపర్వమునందలి సౌగంధికాప్రసూనాపహరణ సందర్భమున నడచిన భీమసేనహనుమంతుల గాథ; సుప్రసిద్ధులగు అభిమన్యుపరశురాముల గాథలు నిందుగలవు. బాలబాలికలు కుతూహలముతో చదువగలరు. పాఠశాలాధికారులు ప్రోత్సహింపగలరని నమ్ముచున్నాము. క్రౌనుసైజున 64 పుటలు. చక్కని గ్లేజుకాగితములు. వెల 0–4–0 అణాలు. ప్రకటనకర్త: ఆకుండి వేంకటశాస్త్రి, శ్రీవ్యాసనికేతనము, ఆర్యాపురము, రాజమండ్రి, తూర్పు గోదావరిజిల్లా.

**తెలుఁగులిపియుఁ, దత్సంస్కరణమును :—**

1931 ఆగష్టు భారతినుండి పునర్ముద్రితము. శ్రీ యం. యస్. వేంకయ్యగారు రచియించినది. తెలుగు అందచందములు, లోపాలోపములు ఇందు కూలంకషముగ చర్చింపబడినవి. జిజ్ఞాసులు పఠింపదగినది. ఆంధ్ర లిపికి సంస్కరణావశ్యకత గలదు. దానికి గడంగుటకు పూర్వము ఇట్లు బాగుగచర్చించుకొనుట మంచిది. వెంకయ్యగారు ఈవిషయమున చూపుచున్న అభినివేశము స్తుతింపదగినది. డబుల్ క్రౌనుసైజున 24 పుటలు.

**సీతావిజయము :—**

దాసరి లక్ష్మణస్వామిగారు రచియించినది. మర్దనకవి ప్రణీతమగు శతకంఠరామాయణమున కిది వచనము సేఁత. సీతను వీరాంగనగ నిరూపించు ఈకావ్యము స్త్రీజనములకు ప్రత్యేకముగ పఠింపదగినదని చెప్పుచున్నాము. విద్యార్థుల కుపకరించు ముఖ్యవిషయము లనేకము లిందు సందర్భోచితములుగ నచ్చటచ్చట నిరూపింపబడినవి. నిరుపమానములగునీతులు, రాజనీతులు తఱుచుగ జొప్పింపబడినవి. క్రౌనుసైజున 124 పుటలు. వెల 0-10-0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేర పిఠాపురము వ్రాయునది.

రామప్రియ :—

"కోటీకుతనయాను గాంచిన శ్రీయుత తాతకృష్ణమూర్తి, బి.ఏ., ఎల్.టి., గారు రచించినదియు, మ॥ రా॥ శ్రీ డాక్టరు బుర్రా శేషగిరిరావు, ఎం.ఏ., పి.హెచ్.డి., గారి యుపోద్ఘాతముతో నొప్పుచున్నట్టిదియు నగు నీమనోహరగ్రంథము భాషాసతి కొక మండనమనుట నిక్కువము. ఇందలి కథలు కొన్ని యిదివఱకే గృహలక్ష్మియందును, భారతియందును ప్రకాశింపబడియున్నవి. ప్రతికథయందు నేదో యొక వింతసొబగు కలదు. స్వభావసిద్ధమగు ధోరణియే గాని వికారమేమియు లేదు. కథాప్రియులందరును దీనిం జదివి యానందింతురుగాక. క్రౌనుసైజు 146 పుటలు వెల 0—12—0. గ్రంథకర్తగారిపేర భద్రాచలం (తూర్పు గోదావరిజిల్లా)కు వ్రాసి గ్రంథములు బడయునగును.

మరపురాని యన్నపూర్ణ.—

శ్రీయుత దరిశి చెంచయ్యగారిని గాని, వారి యర్ధాంగియైయుండి దేశసేవకురాలై స్త్రీలోకము నలంకరించి యచిరకాలముననే దివంగతయైన శ్రీమతి అన్నపూర్ణాదేవిగారిని గాని యెరుంగనివారు ఆంధ్రులలో నరుదుగానుందురు. శ్రీమతి యన్నపూర్ణాదేవి నిజముగా మరపురానిదే. మ॥ రా॥ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు శ్రీ దేవిగారిపవిత్రజీవితసంగ్రహము నీగ్రంథమున దమయుపోద్ఘాతమునందు జెప్పినారు. మఱియు నిందు బత్రికాలేఖలు, సానుభూతిసభలు, సానుభూతిలేఖలు నను మొదటి మూడు ప్రకరణములను జదివిన నాయువతీరత్నము పొందిన యకాలమృత్యువునకు దేశమెంత తహతహపడెనో సులభముగ దెలియవచ్చును. ప్రతియాంధ్రయువతియు నీపొత్తమొకటి యుంచుకొనుట లెస్స. క్రౌను సైజు సుమారు 270 పుటలు. మంచి దళసరికాగితములు. వలయువారు దరిశి చెంచయ్యగారు, జయభారత్ ఇన్సూరెన్సు కంపెనీ, మదరాసు అని వ్రాయునది.

ఆంధ్రకవికుతంత్రము :—

శ్రీయుత సూర్యదేవర రాఘవయ్యచౌదరిగారిచే రచింపబడినది. ఆర్యులనబడువారు, కొందరు, తమగొప్పదనమును ప్రతిష్ఠించుకొనుటకై బుద్ధిపూర్వకముగా నొనరించిన తంత్రము లిందు జూపబడియున్నవి. గ్రంథకర్తగారు సత్యాన్వేషకులై బహుశ్రమలనొంది యనేకగ్రంథములనుండి ప్రమాణముల నెత్తి యిందు జూపియున్నారు. ఈ గ్రంథము కీ॥ శే॥ శ్రీ రాజా పానుగంటి రామారాయణంగారి కంకితము చేయబడియున్నది. క్రౌనుసైజు 130 పుటలు. వెల రూ. 1—0—0. చిరునామా : ఆంధ్రముద్రాక్షరశాల, తెనాలి.

శాద్ధపీఠము :—

సెంటుపాల్ హైస్కూలు తెలుగుపండితులగు బ్రహ్మశ్రీ పండిత వేదం వేంకటకృష్ణ శర్మగారు రచించినదియు, వ॥ రా॥ శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావుపంతులుగారి పీఠికతో నొప్పుచున్నదియునగు నీ గ్రంథము విద్యార్థులు ఉత్సాహముతో చదువదగియున్నది. ఇందు అశోకునిచరిత్ర వ్యాకరణయుక్తముగ భాషలో లెస్సగా దెలుపబడియున్నది. విద్యాశాఖాధికారు లాదరింపదగినది. క్రౌనుసైజు 87 పుటలు. చక్కనిప్రతి 0—6—0. గ్రంథకర్త, వేదము వేంకటకృష్ణశర్మ, ఆంధ్రపండితుడు, సెంట్ పాల్సు హైస్కూలు, వేపేరి, మదరాసు.

భద్రాచలపురవర్ణనము :—

సార్థకనామకమగు సంస్కృతపద్యకావ్యము. తెనుగుతాత్పర్యముతోగూడ నున్నది. బ్రహ్మశ్రీ

వేదాంతం శ్రీరామశాస్త్రిగారిచే రచింపఁబడినది. 161 శ్లోకములతో నొప్పుచున్నది. శ్రీరామభక్తుల కమితానందకరము. కాకినాడ సుజనరంజనీముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

**జంబీర చికిత్స:—**

శ్రీయుత దువ్వూరి రామకృష్ణారావు బి.ఎ., గారు వ్రాసినది. ప్రకృతిగ్రంథమాల 47వ పుష్పము. నిమ్మపండ్లరసముతో పలేకములగు రోగములు నిమ్మళించునని సుప్రసిద్ధాంగ్లేయుఁడగు వాలంటేసువాస్సు గారు వ్రాసినదాని కిది యనువాదము. అందరికిని తెలియదగిన సూక్ష్మవైద్యము. క్రౌనుసైజు 18 పుటలు వెల 0—2—0. ప్రకృతికార్యాలయము, బెజవాడ.

**గృహలక్ష్మి మోక్షమార్గము:—**

శ్రీమతి సి. పార్వతమ్మగారిచే సమకూర్పఁబడినది. మోక్షప్రాప్తికి వలయుమార్గముల నుపదేశించు వేదాంతగ్రంథము. నీతిచంద్రికను బోలి నీతిబోధకములగు చక్కనికథలచే నొప్పుచున్నది. 'అపుత్రస్య గతిర్నాస్తి యనువారోక్తి, 'జీవహింస' మున్నగునవి చక్కగా ఖండింపఁబడినవి. చదువదగిన గ్రంథము. డెమ్మి 16 సైజున 70 పుటలు.

**ఉత్కలపతనము:—**

శ్రీ అశ్వినీకుమారఘోషువిరచితమగు 'కళాపహాడ్' అను ఉత్కలనాటకమునకు 'కవితాసమితి' కార్యదర్శియగు శ్రీయుత పురిపండా అప్పలస్వామిగారి యనువాదము. బెంగాల్ సామ్రాటగు అక్బర్ బాదుషాహకును, ఉత్కలరాజగు ముకుందదేవునకును సంగ్రామముజరుగుటయును, అందు ముకుందదేవున కపజయముగల్గి ఉత్కలరాజ్యము శిథిలమగుటయు నిందలి కథావస్తువు. ముఖ్యముగ ఈనాటకమునందలి స్త్రీపాత్రలపోషణము ఆకర్షణీయముగనున్నది. పురుషపాత్రలకంటె స్త్రీపాత్రలే హెచ్చు ఆకర్షణీయముగ నున్న ఈ వచననాటకము స్త్రీజనులెల్లరు పఠింపదగినది. కాని ఇందలి శైలి అచ్చటచ్చట వింతధోరణిలో నున్నది. అయినను జీవముగలశైలి అని ఒప్పుకొనకతీరదు. ఈ నాటకమును అనువదించుటలో గలిగిన అనుభవమును దారిగాగొని ఆంధ్రకవితారాధకులగు శ్రీ అప్పలస్వామిగారు ఆంధ్రచరిత్రయందలి ఒక ఇతివృత్త మునుగొని నాటకముగా రచియింతురుగాక యని కోరెదము. జాతీయభావపూరితులెల్ల రీనాటకమును చదువ వలయునని హెచ్చరింతుము. డెమ్మీసైజు 165 పుటలు: వెల 0—12—0. చిరునామా: కార్యదర్శి, కవితా సమితి, విశాఖపట్టణము.

**దస్తావేజుల మతలబులు:—**

గ్రంథకర్త—సుప్రసిద్ధవవలాకారులగు శ్రీ కర్లపాలెం కృష్ణరావుగారు. ఇందులో పలువిధములగు దస్తావేజులకు మసోదాలు వ్రాయఁబడినవి. ఇందులోని మతలబుల ప్రకారము దస్తావేజులు వ్రాసికొనుటకు తగియున్నది. వ్యవహర్తల కుపయోగించును. క్రౌనుసైజున 69 పుటలు. వెల 12 అణాలు. ప్రకటనకర్త: పులి పాటి రంగయ్య. పబ్లిషర్ అండు బుక్ సెల్లరు, చీరాల అని వ్రాసిన బడయుగలరు.

**శాకాహార ప్రయోజనము:—**

ఇది మద్రాసు శాకాహారులసంఘమువారిచే ప్రచురింప బడిన 'Superiority of Vegetarian Diet from the Scientific and Hygienic Stand-point' అను ఆంగ్లగ్రంథమునకు మండా వెంకటనరసింహా రావుగారి యనువాదము. ఇందు మానవజాతికిదగిన వివిధాహారములను విమర్శించుచు శాఖాహారముపలని

లాభములను చక్కగా తెలిపియున్నారు. అందఱు చదువదగినది. డెమ్మీ సైజున 56 పుటలు. వెల అణాలు 8. రావుసాహేబు యం. వి. అప్పారావు పంతులుగారు, వెంకటేశ్వరస్వామి దేవాలయమువీథి, బరంపురం. అని వ్రాసిన బడయగలరు.

ఉపాయనము:—

ఏలూరు వాస్తవ్యులగు శ్రీయుత బొడ్డు మల్లికార్జునరావుగారి జ్యేష్ఠపుత్రుఁడు చి. నాగభూషణరావు వివాహమహోత్సవసందర్భమున సుప్రసిద్ధాంధ్రవిద్వత్కవిపుంగవులచే జదువ బడిన యాశీర్వాదపద్యముల సంపుటమగు నీగ్రంథమును కృతజ్ఞతతో నందుకొంటిమి. బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మొదలగు కవిశేఖరుల పద్యరత్నములిందు గలవు. కవులకెంతయునుపయోగించును. ఈరూపముగా బొడ్డువారివంశము సారస్వతమునకు చేసిన సేవ కొంచెముకానిది. తమవంశమును సారస్వతప్రియత్వమున ఓలలాడించుటకు కారణభూతులగు మామిత్రులు, యువకవులు, అవధానులునగు శ్రీ బొడ్డు బాపిరాజుగారి నెంతయు కొనియాడుచున్నాము. గ్రంథ ముచితము. క్రౌనుసైజున 155 పుటలు. 'బొడ్డు మల్లి ఖార్జునరావుగారు, ఆదివారప్పేట, ఏలూరు' అని వ్రాసిన బడయవగును.

# పత్రికా పరిచయము

దేశసేవ:—

ప్రతిశనివారమును వెడలు నీస్వతంత్రవార్తాపత్రిక యీశ్వరకటాక్షమువలన బాఠకమహాశయుల యాదరణము నొందుచు శుక్లపక్షచంద్రునివలె శోభిల్లుచుండుట పరమసంతోషకరము. ముందువెనుకలు తెలియని నేటివిషమ పరిస్థితులలో బహుమెలకువగల్గి రెండేండ్లుగడపి 'దేశసేవ'కు మూడవఏడు ప్రాప్తింపచేసిన సంపాదక మహాశయులు శ్రీ బోడిపాటి రామలింగముగారి నెంతయు కొనియాడుదుము. మూడవ సంపుటపు ఈ తొలిసంచికయందు సాహితీసమితి, సాహిత్యమండలి, ఆంధ్రభారతీతీర్థ మొదలగుసుప్రసిద్ధసంస్థల నలంకరించు ధీరత్నములు, కేవలదేశసేవాభిరతులై వ్రాసినవ్యాసములు—పద్యగద్యాత్మకములగునవి—యిందు విరాజిలుచున్నవి. చందా సం॥ రూ 3 లు. విడిపత్రిక రూ 0-1-0 కార్యస్థానము: బెజవాడ.

సూర్యోదయము:—

నెల్లూరునుంచి ప్రతిసోమవారమువాడును వెలువడుచున్న యాంగ్లేయవారపత్రిక. దేశీయాంతర్జాతీయ సమస్యలను నిష్పక్షపాతబుద్ధితో జర్చించుట యీపత్రికకు సహజభూషణము. రాజకీయార్థికసాంఘిక వాదములయందు "అతిసర్వత్రవర్జయేత్" తను నీతినూతగాగొని యీపత్రిక వెలువడుచున్నది. చందా సం॥ రూ 5 లు. కార్యస్థానము: నెల్లూరు.

దేవాంగపత్రిక:—

ప్రత్యేకసాంఘికాభివృద్ధినిగోరి యీపత్రిక శక్తివంచనలేక పనిచేయుచున్నది. అన్నము ప్రాణమును గాపాడును. వస్త్రము మానముగాపాడును. ఇట్టిమానరక్షకమగు వస్త్రమునుగూర్చిన పరిశ్రమయే జీవనాధారముగ నొనర్చుకొన్న దేవాంగసంఘమునకుఁ జెందియున్న యీపత్రిక ఒకదేవాంగులకేకాక మానవసంఘమున కంతటికిని మాన్యమయినదనుట యథార్థము. చందా సం॥ 1-0-0. కార్యస్థానం. నెం 6 రామానుజకూటమువీథి, చాకలపేట, మద్రాసు.

## డైరి

### డిసెంబరు

18:— కలకత్తా. శ్రీ కూచబిహారుమహారాణీవారిస్మారకచిహ్నమునకై కమిటీయేర్పాటుజరిగెను.

— ఢిల్లీ. శ్రీమతి వేదకుమారి (శ్రీ శ్రద్ధానందస్వాములవారి పుత్రిక) గారును, కౌసల్యాదేవిగారును అస్పృశ్యతానిర్మూలనమునుగూర్చి ఉపన్యసించిరి.

19:— అలహాబాదు. ఐకమత్యసమావేశమున శ్రీ బ్రజలాల్ నెహ్రూసతిగారు ప్రతిపాదించిన స్త్రీలకుసమానహక్కు ప్రతిపాదింపబడి యామోదింపబడెను.

:— త్రివేంద్రం. కొచ్చిలో మూడువారములు సంచారముచేసి శ్రీమతి ఊర్మిళాదేవిగారు యిచటకు వచ్చిరి.

:— తిరువంగోడు. హరిజనదినమున గాంధ్యాశ్రమమున జరిగిన సభకు శ్రీమతి కస్తూరిబాయిగా రధ్యక్షత వహించిరి.

:— కాంటాయి. శ్రీమతి సౌదామినీమహతీగారు సె. 144ను నుల్లంఘించి 6 నెలల శిక్ష నొందిరి.

20:— రాజమండ్రి. శ్రీమతులు దామెర్ల కమలరత్నం, పి. తాయారమ్మ, తలారి చంద్రమతి, యం. కే యస్. నాజరుద్దీన్‌బేగం, బి.యె., (ఆనర్సు) బి. టి., గార్లు అఖిలభారతమహిళామహాసభకు లక్నోపురి కరిగిరి.

21:— ఏలూరు. శ్రీపాదన్న భగవన్నారాయణగారి శిక్ష రద్దుచేయబడెను.

23:— ఢక్కా. పదేండ్ల బాలునకు మూడేండ్ల బాలికకును వివాహమొనరించినందుకు వధూదాసునువాని కైదు నెలల శిక్ష.

— కలకత్తా. ఢగ్గమ హత్యకేసులో ఉరిశిక్షపడిన ప్రబోధకుమార బ్రహ్మచారిగారి తల్లి శ్రీమతి పంకజినీదేవిగారు, శ్రీ సార్వభౌమునకు దాక్షిణ్యవిన్నపమంపిరి. తదంగీకారము నమ్ముదరకును వేచియుండ వీలులేదని జ్యుడిషియల్ కార్యదర్శి తెలియజేయుచున్నాడు.

:— తిరునెల్వేలి. శ్రీమతి ఊర్మిళాదేవిగారు అస్పృశ్యతాప్రచారమునకై దేశభక్త కొం. వెంకటప్పయ్యగారితో వచ్చిరి.

24:— మధుర. శ్రీమతి ఊర్మిళాదేవిగారు తిరునెల్వేలినుండివచ్చి బహిరంగసభలో యుపన్యసించిరి.

— అలహాబాదు. శ్రీమతి స్వరూపరాణీగారు యూనిటీకాన్ఫరెన్సుకు విచ్చేసిరి.

25:— బెజవాడ. శ్రీమతి కాట్రగడ్డ రామసీతమ్మగారు మధుర జైలునుండి విడుదలనొంది వచ్చిరి.

— తిరుచినాపల్లి. కె. బి. సుందరాంబగారు—సుప్రసిద్ధనటి—హరిజనదేవాలయప్రవేశమునుగూర్చి యుపన్యసించిరి.

26:— బొంబాయి. సుబ్బరాయను గారిబిల్లును రాజప్రతినిధి వెంటనే యనుమతింపవలెనని శ్రీమతి సెటల్వాడుసతిగారి యధ్యక్షతతో సభ జరిగినది.

— ఢిల్లీ. ఆర్యకన్యామహావిద్యాలయమున యువతీమణులు కత్తులు, బాకులతో సాముచేసిరి. సభ జయప్రదమైనది.

27:—ఏలూరు. శ్రీ అన్నపూర్ణాదేవిజాతీయబాలికాపాఠశాలను శ్రీ అమృతలాలుఠాకరుగారు దర్శించిరి.

28:—ఉప్పాడసేవాశ్రమమునందు దేశసేవకురాలగు శ్రీమతి సూరమాంబగారను బాలవితంతువును శ్రీ కింగరాజు జాపిరాజుగారను క్షత్రియయువకులు పెండ్లియాడిరి.

29:—తెనాలి. లేడీ డాక్టరు పి. మహాలక్ష్మమ్మగారు, యల్. ఎం. పి. క్రొత్తపేటయందు వారి సోదర గృహమున ప్రత్యేకముగ స్త్రీలకును శిశువులకును గాను వైద్యశాల నేర్పరచిరి.

—చెన్నపురి. శ్రీమతి ఊర్మిళాదేవిగారు హరిజన స్త్రీలను గలసికొనిరి. పిమ్మట తిలకుఘట్టమున మహోపన్యాసమొసగిరి.

30:—పూనా. గురువయ్యూరు దేవాలయప్రవేశసందర్భమున శ్రద్ధవహించిన పొన్నానితాలూకా సోదరీ మణులకు శ్రీమతి కస్తూరీబాయిగారు ప్రశంసాపూర్వకసందేశము నంపిరి.

—ఏలూరు. శ్రీ అన్నపూర్ణాదేవిజాతీయబాలికాపాఠశాలవారు, హరిజనదేవాలయప్రవేశమును సమ్మతింపగోరుచు జామొరినుగారికి విన్నపమంపిరి.

—బెజవాడ. శ్రీమతి రాణీకోటగిరి సూరయ్యమ్మ రావుబహద్దరు జమీందారిణిగారు భారతవస్తు విక్రయశాల స్త్రీశాఖను ప్రారంభించిరి.

31:—లక్నో. అఖిలభారతమహిళాసభవారు జన్మనిగ్రహము, స్త్రీప్రాతినిధ్యము, స్త్రీకూలీలస్థితి బాగు చేయుట విషయములగూర్చి తీర్మానముల గావించిరి.

జ న వ రి

—కటకం. శ్రీమతి మాలను దేవీ చౌదరాణీగారికి 5 నెలల శిక్ష విధింపబడెను.

1:—కలకత్తా. శ్రీ కల్పనదత్తకుమారి కేసువిచారణలో పరారియాయెను.

4:—సత్తెనపల్లి. దేశసేవ గావించి శిక్షనొందియుండిన కమ్మకులతిలకయగు శ్రీ కులసమ్మగారను సం. 17ల యువతి స్వర్గమలంకరించెను.

6:—పెషావరు. శ్రీమతి నిక్కా దేవిగారు పెషావరులో నేయుండవలెనని నోటీసీయబడిరి.

—చెన్నపురి. గాంధిమహాత్ముని నిర్బంధవర్ధంత్యుత్సవసందర్భమున శ్రీమతులు కమలాబాయిఆర్య, అంగచ్చమ్మాళ్, యం. చిట్టెమ్మగార్లు అరెస్టుచేయబడి విడుపబడిరి.

7:—కలకత్తా. శ్రీమతి కిరణబాలదేవిగారు జెస్సూరుకాంగ్రెసుకార్యాలయమున ప్రవేశింపబోయి 3 నెలల శిక్ష నొందిరి.

8:—రేపల్లె. శ్రీమతి ప్రత్తిపాటి సీతమ్మగారి యధ్యక్షతక్రింద బహిరంగసభలో, నస్పృశ్యదేవాలయ ప్రవేశము సమ్మతింప జామొరీనుగారికిని వైస్రాయిగారికిని విన్నపములంపు తీర్మాన మామోదింప బడెను.

9:—అహమ్మదాబాదు. శ్రీమతి కస్తూరీబాయిగారు ఉదయమున నిటకు దయచేసిరి.

—విశాఖపట్టణము. శ్రీమతి ముహినిసాబీగం అను మహమ్మదీయయువతి, కె. సోమన్నగారి పౌరోహిత్యమున హిందూమతమునుగొని 'పద్మిని' యను నామకరణము చేయబడెను.

—మద్రాసు. శ్రీ శారదామహిళాసమితి వార్షికోత్సవసందర్భమున శ్రీ విజయనగర డవేజరు మహారాణీవారు వేంచేసిరి.

11:—నర్సాపురం. స్త్రీలపోటీపరీక్షలో శ్రీమతి తిక్కాని రమాదేవిగారు(కాకినాడ, వయస్సు 13) ప్రథమ బహుమానము, బంగారుపతకమును బడసిరి.

:—బెంగుళూరు. శ్రీమతి నీలవగినీదేవిగారు వాలంటీర్లతోగూడ మార్కెటుకొద్ద రోడ్లుతుడుచుట మొదలిడిరి.

12:—కూచిబిహారు. శ్రీ మహారాణీగారు కలకత్తాలో ప్రాచ్యచిత్రకళాప్రదర్శనమును తెరచిరి.

—అలహాబాదు. జవహర్లాలు నెహ్రూగారితో సంభాషించుటకై శ్రీమతి విజయలక్ష్మి పండిట్, కృష్ణ నెహ్రూ (సోదరి) ఇందు (కుమార్తె) గార్లు డెహ్రాడూను జైలునకేగిరి.

13:—బెజవాడ. న్యాయవాదులైయుండిన కీ. శే. అచ్యుతన్న వెంకట్రావుగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారు స్వర్గప్రాప్తినొందిరి.

—బొంబాయి. గాంధిమహిళాసేవాసేనవారు, హరిజనులను దేవాలయములోనికి రానివ్వవలెనని సుమారు 69324 సంతకములతో జామొరీనుగారికి మహజరునంపిరి.

14:—ఏలూరు. శ్రీ వేంకటేశ్వరాలయమున దశరాత్రమహోత్సవసందర్భమున శ్రీమతి దువ్వూరు సుబ్బమ్మగారు, భక్తినిగురించియు తత్సందర్భమున నస్పృశ్యతనుగూర్చియు నుపన్యసించిరి.

15:—శ్రీరంగం. చెడుపుటిండ్ల నిషేధశాసనము తిరుచునాపల్లిజిల్లాలో నమలుపరచబడెను.

16:—గుంటూరు. ఆంధ్రరాష్ట్రనియంతల సభానంతరమున నుత్సవములో వెళ్లుచున్న శ్రీమతి మానాప్రగడ సుందరమ్మగారికి 2000 రూ. జరిమానా లేక మూడునెలల విడిఖైదును, శ్రీమతులు వెలగలేటి దుర్గాంబ, కాకరపాటి సీతారామమ్మగార్లకు రూ. 2000 జరిమానా సం||రం విడిఖైదును జరిమానా చెల్లింపనిచో 8 నెలలు విడిఖయిదును విధింపబడెను.

17:—ఆశాస్త్రీయగ్రంథములను స్వాధీనమున నుంచుకొనిన నేరమునకు శ్రీమతి సుకుమారీసేనుగారిని తే. 15దీని అరెస్టుచేసి విడుదలచేసిరి.

—తెనాలి. శ్రీమతి కొల్లా తాయారమ్మగారి యింటియావరణలో స్త్రీలకుగా నొకప్రత్యేకపఠనమందిరము నెలకొల్పబడినది.

—నరసాపురము. శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు స్థానికసబ్ జైలునందున్న తమభర్త నరసింహశర్మగారితో సంభాషించుటకు నేడిటకు వచ్చిరి.

18:—ఢిల్లీ. గాంధిదినోత్సవసందర్భమున శ్రీమతి తారాదేవి (ప్యారీలాలుగారి తల్లి) గారిని మరిద్దరు స్త్రీలను ఒక వాలంటీరును అరెస్టుచేసిరి. ఒక్కొకరికి 3 నెలల కఠినశిక్షయు రూ. 60లు జరిమానా లేక 1½ నెల శిక్షయు విధింపబడెను.

19:—బెయిలీ. వైమానికురాలు కనుకొనబడెను. సజీవియైయున్నటుల తుహియాకు 15 మైళ్లు నైరుతిగ కనుగొనబడెను. పెట్రోలు అఖరగుటచే ఈమె యిచట దిగవలసివచ్చెనట. ఆమె ఆరోగ్యముగా నున్నది.

—శ్రీమతి మనోరమాకాండే (53 ఎమర్జన్సీ కౌన్సిలు అధ్యక్షులు) గారును మరిద్దరు స్త్రీలును క్రి.లా.స. చట్టముక్రింద ప్రె|| రా|| మేజస్ట్రేటుగారివలన 6 నెలల శిక్షయు రూ. 30లు జరిమానా లేక 6 వారములు ఖైదును విధింపబడిరి.

20:—సికందరాబాద్. నడియాడుదురంతములసందర్భమున మరణించిన పోలీసుసబుయిన్స్పెక్టరు భార్యకు, పంజాబుప్రభుత్వమువారు, కొంతభూమియును 30 వేల రూప్యముల రొక్కమును బహుమానముగ నిచ్చిరి.



**మూర్ఖత్వమునకేది అవధి :—**

భారతస్త్రీలు పిచ్చినమ్మకములకు పేరుమోసియున్నారు. కాని వారియందును ఈక్రిందివృత్తాంతము అపూర్వమైనదే. జ్యోతిషమును నమ్మి ప్రాణములు తుదముట్టించినది. ఆమె వంగవనిత. రంగూనునందలి టొంగోయందు పి. డబ్ల్యు. డి. ఉద్యోగమునకు కుదిరి యున్నవానిభార్య. మగడు కచ్చేరీకిపోయిఉన్నసమయమున ఆమె ఇంటితలుపులు లోనవైచుకొని చీరతో ఉరిపోసికొని చనిపోయినది. కచేరినుండివచ్చి భర్త తలుపుతట్టినాడు. తెఱవబడలేదు. చేయునదిలేక ఆతడు తలుపు పగులగొట్టి లోనప్రవేశించినాడు. భయంకరదృశ్యము. దూలమునుండి భార్యశవము వ్రేలాడుచున్నది. గదిలో ఒకఉత్తరము పడియున్నది. అందిట్లుండెను. 'కొంతకాలమునకు పూర్వము ఒకానొకజోస్యుడు నాకు అసహజమగు చావుకలదని చెప్పియున్నాడు. ఇది ఆజోస్యమునకు ఫలము. నాకొఱకు మీరు విచారింపవలదు. మిమ్ములను విడనాడిపోవుటకు నాకు విచారముగనే యున్నది. మీరు తిరిగి వివాహము చేసికొనుడు. జన్మాంతరమున నేనుతిరిగి తమ భార్యనగుదునను నమ్మకము నాకున్నది.' చూచితిరా ఎంతటి పిచ్చినమ్మకమో! తనభావిని తెలిసికొనవలయునను కాంక్ష మానవున కనాదినుండియు నున్నది. ఆకాంక్షయే సాముద్రికము, జ్యోతిషము మొదలగువాని పుట్టుకకు కారణమైనదను షీరోగారి వాక్యములందు కొంత సత్యము లేకపోలేదు. కాని ఈవిద్యలు భారతదేశజుల మనములను లోగొనినంత అతిగా ఇతరదేశజుల మనములను గొనలేదు. మనదేశపు విద్యావంతులగు పురుషులే ఇట్టి పిచ్చినమ్మకములకు నచ్చినబంట్లు అయి ఉండగా విద్యాగంధములేని స్త్రీలవిషయమున మిక్కిలి మూర్ఖముగా ప్రవర్తించుచుండుట వింతగాదు. ఇట్టి పిచ్చినమ్మకములు ప్రాణములు తీయుటకు గూడ సమర్థములై ప్రబలియున్నవి. చదువులేమియే ఇట్టివానికి చాలవఱకు మూలము. దానిని తొలగించుటచే ఈదోషము కొంతవఱకు తొలగలదు.

**శయనగృహపారిశుద్ధ్యము :—**

ఆరోగ్యవిషయమున అతిసామాన్యములగు విషయములనుగూడ తెలియనివారు, మనదేశములో, మగవారిలోనే అసంఖ్యాకులుగా నున్నపు డిక స్త్రీలమాట యడుగనేల?

కలకత్తాలో అన్నపూర్ణయను పెండ్లియైన యుక్తవయసుపిల్ల, తనతల్లి నిద్రించిన గదిలో నిదురించుచుండెను. ఆగదికి తలుపులన్నియు మూయబడియుండెను. ఒక చిన్న లాంతరుమాత్రము వెలుగుచుండెను అందువలన విషవాయువుపుట్టి యాబాలిక మృతినొందెను. ఇటులనే ఉత్తరకలకత్తాయందును నొకగదిలో కిరసనాయిలు దీపమునుబెట్టి తలుపులన్నియును మూసికొని ముగ్గురు నిద్రించిరి. తెల్లవారునప్పటి కందులో నొకరుచచ్చి మరియిద్దరును చావ సిద్ధముగానున్నట్లు వినుటకెంతయు జాలిపొడముచున్నది. దోమలబాధ మాన్పుటకు పెక్కండ్రు గదులలో పిడకలు మొదలగువాని పొగపెట్టి వాయువును పాడుచేసి మరల దోమలురాకుండుటకు తలుపులన్నియు మూసికొని నిదురించుట తెనుగుప్రాంతములగలదు. వాయువు విషపూరితమగుటచే గలుగు నిట్టి ప్రమాదములనుండి ఆంధ్రస్త్రీలు నిరంతరము జాగ్రత్తవహింపవలసియున్నదని హెచ్చరింతుము.

శ్రీ గిడుగు సీతాపతి పంతులుగారి విజయము:—

ఈనడుమ చెలరేగిన ఆంధ్రోత్కళసమస్యయందు ఆంధ్రపక్షమువహించి ఉద్యోగమును పోగొట్టుకొనినవారు శ్రీ గిడుగు సీతాపతిపంతులుగారొక్కరే. పర్లాకిమిడిని ఉత్కళములో చేర్చకుండవలయునను వాదమునకు ప్రోత్సాహకర్తలై శ్రీవారు పర్లాకిమిడి రాజావారి అనాదరణకు గురియై రాజావారి కళాశాలయందలి తమ ఉద్యోగమును పోగొట్టుకొనిరి. ఇపుడు వారు ఆరాజావారి కాపురపుకాణాచియగు పర్లాకిమిడియొక్క తాలూకా బోర్డునకు అధ్యక్షమహాశయులైరి. ఇది ఆప్రాంతమున ఆంధ్రత్వమునకు గలిగిన విజయముగా మేము భావింతుము. పర్లాకిమిడిరాజావారు ఉత్కళముతో చేర నెంత ఉవ్విళ్లూరుచున్నను ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ వారేమియు చేయజాలరని ఇందుమూలమున తెలియనగును. ఈ తమవిజయముచే పర్లాకిమిడియందు తెనుగునిలుపుటకు కారణభూతులైన ఆంధ్రపుత్రులు శ్రీ గిడుగు సీతాపతిగారి నెంతయు నభినందించుచున్నాము.

నరసాపురము ఆంధ్రస్త్రీల పోటీపరీక్షల ఫలితము:—

నరసాపురము ఆంధ్రస్త్రీల పోటీపరీక్షలఫలితములు జనవరిమాసమున ప్రచురింపబడినవి. ఈసారి ఈపరీక్షకు 74 గురు స్త్రీలు దరఖాస్తుచేసిరి. 68 గురు పరీక్షకు హాజరైరి. వీరిలో పదిమంది మొదటితరగతిలోను, 19 గురు రెండవతరగతిలోను జయమునుపొందిరి. వీరందఱికిని పుస్తకబహుమానములిచ్చి ప్రోత్సహింప ఈపరీక్షలను నిర్వహించుచున్న నరసాపురము తాలూకాభివృద్ధిసంఘమువారు నిశ్చయించుట ప్రశంసనీయముగనున్నది. ఈజయమందిన వారిలో కాకినాడనివాసిని, పదమూడేండ్లబాలిక శ్రీమతి తిక్కాని రమాదేవిగారు ప్రథమగణ్యయైనదని తెలిసికొనుటకెంతయు ఆనందించుచున్నాము. ఆమెకు 'గృహలక్ష్మి' తన అభినందనముల నందిచ్చుచున్నది. ఇట్లు ఏటేట పోటీపరీక్షగావించి ఆంధ్రస్త్రీలలో విద్యాప్రబోధమును పుట్టించుచు యథాశక్తిని దేశసేవగావించుచున్న ఈసంఘము

వారిని, సంఘమునకు ప్రాణమనదగిన సంఘకార్యదర్శి శ్రీఅద్దంకి బిందుమాధవరావుగారిని మేమెంతయు కొనియాడుచున్నాము.

**నిడదవోలు బాల్యవివాహనిరోధన సంఘము:—**

శారదాశాసనము శాసనసంపుటికి ఎక్కినది. ఆచరణలో దానిప్రభావ మంతగా కానము. దాని నియమము లట్టివి. ప్రజాహితనాయకులు పూనుకొని కోర్టుకెక్కనగాని ఆశాసనమునకు విరుద్ధముగ నడచినవారికి ఎట్టి శిక్షయు విధింపబడుటలేదు. శాసనము యొక్క మంచిఫలముల ననుభవింప కాంక్షగలదేని ప్రజాహితనాయకు లిందుకు పూనుకొన వలసినదే. పూనుకొనుచును ఉన్నారు. విశాఖపట్టణము, బందరు మొదలగు నగరముల యందు ఈవిషయమై శ్రద్ధవహించి పనిచేయు ప్రత్యేకసంఘములు ఈనటికే ఏర్పడియున్నవి. ప్రస్తుతము పశ్చిమగోదావరిజిల్లాయందలి నిడదవోలునం దిట్టి సంఘమొకటి స్థాపింపబడిన దని వినుటకు సంతోషించుచున్నాము. పశ్చిమగోదావరిమండలపు ప్రజాహితనాయకులలో నొకరును, ఏకార్యమును చేసికొనినను దీక్షతోకూడిన విశ్వాసముతో పనిచేయువారును అగు శ్రీ తాడిమేటి కుటుంబశాస్త్రిగారీ సంఘమునకు కార్యద్రష్టలగుటచే దీని జయ నిర్వహణవిషయమై సందేహింపవలసిన పనిలేదు. "10, 12 సంవత్సరముల బాలికలను 50, 60 సంవత్సరములు దాటిన వయస్సుకల్గిన వరులకిచ్చి ఈమధ్యనే ఈజిల్లాలో కొన్ని వివాహములుచేసినారు. అందుకు బాధ్యులగువారిపై చర్య తీసికొనవలసియున్నది. ఇందును గురించి జిల్లాలో చాలప్రచార మొనరింపవలసియున్నది. కార్యనిర్వహణమునకు వెంటనే రు. 250లు కావలసియున్నది. జిల్లాలోని అభిమానులగు ఉదారులు విరాళములనంపి సహాయపడ ప్రార్థితులు" అని సంఘకార్యదర్శులు కుటుంబశాస్త్రిగారు గోరుచున్నారు. పశ్చిమగోదావరిమండలవాసులు వారి ఈకోరిక నెఱవేర్చి సంఘసంస్కరణవిషయమున తమకుగల అభిలాషను వెల్లడింతురుగాక యని హెచ్చరింతుము.

**కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు:—**

కవులకాణాచియగు రాజమహేంద్రవరమునకుచెందిన శ్రీ జనమంచి వేంకటరామయ్యకవిగారు 27 రోజులు సన్నిపాతజ్వరపీడితులై 19.1.33 తేదీని మధ్యాహ్నము 2-20 గంటలకు దివంగితులైరని వినుటకు విచారించుచున్నాము. చనిపోవునాటికి వీరికి అరువదివత్సరములు. ఇందు నలువదివత్సరములు వీరు ఉపాధ్యాయవృత్తియం దుండిరి. ఉపాధ్యాయులై కవులైన శ్రీ వేంకటరామయ్యగారు చిత్తవిక్షేపకారణములైన కష్టముల నడుమనుండియు కవితారచనమును విడనాడలేదు. ఉపాధ్యాయత్వమనిన నిట్టిదియేకదా! 1903లో వీరు ప్రచురించిన మాలతీమాధవము పండితజనాదరణపాత్రమై 1906లో బి.ఏకు పఠనీయగ్రంథముగా నిర్ణయింపబడినది. ఆసంవత్సరమున శ్రీవారు విద్ధసాలభంజిక యను నాటకమును తెనిగించి'మనోరమ'పత్రికలో మాసక్రమమున ప్రచురించిరి. ఈసమయము ననే ఆంధ్రీకరించుటకు ఆరంభముచేసిన ఉత్తరరామచరిత్రమును 1924-లో పూర్తిచేసిరి.

ఈ ఆంధ్రీకరణములకు తోడు శ్రీవారు కొన్ని స్వతంత్రమగు కబ్బములనుగూడ నాంధ్రవాణి కర్పించియున్నారు. పందొమ్మిదేండ్ల ప్రాయమున పుట్టుచదువుతో పుణ్యలోకము నకుబోయిన మానసహపాఠియు, శ్రీవారి పుత్రుడునునగు బ్రహ్మానందమువలన వీరి కవితతో మాకు కాలేజీదినములయందే పరిచయమేర్పడినది. అమృతకలశ, నిత్యమల్లి మొదలగు కొన్ని వీరికావ్యములు ఆంధ్రకవితాసుందరికి నిజముగా నవకుసుమములు. వారి 'నవకుసుమాంజలి'లో తొలిపద్యము 'గృహలక్ష్మి'లో నొకసారి 'పార్వతీపరమేశ్వరులు' అను త్రివర్ణచిత్రమున కెదురుగా ముద్రించియున్నారము. కవితాత్మగల శ్రీవారి రచనములను గూర్చి స్థలసంకోచమున ప్రస్తరింపజాలకుంటిమి. 'గృహలక్ష్మి'కి వచ్చిన లేఖకులలోనొకరును, శ్రీవారి పుత్రులునునగు శ్రీ జనమంచి కామేశ్వరరావుగారి కీకష్టసమయమున మా హృదయపూర్వకమగు సానుభూతిని తెలుపుకొనుచున్నాము. శ్రీవారి యాత్మకు శాంతి కలుగునుగాకయని కోరెదము. ఈనడుమ రాజమహేంద్రవరపౌరులు వడ్డాది సుబ్బరాయుడు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, న్యాపతి సుబ్బరావుపంతులు మొదలగు వృద్ధవీరులను పూజించుటలో యుక్తులై యున్నారు. అగుట వారు మృతుడైన ఈవృద్ధుని అముద్రితములుగానున్న గ్రంథములను ముద్రించి లోకమున కర్పించుటచేతను, మఱి యితర రీతులను పూజించియే తీరుదురని నమ్ముచున్నాము.

ఛాయాచిత్రమాత్రమునకు:—

శ్రీమతి సరోజనీదేవిగారి ఛాయాచిత్రము, మఱికొన్ని ఇతరవస్తువులు కలిగియున్నందుకు చిట్టగాంగులో నొకఉపాధ్యాయుడు నిర్బంధింపబడి, విచారింపబడి, దోషిగాపరిగణింపబడి, వార్నింగుతో వదలివేయబడినట్లు అమృతబజారుపత్రికయందలి ఒకరిపోర్టుమూలమున తెలియుచున్నది. శ్రీమతి సరోజనీదేవిగారు ప్రస్తుతము జైలులోనున్నారు. ఆర్డినెన్సు ప్రకారము పత్రికలలో ఆమె ఛాయాచిత్రము ప్రచురింపరాదు. కాని ఆమె ఛాయాచిత్రము వ్యక్తులకడకూడ నుండరాదను నియమమున్నట్లు కానము. రాజ్యాంగవిషయములందు ఆమెతో ఏకీభవింపని వారుకూడ ఆమె మృదుమధురకవితను ఆరాధించువారు కావచ్చును. అట్టివారు ఆమె ఛాయాచిత్రమును పెట్టుకొనుట దోషముగా పరిగణించుట కెంతమాత్రమును అవకాశములేదు. జయిలోనున్నవానికి ఈయనుద్దేశింపబడిన ఒకానొకగ్రంథములో ఇచ్చువానిఛాయాచిత్రముండినందులకు ఆగ్రంథము నిర్బంధితునకీయ నిరాకరింపబడిన నాగపురపువార్త గృహలక్ష్మిపాఠకు లెఱింగియున్నారు. దానికంటె ఇపు డీవార్త మఱియు విచిత్రముగనున్నది. ప్రభుత్వశాసనములను అమలుజరుపు అధికారులు ఆశాసనముల నిబంధనలను సరిగ గమనింపకుండుటచే అప్పుడప్పు డిట్టిన ఘటనలు కలుగుచున్నవి. ఇకనైన నవారు మెలకువతో ప్రవర్తింప ప్రభుత్వమువారు శ్రద్ధబెట్టుదురుగాక! 'హిందూదేశపునైటింగేలు' అను ప్రఖ్యాతినార్జించిన సరోజనీదేవిగారి ఛాయాచిత్రమును కలిగియుండుటయే ఒకదోషమగునేని విద్యావంతమైన ప్రతిహైందవగృహమును అట్టిదోషమునకు తావలమైనదేయగును.


LODHRA
FOR
LADIES'
HEALTH
RADIATES
Domestic
Sunshine
Into
Every Home
KESARI KUTEERAM. EGMORE
MADRAS
లోధ్ర
స్త్రీల ఋతుదోషాది రోగములకు

